# కూరగాయల వాయిద్యాలు

సచిత్ర విచిత్రం



వీనుల విందైన సంగీతాన్ని వినడానికి ఎలాంటి వాద్య పరికరాలూ అనర్థం కావని నిరూపించారు 'వియన్నా వెజిటబుల్ ఆర్కెస్ట్రా' అనే కళాకారుల బృందం. వీరు వివిధరకాలైన కాయగూరలను ఉపయోగించి చక్కటి సంగీతాన్ని శ్రోతలకు అందిస్తున్నారు. క్యారెట్లు ఫ్లూట్లుగాను, వంకాయలు, పెద్ద గుమ్మడికాయలు ఇలా వివిధ రకాల కాయగూరలతో నడిచే వీరి కార్యక్రమం ఎందరినో ఆకట్టుకుంటోంది. మధ్య మధ్య వంట గదుల్లోంచి స్పూన్లు వగైరా సహితం తెచ్చి ధారాళంగా వినియోగిస్తున్నారు. ఆస్ట్రియాకు చెందిన ఈ బృందం కాయగూరలను కోసేటప్పుడు వచ్చే మృదువైన శబ్దాలు వాయిద్యాలుగా ఉపయోగించవచ్చని తెలుసుకుని ఆ స్ఫూర్తితో విజృంభించింది.

# చతుర కతలు

## తృప్తి

అప్పటికి నాలుగు రోజుల్నుంచీ సరిగా నిద్ర పట్టడంలేదు రామనాధానికి. అతని కూతురు గురించిన ఆలోచనే అందుక్కారణం. అమ్మాయికి పాతికేళ్లు వచ్చాయి. ఇటు చదివించే తాహతూలేదు, అటు వేలకువేలు కట్నాలు ఇచ్చి పెళ్లి చేసే స్తోమతూ




లేదు. వాళ్ల పిచ్చి కాకపోతే ప్రభుత్వం ఆడపిల్లలకు 18 ఏళ్లు వయసు లోపల పెళ్లి చేయకూడదని శాసనం చేసింది కానీ అసలు ఈ రోజుల్లో ఏ ఆడపిల్లకు పాతిక లోపల పెళ్లవుతుంది? ఇంకా కొంతమందికి 30 వచ్చినా కావటంలేదు. దాని భవిష్యత్తు ఏమవుతుందో ఏమో! దానికి పెళ్లి ఎప్పుడవుతుంది? ఎలా అవుతుంది? ఏం చేయాలి? బుర్ర నిండా ఈ ఆలోచనలే రామనాధానికి.

తను అసలు తన కూతురి పెళ్లి చేయగలుగుతాడా? చేయలేకపోతే అటు చదువు కూడా పెద్దగా లేని తన కూతురు ఏమవుతుంది? రామనాధానికి మాటిమాటికీ తను చూసిన సినిమాలు, చదివిన కథలే గుర్తుకొస్తున్నాయి. ఓ కథలో తనకు పెళ్లి చేయలేని తండ్రి అశక్తతకు జాలిపడి, ఉరి పోసుకుంటుంది ఓ కన్నెపిల్ల. వేరొక కథలో తనకు ఓ ఆసరా కల్పించలేని తన తండ్రిని నిందిస్తూ ఎదురింటి కాలేజీ కుర్రాడితో లేచిపోతుంది ఓ పడుచుపిల్ల. తన కూతురు కూడా...

ఇవే ఆలోచనలు రామనాధానికి. 'ఏం చేయాలి? ఏం చేయగలడు?' నిద్ర పట్టటం లేదు. అన్నం సహించటంలేదు. జబ్బుపడ్డవాడిలా తయారవసాగాడు రామనాధం.

ఓ రోజు బజార్లో చిన్ననాటి స్నేహితుడు స్వామినాధం కనిపించాడు. రామనాధాన్ని చూడగానే బావురుమన్నాడు స్వామినాధం. "బ్యాంకులో 50 వేలు అప్పు తీసుకున్నాను. రేపు మధ్యాహ్నానికి ఆ డబ్బు కట్టకపోతే ఇల్లు వేలం వేస్తానంటున్నాడు బ్యాంకు ఆఫీసర్. ఇంట్లో సామానుతో సహా అంతా ఇది


4 మే 2004 స్వాతి

వరకే జప్తుకుపోయింది. రేపు ఆ వేలమూ అయిపోతే ఆ కాస్త పరువూ బజారుకెక్కితే ఇక బతికి కూడ దండగే" కళ్లనీళ్లు పెట్టుకున్నాడు స్వామినాథం.

స్నేహితుడికి ఏదో రెండు ఓదార్పు మాటలు చెప్పాడు రామనాథం.

ఇంతలో కన్పించాడు మందుల షాపు శంకరయ్య, పరుగు పరుగున పోతూ. రామనాథం పలకరించగానే ఆగి భోరుమన్నాడు శంకరయ్య. "ఉన్న డబ్బంతా పోసి షాపు పెట్టాను. అంతా మంటల్లో మాడి మసి అయింది. ఇన్సూరెన్స్ కూడా లేదు. ఇక బజార్లో నిలబడాలి బాబూ నేనూ, నా పెళ్లాం పిల్లలూ. ఏం చేయాల్లో ఏమీ తోచటంలేదు" అంటూనే మళ్లీ పరుగు లంకించుకున్నాడు శంకరయ్య.

ఆ రాత్రి పక్కపై పడుకున్న రామనాథానికి రేపు బజార్లో పడబోతున్న స్వామినాథం పరువూ, శంకరయ్యా, అతని పెళ్లాం పిల్లలూ మనసులో మెదిలారు. తన కూతురి గురించిన ఆలోచనే రాలేదు.

చాలా రోజుల తరువాత 'తృప్తి'గా నిద్రపోయాడు రామనాథం.

– కొండపల్లి రామారావు

---

## అర్థాలే వేరులే...

ఏదైనా పనిచేస్తే దానికి ఏదో వంకపెట్టి తప్పించుకోవాలని చూడడం మనిషి లక్షణం. కాని దానికి ఏదో మూల కారణం వుంటుందని అర్థంచేసుకోరు.

"ఏమోయ్ 1993కు సంబంధించిన ఒక ఫైలు కావాలి. రికార్డ్ రూమ్‌కి వెళ్ళి 211/93 ఫైల్సు వెతికి తీసుకురా" అన్నారు తన అసిస్టెంట్‌తో ఆఫీసరుగారు.

అసిస్టెంట్ సుబ్బారావు ముఖం అదోలా పెట్టి; "ఎక్స్‌క్యూజ్ మి సర్, నాకు రికార్డ్ రూమ్‌కి వెళ్తే ఆ దుమ్ముకి అలెర్జీ అండి. ఒకటే తుమ్ములు వచ్చేస్తాయి. ఇంకెవరికైనా చెప్పండి" అన్నాడు. మనం ఎవరికైనా పనిచెప్తే, వాళ్ళు అడ్డం తిరిగి మాట్లాడితే చచ్చేకోపం వచ్చేస్తుంది.

"అదేంటయ్యా ఎప్పుడు రికార్డ్ రూమ్‌కి వెళ్ళమన్నా ఎలర్జీ అంటావ్. నీకు ఇష్టం లేకపోతే ఆపని చెయ్యనని చెప్పు. అయినా నీకు బద్ధకం ఎక్కువయిపోతూంది" అన్నారాయన.

"అదికాదు సర్ ఈ విషయం మీకు ఎన్నోసార్లు చెప్పాను." ఆయన అతని మాటలకు అడ్డువచ్చి, "నో మోర్ ఆర్గ్యుమెంట్స్" అంటూ ఇంకోతనికి ఆ పని చెప్పారాయన.

చాలాకాలంగా అపరిష్కృతంగా వుండిపోయిన ఆ ఫైలు గురించి ఈరోజు హైదరాబాద్‌నుండి ఆఫీసరుగారి బాస్ వస్తున్నారు. ఆయనతో చర్చించి ఆ ఫైలు పరిష్కారం చేయాలి. ఇలా ఆలోచిస్తుండగానే ఆయన కారు రావడం, ఆయన ఆఫీసరుగారి గదిలో ప్రవేశించడం ఒక్కసారి జరిగిపోయాయి.

"ఏమండీ ఆ ఫైలు తీయించారా?" అన్నారు బాస్ లోపలకు వస్తూనే.

"క్షణంలో వచ్చేస్తాయండి ఆ ఫైల్సన్నీ. రికార్డ్ రూమ్‌లో వెదికిస్తున్నాను" అని ఆఫీసరుగారు అన్నాడో లేదో ఆయన బాస్ ఫైరయిపోయి "పదండి" అంటూ రికార్డ్‌రూమ్ వేపు చకచకా వెళ్తుంటే, ఆయన్ను అనుసరించారాయన.

రికార్డురూమ్‌లో ఆ ఫైల్స్ వెదికి దుమ్ము దులుపుతున్నారు సిబ్బంది. అక్కడ దుమ్ము లేస్తూంది.

అంతే, ఆఫీసరుగారి బాస్‌కి తుమ్ములు మొదలైనాయి. ఒకటి- మూడు-తొమ్మిది అలాగ తుమ్ముతూనే వున్నారాయన.

ఆఫీసరుగారు తన బాస్ తుమ్ముతుంటే కంగారుపడి, సీరియస్‌గా నాన్‌స్టాప్‌గా




తుమ్ముతున్న ఆయన్ను తన గదిలోకి తీసుకువెళ్ళి, "మీరు కూర్చోండి సర్ వాళ్ళు ఫైల్సు తెస్తార్లెండి" అన్నారు. ఆయన ముఖం ఎర్రగా అయిపోయింది. ఆయన ముక్కు దొండపండులా అయిపోయింది.

"నాకు డస్ట్ ఎలర్జీ. ఎవిల్ టాబ్లెట్స్ తెప్పించండి. ఆ ఫైల్స్ దుమ్ము దులిపించండి. నేను గెస్ట్‌హౌస్‌కి వెళ్తాను. డిస్కషన్స్ మధ్యాహ్నం పెట్టుకుందాం" అంటూ ఆయన లేచారు.

"అయ్యో మీరెందుకు రికార్డ్‌రూమ్‌కి వెళ్ళారు సర్. అలర్జీ వున్నప్పుడు జాగ్రత్తగా వుండాలికదా" అంటున్నారు తన బాస్‌తో ఆఫీసరుగారు.

ఆఫీసరుగారి వెనకాలే వున్న అసిస్టెంట్ సుబ్బారావు "రికార్డ్‌రూమ్‌లోకి వెళ్తే తుమ్ములొస్తాయంటే ఆఫీసర్లకైతే డస్ట్ ఎలర్జీ-గుమాస్తాలకైతే బద్ధకం అని అర్థం అన్నమాట" అనుకుంటున్నాడు ముక్కుకు జేబురుమాలు అడ్డం పెట్టుకుని.

– కె.బి. కృష్ణ

## లేనేలేదు

**జో**గారావు కాలు కాలిన పిల్లిలా హాల్లో పచార్లు చేస్తున్నాడు. పొంగుకొస్తున్న కోపాన్ని దిగమింగే ప్రయత్నంలో గుప్పిళ్ళు మూసి గాల్లో విసురుతున్నాడు. అతని భార్య ఆదిలక్ష్మి సోఫాలో కూర్చుని వుంది. కూర్చున్నదన్నమాటేకానీ స్థిమితం లేదు. ఆమె మనోస్థితి ముఖంలో ప్రస్ఫుటిస్తోంది. ఒకరితో ఒకరు మాట్లాడకుండా తమలో తామే గొణుక్కుంటున్నారు. కొంతసేపటికి ఆదిలక్ష్మి అంది, "ఎందుకండీ అలా తిరుగుతారు. అసలే ఆయాసం మనిషి కూడాను. ఇలా వచ్చి కూర్చోండి. ఎలాగూ రానే వస్తాడుకదా. వచ్చిన తర్వాత అనే నాలుగూ అనేసి ఓ నమస్కారం పెడదాం" అని.

"ఏం చేస్తాం పెట్టక. చూస్తూ, చూస్తూ ఇలాంటి సంబంధం చేసుకోలేంకదా, ఉన్న ఆ ఒక్కడికీ. రానివ్వు వాణ్ణి. వాడి సంగతేంటో తేల్చి అవతల పడెయ్యనూ. ఇంత మోసం చేస్తాడా నన్ను. నాతో పెట్టుకున్న వాణ్ణి- వదిలి పెడతానా నేను" కళ్ళల్లో నిప్పులు కురిపిస్తూ అన్నాడు జోగారావు.

"ఎన్ని కబుర్లు చెప్పాడండీ మెత్తమెత్తగా.

6 మే 2004

అదంతా నిజమేనని నమ్మాంకదా. ఇంత నమ్మకద్రోహం చేస్తాడనుకోలేదు"

ఆ ఇద్దరూ కూడా మాటల్లో 'వాడు' అన బడే పెళ్ళిళ్ళ పేరయ్యని దుమ్మెత్తిపోస్తూనే ఉన్నారు.

జోగారావు, ఆదిలక్ష్మిలకి ఒక్కడే సంతానం సోంబాబు. కాస్త గారాబంగా పెరిగిన మాట నిజమే అయినా అల్లరిచిల్ల రిగా తయారుకాలేదు. బుద్ధిమంతుడు. దానికి తగ్గట్లుగా అందగాడు. ఆపైన జోగా రావు ఎడాపెడా సంపాదించిన బోలెడు ఆస్తిపాస్తులకి ఏకైక వారసుడు. ఇన్ని ప్లస్ పాయింట్లున్నా అదేం ఖర్మమో పాతికేళ్ళు పైబడ్డా పెళ్ళి కావడంలేదు. ఏ పిల్లని చూసినా నచ్చలేదంటాడు. "పోనీ నీ మన సులో ఎవరన్నా ఉన్నారా? " అంటే,

"అబ్బే... అలాంటిదేమీలేదు" అంటాడు. పైపెచ్చు "నాకిలాంటి ప్రేమాదోమా పెళ్ళి ళ్ళంటే అసలు నచ్చదు. పెద్దలు కుదిర్చిన పెళ్ళిళ్ళే మేలు" అంటాడు.

"సరైన సంబంధం కుదిరితే పెళ్ళి చేసుకో వడానికి ఏమీ అభ్యంతరం లేదు" అంటాడు. ఆ సరైన సంబంధం ఏమిటి? ఎంతమంది అమ్మాయిల్ని చూసినా తేలడం లేదు. చుట్టాలు, స్నేహితులు, హితులు, సన్నిహితులు చెప్పిన సంబంధాలన్నీ చూశాడు. కొన్నింటిని మొదట్లోనే కాదను కున్నా, మరికొన్ని పెళ్ళిచూపులదాకా వెళ్ళినా ఏ అమ్మాయినీ ఎంపిక చేయలేదు.

"ఇక ఇలా పనికాదు కానీ ఆ పెళ్ళిళ్ళ పేరయ్యకి కబురు చేస్తాను. అతగాడేమన్నా సంబంధం కుదురుస్తాడేమో" అన్నాడు జోగారావు. ఆ ప్రతిపాదనకు తల్లీకొడుకులి ద్దరూ అంగీకరించారు.

అలా కబురు పంపారో లేదో ఇలా వచ్చి పడ్డాడు పెళ్ళిళ్ళ పేరయ్య. భుజాన తగిలిం చుకున్న సంచీలోనుండి ఆడపిల్లల తాలూకు ఫొటోలున్న ఆల్బంలు ఓ అరడజను పైగా బయటకు లాగాడు. ఒక్కొక్క ఫొటోనే చూపిస్తూ వాళ్ళవాళ్ళ వివరాలను విపు లంగా వివరించాడు. పుట్టుపూర్వోత్తరాలన్నీ క్షుణ్ణంగా పరిశీలించి ఒకటికి పదిసార్లు చూసి యోచించి ఓ అమ్మాయిని ఎంపిక చేశారు. ఆపైన పెళ్ళిచూపులు, కట్నకానుకల బేరసారాలు అన్నీ ముగించి ముహుర్తాలు కూడా పెట్టుకున్నారు. ముహూర్తం కూడా దగ్గరపడుతోంది.

ఇంతలో ఏమయిందో... ఈ హడావుడి.

ఆపసోపాలు పడుతూ వచ్చాడు పెళ్ళిళ్ళ పేరయ్య "నమస్కారం జోగారావుగారూ..." అంటూ.

"ఆ... నమస్కారాలకేంలే. నీకేం తక్కువ చేశామని మాకు ఇలాంటి సంబంధం చెప్పావు. నీ కమిషన్ నీకు దండిగానే



ముట్టుచెప్తానన్నాను. అలాగే ఇచ్చాను కదా" అంటూండగానే మధ్యలో అన్నాడు పెళ్ళిళ్ళ పేరయ్య.

"ఏమయిందండీ. విషయం ఏమిటో చెప్ప కుండా మీ తిన్న మీరు అలా కోపం చిత్తగి స్తారేమిటి? "

"కాపోతే ఏమిటి మరి. నువ్వు తెచ్చినసం బంధం అంటే... ఏ వంకా ఉండదన్న నమ్మకంతోనేకదా నిన్ను పిల్చింది. నువ్వు చెప్పావుకదా అన్న భరోసాతోనేకదా ఈ సంబంధం ఖాయపరచుకున్నది"

"అవును కదా. ఇప్పుడేం తేడా వచ్చింది. మీరన్నట్టుగానే పాతిక కాసుల బంగారం పెడ్తున్నారు. తమరు కోరినట్టుగానే పది లక్షల సొమ్ము బ్లాకులోనే ఇస్తున్నారు. ఇతర లాంఛనాలన్నీ ఏ ఒక్కటీ విడిచి పెట్ట కుండా జరిపిస్తామన్నారు. అన్నీ చేసి ఏమీ లేనట్టుగానే అమ్మాయి అందచందాలు చూసి అబ్బాయి మనసుపడి ఊరకనే చేసు కుంటున్నాడని చెప్పుకుంటామని మాటి చ్చారు. ఇంకా ఏం లోటొచ్చింది స్వామీ..." అన్నాడు పెళ్ళిళ్ళపేరయ్య.

"అన్నీ బాగానే చేస్తున్నారులేవోయ్. కాద న్నదెవరు. అమ్మాయికి నిద్రలో లేచి నడిచే అలవాటుందటగదా. ఆ విషయం మాకు చెప్పకుండా దాచిపెట్టలేదూ" కోపంగా అడి గాడు జోగారావు.

"అయ్యో జోగారావుగారూ... ఎవరో కిట్ట నివాళ్ళు ఏదేదో చెప్తుంటారు. అవన్నీ నమ్మె య్యడమేనా. రాత్రుళ్ళు కాలు పక్కనపెట్టి పడుకుంటుంది. మరింక ఎలా నడుస్తుంది చెప్పండి" అసలు నిజం బయటపెట్టి నాలిక కరుచుకున్నాడు పెళ్ళిళ్ళ పేరయ్య.

"ఏమిటీ! కాలు, తీసి పక్కన పెడు తుందా? " అన్నాడు జోగారావు కంగారుగా.

"అంటే... అంటే... అదీ... ఆర్టిఫిషి యల్ లెగ్ అనుకోండి" అంటూ ఎందుకైనా మంచిదని దూరంగా జరిగాడు పేరయ్య.

'ఆ...c" అంటూ నోళ్లు తేలేశారు జోగారా వు దంపతులు.

– సువర్చలాజ్యోతి

---

## సరస కాంతా కాంతులు

"ఏమిటో తెల్లారి లేస్తే ఆ వంటింట్లోనే అఘోరిస్తుంది. ఒక మాటాలేదు, మంతీ లేదు! అప్పుడే ఎనిమిదిన్నరవుతోంది. పొద్దున ఆరున్నరకి తాగిన కాఫీయే! మళ్ళీ కాఫీయే లేదు." రెండోసారి కాఫీ తాగితేనే కాని స్నానం చెయ్యడు చక్రపాణి!

"మేడమ్ కాస్త కాఫీ తగలేస్తావా? " అంటూ గట్టిగా అరిచాడు, తన భార్య సూర్యకాంతాన్ని ఉద్దేశించి.

"ఆ ఇప్పుడే స్టవ్‌మీద తగలబడుతోంది కాఫీ! మీకేం మగమహారాజులు. ఏ పేపరో చదువుకుంటూ అన్నీ ఆర్డర్ ఇస్తారు! నేను, పొద్దున్న లేచినప్పటినుంచీ రాత్రిదాకా ఒక్క దాన్నీ చాకిరీ చెయ్యలేక ఛస్తున్నాను" అంది సూర్యకాంతం.

"అబ్బ! ఒక్కదాన్నీ చేయలేకపోతున్నానీప నంతా" అనే మాట రోజుకి పదిసార్లైనా అంటుంది ఈవిడ. ఛస్తున్నాను వినలేక! మనిషికి ఎంతమంది భార్యలుంటారు! తను మాత్రం అన్ని పనులూ ఒక్కడూ చేసుకో వటం లేదా" అనుకున్నాడు చక్రపాణి.

మరుసటిరోజు కూడా ఇదే తంతు! ఇక లాభంలేదు! ఈ మాట మరిపించాలంటే ఏదో ఒకటి చెయ్యాలి అనుకున్నాడు చక్రపాణి.

ఆఫీసుకి వెళ్ళాడు. తన మిత్రుడొకడు అతని భార్యకి బాత్‌రూమ్‌లో పడడంవలన కాలు కొంచెం విరిగిందనీ, మూడునెల్లపాటు ఒకావిడ్ని వంటా, మిగిలినపన్లు కూడా చెయ్యడానికి కుదిర్చానని చెప్పాడు.

★ ★ ★

సాయంకాలం చక్రపాణి ఇంటి కాలింగ్ బెల్ మోగింది. సూర్యకాంతం తలుపు తీసింది. ముప్ఫైఅయిదేళ్ళావిడ మంచి తెల్లటి చీర కట్టుకుని, ఒక వేనిటీ బ్యాగ్ భుజానికి తగిలించుకుని గుమ్మంలో నిలబడుంది. మంచి శరీరఛాయా!, అందమైన గుండ్రని ముఖమూనూ!

"ఎవరు కావాలి మేడమ్" అంది సూర్యకాంతం.

"చక్రపాణిగారు లేరాండీ! వాళ్ళ ఇంట్లో ఇల్లు సారీ! చిన్నగది చూపిస్తారా!" అంది ఆ వచ్చినావిడ.

"ఎవరో అనుకున్నాను. నువ్వు రేపొద్దున్నరా! ఆ చక్రపాణిగారుంటారు. అప్పుడు మాట్లాడదాం" అని పంపేసింది ఆవిడ్ని సూర్యకాంతం.

రాత్రి ఆఫీసునుంచి వచ్చిన చక్రపాణితో అంది సూర్యకాంతం, "ఏమిటండీ! దాన్నెవర్నో కుదుర్చుకున్నారట. పైగా చిన్న ఇల్లు చూపించమని అడిగింది, ఆ వన్నెలాడి"




వంట చెయ్యడానికి రమ్మన్నారు" అంది ఆవిడ.

'ఈరోజు మా ఇంట్లో ఏం ఫంక్షన్ లేదు కదా, వంట చెయ్యడానికి మనిషెందుకూ? అనుకుంటూ "మీరేదో పొరపాటుగా వచ్చుంటారు. ఎడ్రస్ ఏమిటి" అంది సూర్యకాంతం.

ఆమె తన బ్యాగ్‌లోంచి ఎడ్రస్ ఉన్న కాగితం తీసి చూసింది. ఆ ఎడ్రస్ తన భర్త రాసిందే! ఆమె అంది, "నెలకి ఆరువందల జీతం, ఉండడానికి వసతి, భోజనం" అని చెప్పి తన భార్య ఒక్కర్తీ ఇంట్లో పని చేసుకోలేకపోతోందని చెప్పి నన్ను కుదుర్చుకున్నారు చక్రపాణిగారు. నేనుండే ఆ చిన్న

"వన్నెలాడి కాదే! వన్నెలేడీ! నువ్వొక్కదానవూ పనంతా చేయలేకపోతున్నానని రోజుకి పదిసార్లైనా అంటున్నావు. నువ్వు కష్టపడడం ఇష్టం లేక ఆవిడ్ని కుదిర్చాను. ఏం తప్పా!" అన్నాడు చక్రపాణి.

"మీ మొగాళ్ళెంతకైనా తగుదురు" అని నవ్వేసింది సూర్యకాంతం! ఆ తర్వాత అన్ని పన్లూ తనొక్కర్తే సులువుగా చేసేసుకునేది! పాపం ఏ చేస్తుంది!

– భమిడిపాడి సోమయాజి

★

# చతుర

316వ సంచిక సంపుటి: 27
సంచిక: 4 మే 2004

"నో హనుమాయమ్మా! ఏంకాదు. నీ భర్తను భార్యా విధేయుడుగా మార్చి పువ్వుల్లో పెట్టి నీకప్పగిస్తాను. ఇది చాలా సోఫిస్టికేటెడ్ హైటెక్నాలజీతో చేసే అతి సున్నితమైన ఆపరేషన్. 'ఒక భార్యపట్ల భర్త ఎలా నడుచుకోవాలి' అన్న అంశంమీద ప్రోగ్రాం సెట్ చేసిన మైక్రోచిప్‌ని మీ ఆయన బ్రెయిన్‌లోని ఆడిటరీ సెంటర్‌కి ఫీడ్ చేస్తాం. దట్సాల్. ఇక మీదట ఆయన నీ మాటే వింటాడు. నువ్వేం వర్రీకాకు..." అని ఓదార్చాడు డాక్టరు పేషెంట్ భార్యను.

అంతవరకూ ఆమెను నలుగురిలోనూ అవమానిస్తూ ఓ బానిసలా చూసిన ఆ భర్త ఆపరేషన్ తర్వాత ప్రవర్తించిన వైనం ఎలాంటిది? భర్త భార్యనీ, భార్య భర్తనీ ప్రకృతి సహజంగా ప్రేమించుకోవాలిగానీ మైక్రోచిప్ ద్వారా మార్చబడే కంప్యూటరైజ్డ్ పార్ట్‌నర్ వల్ల... ఎదురయ్యే లాభనష్టాలు ఎలాంటివి?

నవ్విస్తూనే ఆలోచింపచేసే

సరోజాసింధూరి నవల

# ది సిలికాన్ ఫ్యామిలీ

ఈ నెల చతుర సమగ్ర నవల.

**1990–2000** మధ్య దశాబ్దాన్ని 'ది డికేడ్ ఆఫ్ బ్రెయిన్' అన్నది సైన్స్ ప్రపంచం. మెదడు మీద జరిగిన పరిశోధనల్లో స్పష్టమైన రహస్యాలకన్నా అస్పష్టంగా వుండిపోయిన రహస్యాలే ఎక్కువ.

శరీరం బరువు మొత్తంలో కేవలం రెండు పర్సెంట్ వెయిట్ వుండే మనిషి మస్తిష్కం చేసే చిత్రాలు అన్నా! ఇన్నా!

అది సమాచారాన్ని సేకరిస్తుంది. విశ్లేషిస్తుంది. ఆర్డర్స్ జారీ చేస్తుంది. సమస్యలకు తన ఆలోచనాశక్తితో పరిష్కారాన్ని సూచిస్తుంది. వందల, వేల జ్ఞాపకాల్ని తనలో నిక్షిప్తం చేసుకుంటుంది.

కలలు కంటుంది. భావనా ప్రపంచంలో విహరిస్తుంది. అద్భుతాల్ని సృజిస్తుంది.

అట్లా సృజించిన అద్భుతాల్లో ఒకటే కంప్యూటర్. దేవుడు తనకు మారుగా మనిషిని సృష్టిస్తే ఆ మనిషి మెదడు తనకు బదులుగా కంప్యూటర్ని సృష్టించింది.

ఇంచుమించు మానవ మస్తిష్కం చేసే పనుల్ని కంప్యూటర్ చేసేస్తుంది. ఒక్క కలలు కనడం, వూహల్లో విహరించడం తప్ప.

ఎట్ ప్రెజంట్.. ప్రతి ఫీల్డూ కంప్యూటరైజ్డ్ అయిపోతోంది. ఒక్కమాటలో చెప్పాలంటే ప్రపంచమే కంప్యూటరైజ్డ్ అయ్యే రోజు వస్తుంది.

టుబి ఫ్రాంక్... తినే తిండీ, తాగే నీరు, మాట్లాడేమాట, చూసే చూపు ఎవ్రీథింగ్, ఎవ్రీథింగీజ్ గోయింగ్ టు బి కంప్యూటరైజ్డ్. మరి ఇంత సోఫిస్టికేటెడ్ టెక్నాలజీ సృష్టికర్త అయిన మెదడు... కొందరిలో ఎందుకని లోపభూయిష్టంగా వుంటోంది? వంకరగా ఆలోచిస్తుంది. చీప్‌గా ప్రవర్తిస్తుంది. నీచమైన పనులు చెయ్యమని ఆర్డర్స్ వేస్తుంది.

కంప్యూటర్‌లో ఏదైనా లోపం వస్తే సవరించగల మనిషి మెదడులో లోపాల్ని ఎందుకని సరిచేయలేకపోతున్నాడు? ఈ ప్రశ్న ఇప్పుడు కాదు దాదాపు పది సంవత్సరాల క్రితం పుట్టింది. డాక్టర్ పురుషోత్తమ్ మస్తిష్కంలో ఆ ప్రశ్నకు సమాధానం చెప్పటానికి ప్రపంచ ప్రఖ్యాత న్యూరోసర్జన్ అయిన పురుషోత్తమ్ మెదడులోని పదివేల బిలియన్ల న్యూరాన్లూ అహర్నిశలూ శ్రమించాయి. పది సంవత్సరాల అనలైజేషన్‌లో, ఆలోచనల్లో చిట్టచివరికి ఆయన మేధ జవాబును కనుక్కుంది.

ఒక కంప్యూటర్ చిప్‌లోకి కావల్సిన ప్రోగ్రామ్‌ని ఎట్లా ఫీడ్ చేస్తాయో అదే విధంగా మనిషి మెదడులో కూడా ఓ చిప్ ద్వారా మనకి కావల్సిన రీతిలో ప్రోగ్రామ్‌ని ఫీడ్ చెయ్యొచ్చు.

ఇదీ ఆ ప్రశ్నకు ఆయన కనుగొన్న జవాబు.

జాతీయ... అంతర్జాతీయ సైన్స్ కాన్ఫరెన్స్‌లలో డాక్టర్ పురుషోత్తమ్ తన థీసిస్‌ని వినిపించాడు. అందరి ఆమోదాన్నీ, ప్రోత్సాహాన్నీ పొందాడు. ఎన్నో ప్రయోగాలూ, పరిశోధనల అనంతరం అతి రహస్యంగా దేశ, విదేశాల డాక్టర్ల సహాయంతో కొన్ని ఆపరేషన్లు నిర్వహించాడు. ఎటువంటి బ్యాడ్ ఎఫెక్ట్స్ లేకుండా అవి విజయవంతమైనాయని నిర్ధారణకు వచ్చాక మొట్టమొదటిసారిగా పబ్లిగ్గా... తన నర్సింగ్‌హోమ్‌లో ఇవాళ ఒక ఆపరేషన్ని కండక్ట్ చేస్తున్నాడు. ఆయనతోపాటు ఐదుమంది గల డాక్టర్ల బృందం... ఆ ఆపరేషన్ని అటెండ్ అవుతోంది.

థియేటర్ బయట ఆ పేషంట్ తాలూకా మనిషి మా హనుమాయమ్మ పిన్నీ, నేనూ కుర్చీల్లో కూర్చుని బిక్కుబిక్కుమంటూ థియేటర్ ఎంట్రన్స్ డోర్ మీద వెలుగుతున్న రెడ్ బల్బ్‌కేసి చూస్తున్నాం. మా పిన్ని చాలా వర్రీడ్‌గా వుంది.

అది సెంట్రలైజ్డ్ ఏ.సి హాస్పిటల్ అయినా ఆమె నుదుటిమీద చెమట

పోస్తోంది. పక్కనే వున్న వాటర్ సిస్టమ్ లోంచి చల్లటి నీళ్లు ఐదు నిమిషాల కోసారి తాగుతున్నా ఆమె నాలుక తడారిపోతోంది.

ఆపరేషన్ జరుగుతున్నది మా బాబాయ్ సత్యనారాయణకి. డాక్టర్ పురుషోత్తమ్ మా పిన్నికి దూరపు బంధువు. వరసకు చెల్లెలవుతుంది.

ఆమధ్య మా హనుమాయమ్మ కూతురు రాధ పెళ్లికి వచ్చాడు పురుషోత్తమ్. గొప్ప సైంటిస్ట్ కమ్ డాక్టర్‌గా పేరుపొందినా దేశ విదేశాల్లో పర్యటించినా ఆయనలో ఆవగింజంత అతిశయం కూడా లేకపోవడమే ఆయన ఎస్సెట్. బంధువులన్నా, స్నేహితులన్నా ప్రాణం పెడతాడు. మా పిన్నికి దూరపు బంధువైనా ఆ బంధుప్రీతే ఆయన్ను ఆమె కూతురి పెళ్లికి లాక్కొచ్చింది.

ఆ పెళ్లిలో గమనించాయి ఆయన ఎక్స్‌రే కళ్లు మా హనుమాయమ్మ పిన్నిని మా బాబాయ్ ట్రీట్ చేసే విధానం.

మా బాబాయో పవర్‌ఫుల్ వ్యవస్థ. మా పిన్ని వ్యక్తిత్వంలేని బానిసలకు ప్రతీక.

అతను "ఏమే జెష్టముండా... ఎక్కడ చచ్చావ్? " అంటాడు.

"ఇదుగో... వచ్చె వచ్చె" అంటూ హడావుడిగా వంటగది గడప తట్టుకుంటూనో మధ్యగది ద్వారబంధాన్ని పొడుచుకుంటూనో పడుతూ లేస్తూ వస్తుంది భారీకాయంగల మా పిన్ని.

"ఏం పెట్టి మేపాడే మీయబ్బ.. అట్ట పెరిగిపోయింది బాడీ. తొందరగా రాలేవూ" అంటాడు అంతమంది పెళ్లి జనం ముందూ మా బాబాయ్.

మామూలుగా అయితే ఆ మాటలకు ఉక్రోషపడాలి. కానీ మా హనుమాయమ్మ పిన్ని మాత్రం సిగ్గుపడుతుంది. ఆ మాట కొస్తే అది సిగ్గుకాదు. బాధను దాచుకునే ఓ ప్రయత్నం.

ఆ పెళ్లి తర్వాత ఒకటి రెండుసార్లు పని గట్టుకుని ఆ ఇంటికి వచ్చాడు పురుషోత్తమ్.

"ఒసేవ్ కోతి మొహమా... మా ముఖాన్ని కాసిని కాఫీ పొయ్" ఇతరుల ముందు అంత అసహ్యంగా పిల్చినా మా పిన్ని కాఫీ అతని ముఖాన పొయ్యదు చేతికే అందిస్తుంది. అదీ అతి వినయంగా.

"నాన్నా అమ్మ సినిమాకెళ్దాం అడగమంది"

మా పిన్ని చిన్న కూతురు మాధవి అంటుంది.

"షోకు చేసుకుని బయటకు వూరేగాలని కాకపోతే టీవీలో సినిమాలు చాలవే నీకు భోగందానా? " అంటాడు.

నడివయసులోవున్న మా పిన్ని భోగందానా అన్న భర్త సంబోధనకు బిక్కచచ్చిపోతుంది. గుడ్లనీరు కుక్కుకుంటుంది.

నిజానికి సినిమాకెళ్దాం అన్న ఇండెంట్ మా హనుమాయమ్మ పిన్ని ఎప్పుడూ పెట్టదు. అమ్మకేదో ఫేవర్ చేద్దామనుకుని అమ్మ అడిగిందంటూ నాన్ననడిగి అనవసరంగా తిట్టించిన పాపానికి మాధవి కళ్లనీళ్లు పెట్టుకుంటుంది.

ఇదీ మా హనుమాయమ్మ పిన్ని వైవాహిక జీవితం. ఇద్దరు పిల్లల తల్లి. అల్లుడు వచ్చేసిన వయసు. అయినా చిన్నపిల్లలా భర్తతో మాటలు పడాలి. ఆ ఇంటికి ఇల్లాలైనా బానిసలా బతకాలి. డాక్టర్ పురుషోత్తమ్ ఆలోచించాడు. పెళ్లయిన పాపానికి ఈ హనుమాయమ్మ నూరేళ్లు తలవంచుకు బతకాలా? కోరికల్నీ, ఆశల్నీ గుండెల్లోనే సమాధి చెయ్యాలా? ఆత్మాభిమానాన్ని చంపుకుని ఒక వ్యక్తిత్వం లేని బొమ్మలా మిగలాలా? ఉక్రోషాన్ని కనురెప్పల కింద అదిమిపెట్టి కన్నీళ్లు కార్చాలా?

దీనికంతటికీ కారణం ఎవరు?

ఒక మగాడు. బై నేమ్ సత్యనారాయణ. వీడి మెదడులో లోపముంది. దాన్ని సరిచేసి వదిలేస్తే.

హనుమాయమ్మ జీవితం ఆనందవనం



అవుతుంది. ఆమె ఆశలపూలు వికసిస్తాయి. కోర్కెల గుర్రాలు పరుగులు తీస్తాయి. ఆమె కన్నీరు పన్నీరవుతుంది.

ఇట్లా అనుకున్న డాక్టర్ పురుషోత్తమ్ ఓ నిర్ణయానికొచ్చాడు. మా హనుమాయమ్మ పిన్నితో రహస్యంగా మంతనాలు జరిపాడు. "ప్రమాదమేమీ వుండదుగా అన్నయ్యా" మా పిన్ని భయంగా చూసింది. అంతగా హింసించే భర్తపట్ల ఆమె చూపిస్తున్న ఆదరణకి పురుషోత్తమ్ మనసు ఆర్ద్రమైంది.

"బికాజాఫ్ దిస్ ఓన్లీ కవులు స్త్రీలని పూలతో కంపేర్ చేసేది" అనుకున్నాడు.

"నీ భర్త ప్రాణాలకు నా ప్రాణాలడ్డు సరేనా? " అన్నాడు.

"ఆయనకేమైనా అయితే నేను బతకలేను" మళ్లీ చెప్పింది.

"నో హనుమాయమ్మా! ఏంకాదు. నీ భర్తను భార్యా విధేయుడిగా మార్చి పువ్వుల్లో పెట్టి నీకప్పగిస్తాను. ఇది చాలా సోఫిస్టికేటెడ్ హైటెక్నాలజీతో చేసే అతి సున్నితమైన ఆపరేషన్. ఒక భార్యపట్ల భర్త ఎట్లా నడుచుకోవాలి అనే అంశం మీద ప్రోగ్రామ్ సెట్ చేసిన మైక్రోచిప్ని మీ ఆయన బ్రెయిన్లోని ఆడిటరీ సెంటర్కి ఫీడ్ చేస్తాం దట్సాల్. ఇక మీదట ఆయన నీమాటే వింటాడు. నువ్వేం వర్రీకాకు. భారం నా మీద వేసి నిశ్చింతగా వుండు" అన్నాడు.

"అంతా బాగానేవుందిగానన్నయ్యా ఆయన్ని ఆపరేషన్కి ఒప్పించేదెట్టా? " అంది మా పిన్ని.

అదీ పాయింటేనంటూ ఆలోచనలో పడ్డాడాయన.

"అయ్యా నిన్ను భార్యావిధేయుడ్ని చేస్తాను. ఆపరేషన్ చేయించుకో" అని చెప్పి ఒప్పించే విషయం కాదిది.

"ఓ పన్చెయ్ అన్నయ్యా! నువ్వంటే ఆయనకు మంచి గౌరవం. ఓసారి నా హాస్పిటల్ చూద్దువుగానీ రావోయ్ అంటూ ఓ ఫోన్ కొట్టు. ఖచ్చితంగా వస్తాడు. ఏ కూల్ డ్రింక్లోనో మత్తుమందు కలిపిచ్చావనుకో తాగి చక్కగా పడుకుంటాడు. ఇక నీ పని నువ్వు చేసుకో" అంది మా పిన్ని.

"ఓహ్! భర్త ముందు నోట్లో నాలుకే లేనట్టుండే భార్యామణిలో ఎంతటి ఆలోచనా పటిమ!" అనుకున్నాడు పురుషోత్తమ్.

"నువ్వు కూడా రావాలి. నీ భర్తకు ఆపరేషన్ చెయ్యటానికి ఒప్పుకుంటున్నట్టు నువ్వు అగ్రిమెంట్ మీద సంతకం చెయ్యాలి. మాక్కొన్ని లీగల్ ప్రాబ్లెమ్స్ వుంటాయ్" అన్నాడు.

"ఆపరేషనయ్యాక సంతకం విషయం తెలిస్తే ఆయన నా పీక నొక్కరూ" భయంగా చూసింది మా పిన్ని.

డాక్టర్ పురుషోత్తమ్ ఒక్క పెట్టున నవ్వాడు.

"ఆపరేషనయ్యాక నువ్వు వైఫ్ ఆఫ్ సత్యనారాయణవు కావు. ఆయనే హజ్బెండాఫ్ హనుమాయమ్మ అయిపోతాడు. నీ మాట జవదాటడు" ప్రామిసింగ్గా చూశాడు.

"ఏమో అన్నయ్యా! భారం నీదే. నువ్వు భరోసా ఇచ్చావ్. నా జీవితం నీ చేతుల్లో వుంది. అన్నట్టు ఈ ఆపరేషన్ గురించి పిల్లల్తో అనకు. ఒక్క మా విజయను మాత్రమే తోడు తెచ్చుకుంటాను" అంది.

"అదే మంచిది. అందరికీ తెలిస్తే ఏదైనా ఆటంకం రావచ్చు" అన్నాడు. వాళ్లిద్దరూ ఆవిధంగా తీసుకున్న నిర్ణయం వల్లనే ఇవాళ ఆపరేషన్ జరుగుతోంది.

మా హనుమాయమ్మ పిన్ని కళ్లూ మనసూ థియేటర్ లైట్ చుట్టూనే తిరుగుతున్నాయ్. ఎప్పుడెప్పుడు లైట్ ఆరుతుందా? పురుషోత్తమ్ బయటకొస్తాడా అన్న ఉత్కంఠ ఆమెను నిలవనియ్యటం లేదు.

సరిగ్గా ఓ గంట తర్వాత మా పిన్ని నిరీక్షణ ఫలించింది. రెడ్లైట్ ఆరిపోయింది. డాక్టర్ పురుషోత్తమ్ ఆందోళనగా తనకెదు

౯చ్చిన పిన్నితో "ఆపరేషన్ సక్సెస్" అన్నాడు.

పిన్ని ఆనందంగా నన్ను వాటేసుకుంది.

ఇది నీలివార్తకాదు. నగ్నసత్యం.

పాతికేళ్లు పైబడ్డ సంసారజీవితంలో ఎన్నడూ భార్యమాట వినని మా సత్యనారాయణ బాబాయ్ ఇప్పుడు భార్యా విధేయుడై పోయాట్ట. మొన్నటివరకూ అల్లంత దూరాన చూస్తూనే ఆకులా వణికిపోయే మా హనుమాయమ్మ పిన్ని ఇవ్వాళ మొగుడ్ని గడగడలాడిస్తోందట. ఆవిడ కూర్చోమంటే కూర్చుంటాట్ట. నిలబడమంటే నిలబడతాట్ట. ఆడమంటే ఆడతాట్ట. పాడమంటే పాడతాట్ట.

ఆపరేషన్ అయ్యాక నేను మళ్లీ వెళ్లి చూడ్డం పడలేదు. అందుకే ఈ మాటలు కాదుగానీ ఓసారెళ్లి పరిస్థితి కళ్లారా చూసొద్దాం అనుకున్నా. ముందు ఆఫీసుకి సెలవుపెట్టి వెళ్దామనుకున్నాగానీ రేపు ఆదివారం అనే విషయం గుర్తొచ్చి నా విజిటింగ్ ప్రోగ్రామ్‌ను రేపటికి వాయిదా వేసుకున్నా. ఎలాగూ ఆయనా ఇంట్లో వుంటారు. ఇద్దరం కలిసే వెళ్దాం అనుకున్నా.

ఆ రాత్రి భోజనాలయ్యాక ఎప్పట్లా ఈయన చల్లగాలి పేరుతో వరండాలో నిలబడి ఎదుటి పోర్షన్‌లోని శ్యామలగౌరిని గుడ్లప్పగించి చూస్తున్న టైంలో "రేపు మా హనుమాయమ్మ పిన్నింటికి వెళ్దాం" అన్నాను కోపాన్ని దిగమింగుకుంటూ.

నేనడ్డురావడంవల్ల శ్యామలగౌరి కనబడక ముఖం చిరాగ్గా పెట్టేసి "నువ్వెళ్లు... నాకు పనుంది" అన్నాడు.

నాకు ఒళ్లు మండిపోయింది "రేపు శ్యామలగౌరి వాళ్లమ్మగారి వూరు వెళ్తోందట, మా పిన్నిల్లు రైల్వేస్టేషన్ దాటాకేగా అదీ నేనూ కలిసెళ్తాంలే. దాన్నట్లా దిగబెట్టి నేనట్టా వెళ్తాను" అన్నాను.

మీ పని శ్యామల గౌరిని చూడ్డమేగా, రేపా ఛాన్స్ లేదు అన్న సెన్స్ వచ్చేలా.

నా పాచిక పారింది. "సర్లె... సర్లె. పని దేముంది ఎప్పుడూ వుండేదేగా అలాగే వెళ్దాంలే. మా చిన్నత్తను అదే మీ పిన్నిని చూసి చాలా రోజులైంది" అన్నాడు.

ఆయన్నాలుకని చీరెయ్యాలనిపించిందిగానీ సగటు పెళ్లాన్ని గనుకా ఆ పని చెయ్యలేక



"ఇక ఇరిట్లోకి పదండి. దోమలు పీకట్లా?" అన్నాను కసిగా.

"నువ్ పద. నేనొస్తా" అన్నాడు సిగరెట్ వెలిగిస్తూ.

"నేనూ చల్లగాలి పీల్చుకుంటా" మొండిగా అక్కడే నిలబడ్డాను.

నాకు తెలుసు. ఆ సిగరెట్ పఫ్ లాగుతూ అదయిపోయినంతసేపూ శ్యామలగౌరిని చూస్తుంటాడాయన.

"అట్లాగే పీల్చుకో" అన్నాడు.

నువ్వంటే నాకేం భయమా అన్న నిర్లక్ష్యమేమో అది. నేనూ ఎదురింటివైపు చూస్తూ కూర్చున్నా. శ్యామలగౌరీ, వాళ్లాయనా సోఫాలో కూర్చుని టీవీ చూస్తున్నారు. టీవీ అటువైపునుండి వాళ్లు మాకు ఫేస్ చేసి కూర్చుని వున్నారు. వాళ్ల కంఫర్ట్‌నిబట్టి వాళ్లు టీవీ ఆ ప్లేస్‌లో సెట్ చేసుకున్నారు. ఇది మా ఆయనకు కంఫర్ట్ అయింది. మా వరండాలో నిలబడితే చాలు. వాళ్ల ఇంటి కిటికీలోంచి శ్యామలగౌరి చక్కగా ఆపాదమస్తకం మా వారికి కనువిందు చేస్తుంది.

శ్యామలగౌరి ఎవరోకాదు, నా బెస్ట్‌ఫ్రెండ్.

మా స్నేహం ఈనాటిది కాదు ప్రైమరీ ఎడ్యుకేషన్నుంచీ కాలేజ్ స్థాయి వరకూ చెక్కుచెదరకుండా ఎదిగింది. అది డిగ్రీ ఫైనల్ చేస్తుండగా పెళ్లి కుదరటంతో అర్థంతరంగా చదువాపేసి పెళ్లి చేసేశాడు. నేను మాత్రం చదువాపలేదు. సోషియాలజీ మెయిన్‌గా ఎమ్.ఎ చేశాను. కలక్టరేట్‌లో నా చదువుకు సంబంధం లేని ఉద్యోగంలో క్లర్క్‌గా నాకు గవర్నమెంట్ జాబ్ వచ్చింది. ఇదే వూళ్లో సేల్స్‌టాక్స్ ఆఫీసులో మంచి కేడర్‌లో వున్న ఈయనతో నా పెళ్లయింది. శ్యామలగౌరి వాళ్లాయన అగ్రికల్చరల్ డిపార్ట్‌మెంట్లో ఆఫీసర్. వాళ్లాయనకు ఈ వూరికి ట్రాన్స్‌ఫర్ కావడంతో మళ్లీ చాన్నాళ్లకి ఇలా కలిశాం.

అది ఈ వూరికొస్తున్నట్టు నాకు వుత్తరం రాయడం, లక్కీగా మా కాంపౌండ్‌లోనే మా పోర్షన్‌కి ఎదురు పోర్షన్ ఖాళీగా వుండటం, నేనందులో చేరమని సజెస్ట్ చేయడం, వాళ్లకాయిల్లు నచ్చడంతో అందులో దిగిపోవడం అనుకోకుండా జరిగిపోయాయి.

అదీ ఇంట్లో దిగినప్పుడు ఎంత సంతోషించానో సంబరపడ్డానో దానికి పదింతలుగా ఇప్పుడు దిగులు పడుతున్నా. మా ఆయనకీ రోగం ఎప్పట్నుంచీ వుందో నాకు తెలీదుగానీ అసలా రోగం వున్నట్టు మాత్రం తెలిసింది శ్యామల వల్లనే.

కొత్తల్లో వాళ్లు, మేమూ కలిసి సినిమాలూ, షికార్లూ అంటూ తెగ తిరిగేవాళ్లం. శ్యామల ఎక్స్‌ట్రావర్ట్. గలగల మాట్లాడ్డం, విరగబడి నవ్వడం దాని బర్త్‌రైట్. మరి దాని మాటలేనచ్చాయో, నవ్వులే నచ్చాయో తెలీదుగానీ ఈయన మెల్లగా దానివైపు ఆకర్షితుడవటం రెండు రోజులక్రితమే తెలుసుకున్నా. అయితే ఆ విషయం చూచాయగా కాదు చాలా కన్‌ఫర్మ్‌డ్‌గా అదీ శ్యామలవల్లనే తెలిసింది. ఆ ఇంట్లో దిగిన మూడ్నెల్లకి శ్యామలగౌరి బర్త్‌డే వచ్చింది. శ్యామలకి షిఫాన్ చీరెలంటే ఇష్టమని నాకు తెలుసు. అందుకే దానికి ఓ మంచి శారీ ప్రెజెంట్ చేశాను. అందరం కల్సి సీషోర్‌కెళ్లాం. సాయంత్రందాకా ఎంజాయ్ చేశాం. తిరిగి వస్తున్నప్పుడు గమనించాను. వాళ్లాయన వెనక పిలియన్‌సీట్‌లో కూర్చున్న శ్యామలెందుకో ముభావంగా వుంది. ఇల్లు చేరాక కూడా ఇంట్లోకెళ్తూ నాకు బై చెప్పలేదు. ఈ విషయమే కొరుకుడు పడక నేన్సస్తుంటే ఇటు మా వారు కూడా నాతో అంటీముట్టనట్టుగా వున్నారా రాత్రంతా.

"ఎందుకండీ అట్లాగున్నారు" అంటే "ఎట్టా వున్నాను?" అని ఎదురు ప్రశ్న వేశారు.

"తలనొప్పా?" అని నాకు నేను సమాధానం చెప్పుకున్నట్టూ అడిగితే "ఆ" అన్నారు పొడిగా. అప్పుడు నాకు తెలీదు. తెల్లారాక అసలు సిసలైన తలనొప్పితో బాధ పడబోయేది నేనని.

ఉదయాన్నే నా దగ్గరకు వడివడిగా వచ్చింది శ్యామల. పలకరింపుగా నవ్వాను. అది నా నవ్వునూ నన్నూ పట్టించుకోలేదు. నా కుడిచేతిని చప్పున ముందుకులాగి నా అరచేతిలో ఓ మడత పెట్టిన కాగితాన్ని, ఎమరాల్డ్ పొదిగిన వుంగరాన్ని వుంచి కీపిట్ సీక్రెట్ అనేసి ఎంత వేగంగా

వచ్చిందో అంతే వేగంగా వెళ్లిపోయింది.

"కీపిట్ సీక్రెట్" అంటే మా ఆయనక్కూడా తెలీకూడదనేగా అర్థం అనుకున్నాను. మా ఆయన ఆఫీసుకెళ్లిపోయాక చదువుదామా అనుకుంటే ఆయనతో పాటూ నేనూ బయల్దేరతాను. మా ఆఫీస్ దగ్గర నన్ను డ్రాప్ చేసి ఆయనట్లా వెళతారు. సాయంత్రమూ అంతే. నన్ను పికప్ చేసుకుని ఇంటికొస్తారు. అయినా అంతసేపు నేనెక్కడాగేది. బెడ్ రూమ్‌లోకి తొంగిచూశాను నో ప్రాబ్లమ్. గాఢ నిద్రలో వున్నారు. చకచకా కాగితం మడతలు విప్పాను.

విజ్జీ!

ఐయామ్‌సారీ, మీ ఆయన గురించి నీకు చెడుగా రాయాల్సి వస్తోంది. నేను మీ ఎదురింట్లో దిగినప్పటినుంచీ గమనిస్తున్నా మీ ఆయన్నాకు సైటు కొట్టడం ఆ... ఏదోలే మగబుద్ధి అనుకున్నా. మనం మన్మథుడు సినిమాకెళ్లాం చూడు. ఆరోజు వీలు చూసుకుని యువర్ శారీ ఈజ్ నైస్ అన్నాడు. మా ఆయనెక్కడ వింటాడోనని భయపడి చచ్చాను. లాస్ట్ సండే ఎగ్జిబిషన్‌కెళ్లినప్పుడు మనం ఫ్యాన్సీ జ్యూయలరీ షాపింగ్ చేశాం చూడు. అప్పుడు మీ ఆయన నా చెవి దగ్గరగా నోరుపెట్టి "మీ చెవులకు టాప్స్‌కన్నా హేంగింగ్స్ బాగుంటాయ్" అన్నాడు. చాలా ఓవరవుతున్నాడనుకున్నా. పోయిన్నెల నీకేదో ఇంక్రిమెంట్ ఇచ్చారని హోటల్లో ట్రీట్ ఇచ్చావు చూడు ఆ రోజు మీ ఆయన టేబుల్ కిందనుంచి కసుక్కున నా కాలు తొక్కాడు. నేను కోపంగా చూస్తే హిమేడ్ ఫేసెస్. ఆ తర్వాత "మీరనుకోలా... విజ్జీ అనుకుని అంటూ నీళ్లు నమిలాడనుకో. చెప్పుకుంటూ పోతే ఇట్లాంటివెన్నో. ఇన్ని జరుగుతున్నా ఎందుకు భరించానంటే నువ్వు నా ప్రాణ స్నేహితురాలివి గనుక. ఇవన్నీ చెప్పి నిన్ను డిస్టర్బ్ చెయ్యడం దేనికిలే అనుకున్నా. బట్ వీటన్నిటికీ క్లైమాక్స్‌లా నిన్న ఈ వుంగరం. నా బర్త్‌డే గిఫ్ట్‌గా నువ్వు శారీ ఇచ్చావ్. అది మీ ఆయనక్కూడా తెలుసు. ఇట్సినఫ్.

మళ్ళీ ఈ స్పెషల్ గిఫ్టేమిటి? అదీ నీకు తెలియకుండా. వెంటనే ముఖాన కొట్టి అల్లరి పెడదామనుకున్నాగానీ అలా చెయ్యలేకపోయాను. ఎందుకో తెలుసా? ఆ సంఘటనతో మనమధ్య తేడాలొస్తాయ్. విషయం తెలిసిన మరుక్షణం మా ఆయన ఇల్లు ఖాళీ చెయ్యాలంటాడు.

విజ్జీ! మన రెండు కుటుంబాలమధ్యా ఈ స్నేహం ఎంతో హాయిగా వుందే. ఏ చిన్న సంఘటన్నయినా పెద్ద పండుగలా చేసుకుంటున్నాం. చీమ చిటుక్కుమంటే సెలబ్రేషన్. సినిమాలూ, షికార్లూ కేవలం వీటికోసమని కాదు పెనవేసుకున్న మన స్నేహాల తల్లి బలవంతానా వేరుచేయడం ఇష్టం లేకనేమో నేను మిన్నకుండిపోయాను. రాత్రంతా ఆలోచించి నేనీ నిర్ణయానికొచ్చాను. ఏ జబ్బయినా ప్రైమరీ స్టేజ్‌లో వుంటేనే క్యూరవడానికి ఛాన్సెస్ వుంటాయి. అడ్వాన్స్‌డ్ స్టేజ్‌కొచ్చిందా... ఇక లాభం లేదు. అందుకే ఓ లేబ్ టెక్నీషియన్లా మీ ఆయన రోగానికి సంబంధించిన రిపోర్ట్‌ని నీ ముందుంచాను. నువ్వో డాక్టర్‌లా నీ మొగుడికి ట్రీట్‌మెంట్ ఇచ్చుకో.

అయితే ఒక్కటి విజ్జీ... మన స్నేహం చెడిపోకూడదు. మన మధ్య వున్న హార్మోనీ డిస్టర్బ్ కాకూడదు. ఇదంతా ఓరల్‌గా చెప్పేకన్నా రిటెన్‌గా అయితే క్లియర్‌గా వుంటుందని ఇలా రాశాను. ఆలోచించి నిర్ణయం తీసుకో.

వుంటాను

-నీ శ్యామ

నా మనసో బండరాయిలా వుంది. అరచేతిలో వుంగరాన్నీ, బెడ్‌మీద పడి నిద్రపోతున్న మా ఆయన్నీ మార్చిమార్చి చూశాను. ఒళ్ళంతా యాసిడ్ రెయిన్‌లో తడుస్తున్నంత మంటగా వుంది.

నిద్రలో వుండగానే గొంతు పిసికి

సచిత్ర విచిత్రం

# పెద్దయితేనే అందం

పక్షి అందంగానే వుంటుందిగానీ చిన్నప్పుడు అంటే పిల్లపక్షిగా వున్నప్పుడు మాత్రం కురూపిగా వుంటుంది కొకటూ అనే జాతిపక్షి. చిత్రంలో వున్న పక్షిపిల్ల వయసు 11 రోజులు. అది పెద్దయ్యాక ఎంత అందంగా వుందో ఇన్‌సెట్‌లోని దాని తల్లి ఫొటో చూస్తే తెలుస్తుంది. జర్మనీలోని ఓ జూలో తీసిన ఫొటోలివి.



చంపాలా...

లేక వుంగరపు రాయిని పొడి చేసి బెడ్ కాఫీలో కలిపివ్వాలా? లేక ఉప్మాలో విషం కలిపి చంపాలా... అని ఆలోచిస్తున్నంతలో మా ఆయన "విజ్జీ కాఫీ" అంటూ లేచాడు.

'ఇస్తున్నాన్రా... దుర్మార్గుడా' అనుకుంటూ వంటగదిలోకెళ్ళి గిన్నెలు ఎత్తెత్తి వేస్తూ పాలు తక్కువ పోసి కాఫీపొడి, పంచదార ఓ లిమిట్ లేకుండా కలిపి కసిగా కాఫీ చేశాను.

ఓ కప్పునిండా పట్టుకెళ్ళి బెడ్ పక్కనే వున్న స్టూల్‌మీద ఎత్తి కొట్టినట్టు పెట్టాను.

"ఏంటది? " అన్నాడు పడుకునే చిరాగ్గా ముఖం పెట్టి.

"కాఫీ" అన్నాను పళ్ళు కొరుకుతూ.

"అది తెలుసు. ఆ ఎత్తి కొట్టడమేంటీ అంటున్నా" అన్నాడు.

"ఆ... చెయ్యి జారింది" అన్నాను నిర్ల క్ష్యంగా.

'పేషెంట్‌లా పడుకుని కాఫీలూ, టిఫిన్లూ బెడ్‌మీదకి తెప్పించుకునేదికాక, సంజాయి షీలు కూడా కావాలా నీకు? ' అనుకుంటూ పళ్ళు కొరుక్కున్నా.

"ఛూ... ఇది కాఫీనా? " తీసుకున్న సిప్‌ని విధిలేక మింగుతూ అన్నాడు.

నేను సమాధానం చెప్పకుండా కిచెన్‌లోకి వెళ్ళిపోయాను.

కాఫీ తాగాడో లేదోగానీ కాసేపటి తర్వాత బాత్‌రూమ్‌లోకి వెళ్తూ టవల్ భుజానేసు కుని తలుపుదగ్గర నిలబడ్డాడు రోజూలా బ్రష్‌మీద పేస్ట్ వేసిస్తానని. అలాంటిదేం జరగకపోవడంతో తనే బ్రష్ తీసుకుని లోప లికెళ్ళి తలుపు మూసుకున్నాడు.

'ఎలా డీల్ చెయ్యాలీ మేటర్ని? చొక్కా పట్టుకుని లేపి అరిచి ఏడ్చి గోల చేస్తే? '

వద్దు... విషయం స్ప్రెడ్ అవుతుంది. శ్యామలగౌరి దూరమవుతుంది. అంతేకాదు ఈయన 'నా ఇష్టం. నేను మగాడ్ని' అంటూ మగాళ్ళకి షరా మామూలైన డైలాగ్‌తో నా నోరు మూయించే ప్రమాదం వుంది.

మరి... తెలియనట్లు వుండి అబ్జర్వ్ చేస్తే!

అబ్జర్వ్ చేసేదేముంది నా మొహం. విషయం స్పష్టమయ్యాక సూటిపోటి మాట లతో హింసిస్తే...

అప్పుడు నేనింకా భయంకరంగా, శ్యామల గౌరి మరింత అందంగా కనబడే ప్రమాద ముంది.

అయినా శ్యామ ఎంతందంగా కనబడినా నా మొగుడికి ఒరిగేదేముందిలే. ఏదో నా ముఖం చూసి వదిలేసిందిగానీ లేకుంటే ఈపాటికి గరిట కాల్చి వాతలు పెట్టేది.

ఆలోచిస్తూనే వంట ముగించాను.

ప్లేట్లో నాలుగిడ్లీ... చట్నీ పడేసి డైనింగ్ టేబుల్‌మీద అచ్చం ఇందాక కాఫీ కప్పు కొట్టినట్టూ, ప్లేట్‌ని విసిరిపుచ్చి కొట్టాను.

"ఏంటిది? " అన్నాడు మళ్ళీ చిరాగ్గా.

"ఆ... చెయ్యిజారింది" మళ్ళీ అదే సమా ధానం ఇచ్చాను.

ఏమనుకున్నాడో ఏమో మారు మాట్లాడ కుండా తిన్నాడు. ఎప్పట్లా కాకుండా ఓ రెండుగ్లాసులు నీళ్ళెక్కువే తాగాడు. తాక్క ఛస్తాడా... అది చట్నీ అయితేగా కొరివికా రంలా చేశాను. నా లంచ్‌ని బాక్స్‌లో సర్దు కుని ఆయనకి కేరేజ్ కట్టి బయటపడ్డాను.

బండి కిక్ కొట్టి నిలబడ్డాడు రెడీగా.

ఒక్కక్షణం ఎక్కుదామా, వద్దా అనుకున్నా గానీ సిటీబస్‌ల రిస్క్ గుర్తుకొచ్చి ఇక్కడ మాత్రం రాజీపడ్డాను.

రెండ్రోజులుగా ఆలోచనలతో తల బద్దల వుతోందిగానీ ఆయన్నేం అప్రోచ్ కాలేదు. 'ఏం స్టెప్ తీసుకోబోతున్నావ్' అని శ్యామల అడిగినా నేనేం చెప్పలేదు.

ఈ రెండ్రోజుల్లో నేను గమనించిన మరో విషయం ఏంటంటే మా ఆయన శ్యామలగౌ రిని ఏదో నా నోటీస్‌కి రాకుండా చాటుమా టుగా చూడ్డంకాదు. నా ఉనికినే గుర్తించ

నట్టూ, నిర్లజ్జగా నిరభ్యంతరంగా చూస్తు న్నాడు.

బహుశా ఆయనిచ్చిన గిఫ్ట్‌ని శ్యామలగౌరి యాక్సెప్ట్ చేసిందన్న ధైర్యమేమో అది. భద్రంగా ఆ వుంగరాన్ని నాకు తిరిగి ఇచ్చిం దనీ, ప్రస్తుతం అది ఇంట్లో లాకర్‌లో వుందనీ తెలిస్తే ఏమౌతాడో? నేనాయన ముఖంలోకి చూశాను. ఆయన శ్యామలగౌరి కేసే చూస్తున్నాడు. నేనూ శ్యామలగౌరినే చూస్తూ కూర్చున్నా. శ్యామలగౌరి మాత్రం చాలా ఫ్రాంక్‌గా టీవీ వాచ్ చేస్తోంది.

అయినా 'అది కిటికీని కర్టెన్‌తో కవర్ చేసుకోవచ్చుగా' ఉక్రోషంగా అనుకున్నా.

కానీ వెంటనే స్ఫురించింది. వాళ్ళు ఫ్రెష్ ఎయిర్‌కోసం కర్టెన్ పక్కకి జరుపుకుం టారు. కాదనడానికి నేనెవరు? ఒకవేళ శ్యామల కర్టెన్ వేసినా వాళ్ళాయన 'ఎందుకూ అట్లా చేశావ్?' అంటాడు. అదేం సమాధానం చెబ్తుంది? 'విజ్జీ మొగుడు నాకు లైనేస్తున్నాడండీ' అని చెప్పడం బాగో దుకదా!

ఆలోచిస్తూ అలాగే దానివైపు చూస్తున్న నేను ఉన్నట్టుండి ఉలిక్కిపడ్డాను.

నమ్మలేనట్టూ, మళ్ళీ మళ్ళీ అబ్జర్వ్ చేశాను. నా ఊహ తప్పుకాదు. హండ్రెడ్ పర్సెంట్ కరక్ట్.

మా ఆయన శ్యామలగౌరిని చూస్తున్నట్టే శ్యామలగౌరి మొగుడు నన్ను తినేసేలా చూస్తున్నాడు.

★ ★ ★

నేను మా ఆయన్తో గమ్మత్తుగా అన్నది నిజమై కూర్చుంది. నిజంగానే శ్యామలగౌరి తెల్లారేపాటికి ముస్తాబై మా ఇంటికొచ్చింది.

"అమ్మను చూసి చాలా రోజులైందే. ఈమధ్య హెల్త్ కూడా బాగుండడంలేదుట. నాన్న ఫోన్ చేశారు. చూసొస్తాం. మీ అమ్మగారికేమైనా చెప్పనా?"

మా ఇద్దరి పుట్టిళ్ళూ ఒక ఊళ్ళోనే కావ డంతో అలా అడిగిందని,

"బాగానే వున్నామని చెప్పు. వీలైతే అమ్మనీ, నాన్ననీ ఓసారి రమ్మను" అలా చెబ్తున్న నేను అనుకోకుండా మా బెడ్ రూమ్ వంక చూశాను. ఉదయం ఎనిమిది దాకా గాఢనిద్ర పోతూ వుండే మా ఆయన బెడ్‌మీద గూబలా కూర్చుని దిగాలుగా శ్యామలగౌరికేసి చూస్తున్నాడు. నాకు కోపం స్థానంలో నవ్వొచ్చింది. అయితే అది మామూలు నవ్వుకాదు. విరక్తితో కూడిన నవ్వు.

ఎందుకింత వంకరో మగాడి బుద్ధి?

"ఎన్నాళ్ళుంటావే శ్యామా?" కావాలనే అడిగాను.

"చెప్పలేను. ఓ వారం అనుకుంటున్నా. అమ్మ బలవంతం చేస్తే షెడ్యూల్ మారొచ్చు" చెప్పిందది.

మా పతిదేవుడికి వినబడలేదేమో. కను బొమలు ముడిచి చూస్తున్నాడు త్రాష్టుడు.

"బాప్‌రే... వారమే! అంటే ఏడురోజులు, ఇరవైనాలుగేళ్ళు, నూటా అరవై ఎనిమిది గంటలు. నూటా అరవై ఎనిమిది ఇంటూ అరవై. ఈ కాలిక్యులేషన్ నావల్లకాదుగానీ మా ఆయన్నడుగుతానుండు" దాంతో అలా అని ఆయన్తో "ఏవండీ నూటా అరవై ఎని మిదీ ఇంటూ అరవై ఎంతండీ?" అన్నాను.

"పదివేలా ఎనభై నిమిషాలు" ఠక్కున చెప్పాడు ముందే గుణించుకున్నాడల్లే వుంది.

"అన్ని వేల నిమిషాలు ఎలాగే బతికేది శ్యామూ నిన్నొదిలి?" అడిగాను ఓరకంట మా శ్రీవారిని చూస్తూ.

ఆయన ముఖంలో బాధావీచికలు గంటకు వందకిలోమీటర్ల వేగంతో వీస్తుం డడం స్పష్టంగా కనబడింది.

గురుడికి అసలు ఎక్స్‌ప్రెషన్స్ కంట్రోల్ చేసుకోవడంరాదు. మనసులో వున్న దరిద్ర మంతా ముఖంలో కనబడాల్సిందే. శ్యామల గౌరి పాపం... క్వశ్చన్‌మార్క్ ఫేస్ పెట్టే

సింది.

ప్రియురాలి ఎడబాటు సహించలేని ప్రియుడిలానే మాట్లాడుతుంటే

"ఈ కటింగేంటే" అంది బిత్తరపోతూ.

నేనదేం పట్టించుకోకుండా, "నేనెట్లాగూ మా పిన్నింటికి వెళ్తానన్నాగా. దీంతో బయ ల్దేరతా. ఏమంటారు? " అన్నా మా ఆయన్తో.

ఊడిపోతున్న లుంగీ టైట్ చేసుకుంటూ బెడ్‌మీంచి ఒక్క ఉదుటున లేచాడు. అదేదో దిక్కుమాలిన పక్షిలా మాముందు వాలి,

"నేన్డ్రాప్ చేస్తా" అన్నాడు.

"ఎవర్ని? నన్నా... దాన్నా? " చివుక్కున అన్నాను.

"నిన్ను" అన్నాడు కాస్త జంకుతూ.

'దాన్నే అంటానికి ఇంకాస్త ముదరాలిగా' అనుకున్నాను.

"సరె... నువ్వు మీ ఆయన్తో వెళ్ళవే. నేను మా ఆయన్తో వెళ్తా" అన్నాను.

"అలాకాదు" అన్నాడు నాన్చుతూ.

"ఇంకోమాట చెప్తారా? " అన్నాను.

"ఆటో తీసుకుంటే ముగ్గురం వెళ్ళొచ్చుగా" అన్నాడు.

"నిజమే బండిమీద ముగ్గురం అంటే బాగోదుగా" అన్నాను.

"ఇంతోటిదానికి వాళ్ళాయన్నెందుకూ లేపడం పాపం" అన్నాడు.

"అవునే మనకు మా ఆయనున్నాడుగా పాపం" అన్నాను.

శ్యామలగౌరికి విషయం బ్రహ్మాండంగా అర్థమైంది.

మా దిక్కుమాలిన పక్షికేసి అసహనంగా చూసి "నో థ్యాంక్స్" అంది.

ఆయన గుడ్లనీరు కుక్కుకుంటూ అక్క డ్నించి వెళ్ళిపోయాడు.

"ప్లెజెంట్ జర్నీ" అన్నాను శ్యామలతో.

"సీ... యూ... బై" అంటూ వెళ్ళిపోయిం దది.

వాళ్ళాయన వెనక పిలియన్ సీట్లో కూర్చుని వెళుతున్న శ్యామలగౌరికి మా ఆయన కన్నీళ్ళతో వీడ్కోలివ్వడం నేను గమనించలేకపోలేదు.

ఓ గంట తర్వాత నేను రెడీ అయిపోయి "వస్తారా వెళ్దాం? " అన్నాను ఇంకా లుంగీ లోనే వుండిపోయి ఎదురు పోర్షన్‌వైపు శూన్యపు చూపుల్ని ప్రసరింపచేస్తున్న మా ఆయన్తో.

'వస్తానన్నాక రాక చస్తానా' అన్నట్టు నావేపో చూపు విసిరి విసవిసా బాత్‌రూమ్ లోకెళ్ళి బుడుంగున స్నానం చేసి ఒంటికి ప్యాంటూ, షర్టూ తగిలించుకుని నాముందు తగలడ్డాడు 'ఇక బయల్దేరదామా' అన్నట్టు చూస్తూ.

"అదుగోండి ఉప్మా" డైనింగ్ టేబుల్‌మీద రెడీగా పెట్టిన ఉప్మా ప్లేటు చూపించాను.

"నువ్వు" అన్నాడు.

'ఆహా... ఎంత కర్టసీ' అనుకుని పైకి మాత్రం "శ్యామల వెళ్ళిపోయిందని బెంగగా వుందండీ. ఉప్మా సయించలేదు" అన్నాను అప్పుడే తిన్న ఉప్మా రుచిని గుర్తు చేసు కుంటూ.

గాయాన్ని కెలికినట్టున్నానేమో. ఆయనకి నిజంగానే ఉప్మా సయించలేదు. రెండు స్పూన్లు నోట్లో బలవంతంగా పెట్టుకుని "ఉప్పెక్కువ" అంటూ వదిలేశాడు.

"ఉప్మా చేస్తున్నప్పుడు మా శ్యామల గుర్తొచ్చి ఏడ్చానండీ. ఆ కన్నీళ్ళేమో అందులో పడుంటాయి. సో... ఉప్పెక్కువయ్యుం టుంది" చెప్పాను. నావైపు ఏదోలా చూసి బైక్ స్టార్ట్ చేశాడు. ఆయన వెనక్కూర్చుంటూ అన్నాను, "శ్యాము ట్రైన్లో వెళ్తూ వుంటుంది కదండీ పాపం. దాన్ని చూడకుండా వారంరో జులు ఎట్లా బతకాలో ఏంటో"

★ ★ ★

"ఆడమంటే నిజంగా ఆడతాడా పిన్నీ" నమ్మలేక అడిగాను.

"చూస్తావా? " ఛాలెంజ్ చేస్తున్నట్టుగా నావంక చూసి "తాతై" అంది తొడమీద గట్టిగా చరుచుకుంటూ.

సత్యనారాయణ బాబాయ్ చేస్తున్న పని ఆపి హడావుడిగా వచ్చి ఆ తాళానికి అను గుణంగా ఓ నృత్యభంగిమ పెట్టాడు.

"తకతై" అంది పిన్ని.

బాబాయ్ కాళ్ళూ, చేతులూ దానికనుగు ణంగా కదిలాయ్.

"దిత్తై" పిన్ని తాళం. బాబాయ్ నృత్యం.

"దిద్దిత్తై' పిన్ని తాళం. బాబాయ్ నృత్యం.

"ఇక చాలు పిన్నీ" అన్నాను.

"చాలట. వెళ్ళి పని చూసుకోండి" పిన్ని బాబాయ్‌తో అంది.

"నమ్మలేకున్నాను పిన్నీ" అన్నాను.

పిన్ని చిద్విలాసంగా నవ్వింది. "మా పురుషోత్తమన్నయ్య దయవల్ల నా పని అల్లావుద్దీన్ అద్భుతదీపం కథలా అయ్యిందే అమ్మాయ్" అంది.

"అవునూ... పాడమంటే కూడా" ఆగాను.

"ఏమండీ... ఇలా వచ్చి ఓ పాట పాడు దురూ" అంది గారంగా.

ఆమె అట్లా అందో లేదో అల్లంత దూరం నుంచే పాటెత్తుకున్నాడు బాబాయ్.

"అందమైన భామలూ, లేత మెరుపుతీ గెలూ ముట్టుకుంటే మాసిపోయే వెన్నెల అందాలు, ఓ భామా"

"నోర్ముయ్యండి" పిన్ని ఉరిమిచూసింది "సాంప్రదాయకంగా పాడండి"

బాబాయ్ బుద్ధిగా తలూపి అందుకు న్నాడు, "శ్రీ సత్యనారాయణుని సేవకు రారమ్మా, మనసారా స్వామిని కొలిచి హార తులీరమ్మా" పాట పూర్తిగా పాడేదాకా ఆగి చెప్పాను "చాలా బాగా పాడారు బాబాయ్"

"గుంజీలు తియ్యండి" అంది పిన్ని.

బాబాయ్ చకచకా గుంజీలు తియ్యడం ఆరంభించాడు.

"పరుగెత్తు" అందామె.

ఇక బాబాయ్ ఒకటే పరుగులు.

ఆ వయసులో అంత వేగంగా అలా గుంజీలు తియ్యడం, పరుగెత్తడం చూస్తుంటే నాకు అబ్బురంగా అన్పించింది. అదే అన్నాను, "ఈ వయసులో ఇట్లా"

"అంతా ఆపరేషన్ మహిమమ్మాయ్. ఆ బుర్రలో వుండే చిప్ అలా ఆడిస్తోందా యన్ని. ఎన్ని జన్మలెత్తినా మా అన్నయ్య రుణం తీర్చుకోలేను" అందామె కళ్ళొత్తు కుంటూ.

"ఇక వెళ్దామా" అన్నాడు అంతవరకూ సినిమా ప్రేక్షకుడిలా కూర్చుండిపోయిన మా ఆయన.

బాబాయ్ గొడవలోపడి ఆయన ఉనికినే మర్చిపోయాన్నేను. ముఖంమీద ఆవాలేస్తే చిటపటలాడేట్టున్నాయి. ఆ వాతావరణం నచ్చలేదని ఆయన ముఖం ఇట్టే చెప్తోంది.

"అప్పుడే ఎక్కడికి బాబూ, భోంచేసుకుని వెళ్ళండి" అంది పిన్ని.

"అబ్బే పనుందత్తయ్యా, వెళ్ళాలి" మాట తోనే లేచాడు.

"కనీసం కాఫీలైనా తీసుకోండి" మా పిన్ని రెండోకూతురు మాధవి కాఫీ పట్టుకొచ్చింది.

ఒక్క గుక్కలో తాగేసి, "పద వెళ్దాం" అన్నాడు.

"సరే అమ్మాయ్. అబ్బాయి తొందర పడుతున్నట్టున్నాడు, బయల్దేరు" అంది మా పిన్ని.

"ఆ... ఆ... అలాగే అన్నట్లు పిన్నీబా బాయ్ పోరులేదుగా. మా ఇంటికొచ్చి నాల్రోజులుండరాదూ" హృదయపూర్వకంగా పిలిచాను. మొన్నటివరకూ పిన్నికి అడుగు బయట పెట్టే అర్హతేలేదు. ఎప్పుడూ వంటింట్లో తప్పితే నట్టింట్లో అదీ కాకుంటే పడకటింట్లో, బాబాయ్ కాళ్ళు పడుతూనో, విసనకర్రతో విసుర్తూనో, దుర్మార్గుడు, "ఒసేవ్ ఫ్యాన్ గాలి వేడిగా వుందిగానీ, అదాపి విసురు" అనేవాడుట. ఏ అర్ధరాత్రో లేచిపోయి ఇక పిన్ని తెల్లవార్లూ కొరివిద య్యంలా కూర్చుని అలా విసురుతూనే

వుండేదట. 'ఇక పడుకో' అనేమాట ఆనోట వచ్చేదే కాదట.

"ప్రస్తుతం తీరికే లేదమ్మాయ్. ఈసారె ప్పుడైనా వస్తాలే" అంది పిన్ని.

"అమ్మ స్పోకెన్ ఇంగ్లీష్ కోర్సులో చేరింద క్కయ్యా" నవ్వుతూ చెప్పింది మాధవి.

పిన్ని సిగ్గుపడింది. "పదిహేనేళ్ళకే చదువూ సంధ్యా ఆపేసి నా మెడలువంచి పెళ్ళి చేశారా. ఆ తర్వాత మీ బాబాయ్ నడి గితే 'నీ ముఖానికి ఇంగ్లీషొకటే తక్కువ' అని ఎద్దేవా చేశాడు సరే ఇన్నాళ్ళకి ఛాన్స్ దొరికింది కదాని కోర్సులో చేరా"

"నువ్వీసారి వచ్చేసరికి అమ్మ ఇంగ్లీషులో దంచేస్తుంది" మాధవి నవ్వింది మళ్ళీ.

"ఏంటే నవ్వులాటగా వుందా?" కూతుర్ని కసిరి నాతో అంది సంతోషంగా.

"ఇంగ్లీష్కాదే అమ్మాయ్. సంగీతం కూడా నేర్చుకోబో తున్నా".

"ఆల్ ది బెస్ట్ పిన్నీ" అన్నాను.

ఇవ్వన్నీ ఇన్నాళ్ళూ బాబాయ్ ఉక్కుపాదాలకింద పడి ఊపిరా డక కొట్టుకున్న కోరికలేకదూ. భర్త అణచివేతలో అణగారిపో యిన ఆశలే ఇవి. అవకాశం చిక్కగానే వాటికి రెక్కలొ చ్చాయ్. వయసు అడ్డుకాదు. మనసుంటేచాలు.

నేను లేచాను. ఆ సరికే ఆయన వెళ్ళిపోయి బైక్ కిక్కొట్టి నిలబడ్డాడు. ఆయన్ని చూస్తుంటే శ్యామలగౌరి గుర్తుకొ చ్చింది నాకు. ఇదేం ఖర్మో విషయం తెలి సిన దగ్గర్నుంచీ మా ఆయన ముఖం చూస్తుంటే, ఆ స్థానంలో దాని ముఖమే కన బడుతోంది.

"విజ్జీ... రా" కేకేశాడాయన.

పిన్ని నా ముఖాన కుంకుమ పెట్టింది.

మా ఆయన వెనుక కూర్చుంటుంటే "ఎంతసేపు బోడికబుర్లు" అని ఆయన సణ గడం వినిపించింది నాకు.

ఓ మగాడ్ని ఆడదట్లా ఆడించడం, పాడిం చడం, గుంజీలు గట్రా తీయించడం సాటి మగాడిగా ఆయన సహించలేకపోతున్నాడని ఇట్టే అర్థమైంది నాకు.

"పోవోయ్" అనుకున్నా కేర్లెస్గా.

**ఆ**రోజు టైపిస్ట్ క్రిష్ణప్రియ ఆఫీసుకి రాలేదు. దాని టైపింగ్ వర్కంతా నా నెత్తి నేశాడు మా సెక్షనాఫీసరు. క్రిష్ణప్రియని మనసులో తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టు కుంటూనే వున్నానారోజు.

లంచ్ బ్రేక్లో "ఏమొచ్చింది తల్లీ ఆ క్రిష్ణ



ప్రియకు? మళ్ళీ టియర్స్ డే సెలబ్రేషన్సా?" అన్నాను నా పక్క సీట్లోని సీతమ్మ తల్లితో.

క్రిష్ణప్రియ మొగుడితో గొడవపడినప్పు డల్లా శలవుపెట్టి ఇంట్లో ఏడుస్తూ కూర్చుం టుంది. అందుకే ఆవిడ ఆఫీసుకు రానిరో జున మేం టియర్స్ డే అని పిల్చుకుంటాం.

సీతమ్మ తల్లి ప్లాస్టిక్ కవర్లో ప్యాక్ చేసు కొచ్చిన ఉప్పు మిరపకాయల్ని నాక్కొన్ని ఆఫర్ చేస్తూ చెప్పింది "టియర్స్ డే కాదు, వాషింగ్ అండ్ డ్రయ్యింగ్ డే"

"ఎవర్ని" అన్నాను క్యూరియస్‌గా.

"క్రిష్ణమ్మ మొగుడు రాధయ్యను. ఉతికి ఆరేశారంట"

"అయితే రేపు మనకు క్రిష్ణప్రియ ట్రీట్ ఇస్తుందన్నమాట" అన్నాను.

సీతమ్మతల్లి "నువ్వు మరీనూ" అంది.

"ఇంతకీ విషయమేంటి? ఏదైనా లవ్ ఎఫైరా? "

"ఓ ట్యూషన్ పిల్ల మెళ్ళో తాళి కట్టబో యాడంట" మరో కొలీగ్ సత్యవాణి చెప్పింది.

"నిజమా" అన్నానుగానీ చెప్పింది సత్తెమ్మ గనుక నమ్మితీరాలి. ఫ్రీలాన్స్ జర్నలిస్ట్ మా సత్యవాణి. ఆఫీసయ్యాక ఇళ్ళకువెళ్ళి మొగు ళ్ళకి సారీ మొగుడికి కాఫీ పోసి కాసేపట్లా మంచానికి అడ్డంపడో కుర్చీకి చేరబడో రెస్ట్ తీసుకుని మళ్ళీ రాత్రి మేతకు వంటింట్లో దూరి ఎక్సర్‌సైజ్‌లు చేసే రకం కాదామె.

పోనీ... నిద్రాహారాలు మానేసి పవిత్ర బంధం, ఇంటింటి రామాయణంలాంటి టీవీ సీరియల్స్ చూసుకుంటూ శేషజీవితం గడిపే కేండిడేటూ కాదు. 'శేషజీవితం' అనేది ఆఫీస్ అవర్స్ తర్వాత కాలం అన్న మాట.

సత్యవాణికింకా పెళ్ళికాలేదు. ఏ లవ్ ఎఫైరూ లేదు. ఇంట్లో వంటా గింటా అంతా తల్లి చూసుకుంటుంది. మార్కెట్ పని చెల్లి చూసుకుంటుంది. సో... అంతా ఖాళీనే. ఇంటికెళ్ళడం అమ్మిచ్చిన కాఫీ గొంతులో పొయ్యడం, ఇంటింటికీ రౌండ్స్ వెయ్యడం, వార్తలు సేకరించడం, వాటిని కన్‌ఫర్మ్ చేసుకోవడం, అందరికీ స్ప్రెడ్ చెయ్యడం హాబీ. నిజానికామె ఓ లివింగ్ లోకల్ న్యూస్‌పేపర్. సో... ఏదైనా చెప్పిం దంటే అది హండ్రెడ్ పర్సెంట్ ట్రూత్ అయివుంటుంది.

"డీటైల్డ్‌గా చెప్పు" అన్నాను సీతమ్మ తల్లి చ్చిన ఉప్పు మిరపకాయ కొరుకుతూ.

"సేల్స్‌టేక్స్ ఆఫీసర్‌గారమ్మాయికి రాధా కృష్ణ ట్యూషన్ తీసుకుంటాడు. నిన్న సాయంత్రం వాళ్ల టెరస్‌మీద కూర్చుని లెక్కలు చెప్తూ చెప్తూనే చటుక్కున ప్యాంట్ జేబులోంచి మంగళసూత్రం తీసి ఆ పిల్ల మెళ్లో కట్టబోయాట్ట. ఆ పిల్ల బిత్తరపోయి జామెట్రీబాక్స్‌లోంచి కంపాస్ తీసి రాధా కృష్ణ ముక్కుమీద ఒకపోటు పొడిచి కిందకి పరిగెత్తిందట. ఇక చూస్కో వాళ్ల నాన్నా, అన్నయ్యా, రాధాకృష్ణని ఫుట్‌బాల్ ఆడేశా రట. చుట్టుపక్కలవాళ్లని కూడా పోగేసి... ముఖానఉఊసేట్టు చేశారట"

"ఇదంతా నీకెవరు చెప్పారు? " అడిగాను.

"స్వయంగా ఆ అమ్మాయే, ప్రియా పొన్నూర్ చెప్పింది" అంది సత్యవాణి.

"ప్రియా పొన్నూరా? వాళ్లు హిందీ వాళ్లా? " అన్నాను.

"అబ్బే... మన తెలుగువాళ్లే. ఇప్పట్లో నార్త్ టైప్‌లో నేమ్స్ పెట్టుకోవడం లేటెస్ట్ ఫేషన్ కదా! అందుకే ఆ పిల్ల, పొన్నూరు అనే వాళ్ల సర్ నేమ్‌ని ప్రీఫిక్స్‌గా కాకుండా సఫిక్స్‌గా వాడింది"

"ఇంతకీ ఏం చదువుతోంది? "

"జూనియరింటర్. ఎమ్.పి.సి. ఆ గ్రూపే తన్ను రక్షించింది. తను ఎమ్.పి.సి. తీసు కోకుంటే జామెట్రీ బాక్స్‌తో తనకు నీడ్ వుండేదికాదు. ఆ బాక్స్ లేకుంటే కంపాస్‌తో అతన్ని పొడవగలిగి వుండేదికాదు" అంది సత్యవాణి.

"బైపిసి తీసుకుంటే డిసెక్షన్ బాక్స్ వుంటుందిగా. అందులో కత్తెర్లూ, కత్తులూ కూడా వుంటాయ్, జామెట్రీ బాక్స్‌కన్నా పవ ర్‌ఫుల్ డిసెక్షన్ బాక్స్... తెల్సా" అన్నాను.

"అయినా వాడికదేం పోయేకాలం. కమ్మగా ఉద్యోగం చేసి సంపాదించిపెడు తున్న పెళ్ళాన్నిట్లా ఏడిపిస్తున్నాడు" నిట్టూ

ర్పింది సీతమ్మతల్లి.

క్రిష్ణప్రియ భర్త... ఎమ్మెస్సీ చదివాడు గానీ ఉద్యోగం లేదు. ఓ రెండు మూడు ప్రైవేట్ స్కూల్స్‌లో మేథ్స్ టీచర్‌గా చేశాడు. అయితే ఆడపిల్లలవంక చూస్తూ వాళ్లకి మాత్రమే లెక్కలు చెబుతాట్ట. మగ పిల్లలు చిన్న డౌట్ అడిగినా "షటప్ అండ్ సిడౌన్' అంటాట్ట. అందుకే ఒక్కచోటా నిల బడలేకపోయాడు. రాధాకృష్ణ ఉద్యోగంలో చేరిన రోజున 'స్మయిల్స్‌డే' ఉద్యోగంలోంచి ఊస్ట్ అయిన రోజున 'టియర్స్‌డే' సెలబ్రేట్ చేసుకోవడం కృష్ణప్రియకు దినచర్య కాదు గాని నెలచర్యగా మారింది. ఇక లాభం లేదని, ఈమధ్య తనే తనకు తెలిసిన వాళ్ల రెకమండేషన్‌తో నాలుగైదు హౌస్‌ట్యూషన్స్ కుదిర్చిపెట్టింది. అందరూ మగవిద్యార్థులే అయ్యేలా జాగ్రత్తలు తీసుకుందిగానీ, ఈ సేల్స్‌టేక్స్ ఆఫీసర్‌గారమ్మాయి ట్యూషన్‌ఫీజ్ ఆఫర్ మరీ గుడ్ అమౌంట్‌కావడంతో, ఇంట్లోకి చొరబడి వేషాలేస్తాడా అని ధైర్యం చెప్పుకుని పతిదేవుడ్ని ఆ ట్యూషన్‌కి అనుమతించింది. పాపం తనకేం తెల్సు, ఈమధ్య రాధాకృష్ణ తాళిబొట్టు జేబులో వుంచుకుని తిరుగుతున్నాడని!

"పాపం క్రిష్ణప్రియ" అన్నాను.

సీతమ్మ తల్లి గాఢంగా నిట్టూర్చి అంది "ఈ మగాళ్లంతా ఇంతే, పురుగులు పడి చస్తారు"

"ఛ... సీత... అని పేరెట్టుకుని అట్లా తిట్టకూడదమ్మా మగాళ్లని" అన్నాను.

"ఏం ఎందుకు తిట్టకూడదట? " కసిగా చెయ్యి కడుక్కుంటూ అంది.

"రామాయణంలో సీత...ఎంతో సహన శీలి. రాముడేం చెప్పినా మౌనంగా పాటించింది" అన్నాను.

"అదంతా మీ భ్రమ. అసలు సీతకున్నది సహనం కాదు ఆత్మాభిమానం. రాముడు వెళ్లగొడితే... కాళ్లా వేళ్లా పడలేదు. రోషంగా వెళ్ళిపోయింది. కనీసం తండ్రిపేరైనా చెప్పకుండా లవకుశుల్ని పెంచింది. చివరకు రాముణ్ని కలిసినా అతని ఆహ్వానాన్ని తిరస్కరించి భూమిలో కలిసిపోయిందిగానీ అతని పంచన తిరిగి చేరలేదు" సీతమ్మ తల్లి ఆవేశంగా అంది.

ఆమె వాదన విన్నాక సీతా... ది పవర్‌ఫుల్ లేడీ అనుకున్నాను.

"సాయంత్రం ఆఫీసయ్యాక...ఓసారెళ్ళి క్రిష్టప్రియని పలకరిద్దామా" అంది సీతమ్మ తల్లి.

"ఇది సందర్భంకాదు. మనం వెళితే డెలికేట్‌గా ఫీలవుతుంది" అన్నానేను.

సీతమ్మ నాతో ఏకీభవించింది. కానీ... మా ఫ్రీలాన్స్ జర్నలిస్ట్ మాత్రం ఒప్పుకోలేదు. "మీర్రాకున్నా నే వెళ్తా" అంది.

ఆ సాయంత్రం ఆఫీసయ్యాక సీతమ్మా, సత్తెమ్మా బస్టాప్‌వైపెళితే, నేను ఆఫీస్ గేటు ముందు నిలబడ్డాను నన్ను పికప్‌చేసుకోవడానికి రాబోయే మా దుష్టుడికోసం ఎదురు చూస్తూ.

అయిదున్నరైంది. ఆరైంది. నా కోలీగ్స్ ఎవరెక్కాల్సిన బస్ వాళ్లెక్కేశారు. రోజూ అయితే వాళ్లెక్కే బస్‌కంటే ముందే మా బైక్ బయలుదేరేది. ఓపిగ్గా మరో అరగంట వెయిట్‌చేశాను. స్ట్రీట్‌లైట్స్ కూడా వెలిగాయి. నాలో సహనం చచ్చిపోయింది. 'ఖచ్చితంగా శ్యామలగౌరిని తల్చుకుంటూ ఏ డస్ట్‌బిన్ పక్కనో దేవదాసులా సెటిలైవుంటాడు. పక్కనో గజ్జికుక్క కూడా వుండేవుంటుంది' అసహ్యంగా అనుకున్నాను.

ఇక వెయిట్‌చెయ్యడం వేస్టనుకున్నాక, ఎదురుగా వస్తున్న ఓ ఆటోని చెయ్యెత్తి పిలవబోతున్న నేను సడన్‌గా నా ముందో టూ వీలర్ ఆగడంతో ఉలిక్కిపడి చూశాను. స్ట్రీట్‌ల్యాంప్ వెలుగులో అతన్ని శ్యామలగౌరి హజ్బెండ్‌గా పోల్చుకున్నాను.

"అరె! ఏంటీ... ఇంకా ఇక్కడే వున్నారు? ఓవర్ టైం పడిందా? " అడిగాడు మా శ్యామల మొగుడు భాస్కర్రావు.

"అదేం లేదండీ. మామూలుగా రోజూ ఆయనొచ్చి పికప్ చేసుకెళ్తారుగా. ఇవాళేంటో మరి రాలేదు. ఇప్పటిదాకా వెయిట్ చేసి ఇక ఆటోలో వెళ్దామనుకుంటున్నా"

"ఎక్కండి... వెళ్దాం" అన్నాడు చొరవగా.

చటుక్కున ఆరోజు రాత్రి అతను నావంక తదేకంగా చూసిన విషయం గుర్తుకొచ్చింది.

'ఒకవేళ నా భ్రమేమోలే! అయినా అందరూ మా ఆయనలాంటి వాళ్లుంటారా!' అనుకున్నా. ఒకవేళ ఎక్కి కూర్చుంటే అరగంటలో ఇంట్లో పడతాను గదా అన్న స్వార్థం నన్నట్లా ఆలోచించేట్టు చేసిందేమో మరి.

"పరాయివాడ్నేం కాదుగా. ఎక్కండి ప్లీజ్" అన్నాడు.

నా చీరగానీ... శరీరంగానీ అతనికి తగలకుండా జాగ్రత్తలు తీసుకుంటూ కూర్చున్నాను.

రోడ్ మీద బైక్ సర్రున దూసుకుపోతోంది.



"పరాయివాడ్నేం కాదుగా. పరాయివాడ్నేం కాదుగా" అతనన్న ఆ మాట నా చెవుల్లో గింగురుమంటోంది. ఆ పదప్రయోగం ఎందుకోగానీ నాకు బొత్తిగా నచ్చలేదు.

ఆలోచించి... ఆలోచించి బుర్రవేడెక్కిపోయింది.

"ఛ... ఏదో వాగాడు. వదిలేద్దాం. ఫ్రెండ్లీ టాకింగేమోలే" అనుకున్నా. అట్లా అనుకున్నాక మనశ్శాంతిగా అన్పించింది.

మిరుమిట్లు గొల్పుతున్న స్ట్రీట్ లైట్స్‌నీ రోడ్డుమీద వచ్చేపోయే వెహికల్స్‌నీ, రోడ్డు బారుగా వున్న షాపుల్నీ, రెస్టారెంట్లనీ ఐస్ క్రీమ్ పార్లర్స్‌నీ, చూస్తూ ఎంజాయ్ చేస్తున్న నేను ఉన్నట్టుండి గమనించానో విషయాన్ని.

అతని టూ వీలర్ మా ఇంటిదారిని వదిలేసి మరో వేలో పోతోంది.

"ఏంటీ ఇటు వెళ్తున్నారు? " అన్నాను.

"ఆగండి మీకే తెలుస్తుంది" అన్నాడు.

"ఏంటీ తెలిసేది. నీ పిండాకూడు" సణుక్కున్నా. నాకు చాలా అనీజీగా వుంది. 'ఎరక్కపోయి ఎక్కాన్రా దేవుడా' అనుకున్నా.

నా ఆలోచనల్తో ఎటువంటి సంబంధం లేని భాస్కర్రావు బైక్‌ని ఓ ఖరీదైన రెస్టారెంట్ ముందు ఆపాడు.

"దిగండి" అన్నాడు.

"దిగను" అని చెప్పాలన్పించిందిగానీ. జస్ట్ కర్టెసీ సేక్ దిగాను.

"రండి" అన్నాడు.

"రాను" అని చెప్పలేక అతన్ని ఫాలో అయ్యాను.

ఓ కార్నర్ టేబుల్ సెలక్ట్‌చేసి కూర్చోమన్నాడు.

'కూర్చోను' అనలేక కూర్చున్నాను.

"ఏం తీసుకుంటారు? " అన్నాడు మెనూ కార్డ్ నా ముందుకు తోస్తూ.

"నీ ఎముకల సూపూ... కనుగుడ్ల రోస్టూ"

"ఏంటీ? " అన్నాడు వినబడక.

"శ్యామలగౌరికీ విషయం తెలిస్తే, ఖచ్చితంగా ఆ రెండూ చేసి తీరుతుంది" అనుకున్నాను మెల్లగా.

"మీలో మీరే ఏదో సణుక్కుంటున్నారు. నాకు చెప్పకూడదా" అన్నాడు.

'ఏంటమ్మా గారాలు పోతున్నావ్' అనుకుని "ఏమొద్దండీ జస్ట్ కాఫీ చాలు" అన్నాను.

అప్పుడు నవ్వాడు. అతనో నవ్వు నవ్వి మెనూ కార్డ్‌ని ముందుకు లాక్కుని, వెయిటర్‌కి ఓ రెండు ఐటమ్స్ ఆర్డర్ చేశాడు.

"ఇవ్వాళ మీ బర్త్‌డేనా? " అనుమానంగా అడిగాను.

"అంతకంటె గ్రేట్ డే" అన్నాడు.

"ప్రమోషన్ కొట్టేశారా? " నవ్వుతూ అన్నాను.

"ఎగ్జాట్లీ" అన్నాడు ముఖం వెలిగిపోతుండగా.

ఒక్కసారిగా జాలేసింది 'పాపం... సంతోషాన్ని దాచుకోలేక పెళ్ళాం ఫ్రెండ్‌ని కాబట్టి చిన్న ట్రీటిస్తున్నాడు. అనవసరంగా అపార్థం చేసుకున్నాను' మనసులోనే లెంపలు వాయించుకున్నాను.

ఖచ్చితంగా ఇతను మా ఆయనలాంటి బడుద్ధాయి మాత్రంకాదు.

"ప్రమోషన్ ఎందులో అని అడగరేం? " ఉత్సాహంగా అన్నాడు.

"ఎందులో వుంటుంది. మీ ప్రొఫెషన్‌లో అయివుంటుంది" తేలిగ్గా అన్నాను.

"అందులోకాదు" చిలిపిగా నవ్వాడు.

జరిగే ఈ సంభాషణకూ, ఈ చిలిపితనం ప్రదర్శనకూ సంబంధమేంటో అంతుబట్టటం లేదు నాకు.

చెప్పుకోండి చూద్దాం" మళ్ళీ చిలిపితనం.

అప్పుడే బేరర్ తెచ్చిపెట్టిన వేడివేడి మాసాలా దోశ ప్లేటును ఆ చిలిపిముఖం మీద బోర్లిస్తే ఎట్లా వుంటుందో అనుకున్నాను.

"కమాన్ యార్... ట్రైటుగెస్" అన్నాడు.

'అమ్మో... యారా? ఎప్పట్నుంచీ నేను

వీడికి యార్ని?'

'వీడు' అన్న పదం మొదటిసారిగా మనసులో వాడేశాను.

"ఐ కాన్ట్" అన్నాను.

"ఓ.కే. హేవిట్. టిఫిన్ పూర్తయ్యేలోపు మీరు చెప్తే సరే, లేదంటే నేనే చెప్పేస్తా"

"శ్యామలగౌరీ! నీ మొగుడొట్టి జిడ్డే. వూర్నుండి వచ్చాక బ్రిజ్ బార్తో బాగా తోంకో"

మసాలాదోశ తింటున్నానేగానీ దాని రుచిని ఆస్వాదించలేకపోతున్నా. ఎందుకో గానీ ఈ గెట్ టుగెదర్ అబ్నార్మల్గా అయిష్టంగా వుంది నాకు.

"ఐలైక్ వర్కింగ్ ఉమెన్" ఉన్నట్టుండి అన్నాడు.

ఒక్కసారి కళ్లెత్తి అతనివంక చూశాను.

అతను నా వంకే చూస్తున్నాడు. ఆ చూపులు నార్మల్గా లేవు. ఏదో తేడా వుంది. శ్యామలగౌరి హౌస్ వైఫ్. నేను జాబ్ హోల్డర్ని.

"షార్ట్ హెయిర్ లేడీస్కి బాగుంటుంది" ఈసారి మాటతీరులో కూడా తేడా వుంది.

శ్యామలది. కరినాగులాంటి పొడవాటి జడ. నాది షార్ట్ హెయిర్.

బేరర్ ఫ్రూట్సలాడ్ తెచ్చిపెట్టాడు.

"ఇక నేనేమీ తిన్లేను" బ్లంట్గా చెప్పాను. అక్కడ్నుంచి ఎప్పుడెప్పుడు బయటపడదామా అని వుంది నాకు.

'ప్లీజ్...నాకోసం" అన్నాడు.

నా ఫ్రెండ్ మొగుడు మరీ ఓవరవుతున్నాడన్పించింది. వాడితో బతిమాలించుకోవటం ఇష్టంలేక... విషం మింగినట్టు దాన్ని మింగడం మొదలెట్టా.

"ఆడాళ్లు బొద్దుగా వుంటే ముద్దొస్తారేమో గానీ, సన్నగా నాజూగ్గా వుంటేనే ప్రొవోకింగ్గా వుంటారు"

సన్నగా వుండేది నేను. శ్యామలగౌరి బొద్దుగా వుంటుంది.

వాడి ఇంటెన్షన్ పూర్తిగా అర్థమైంది నాకు. ఫ్రూట్ సలాడ్ సగం వుండగానే వదిలేశాను.

బిల్ పే చేస్తూ అన్నాడు "గెస్ చేశారా?"

"చెయ్యలేదు" చెప్పాను.

"నేను ప్రమోషన్ కొట్టేసింది మీతో ఫ్రెండ్షిప్లో. నిన్నటివరకూ నేను మీ ఫ్రెండ్ భర్తని. ఇవాల్టినుండీ... స్వయానా మీ ఫ్రెండ్ని యామైరైట్?" అతనో ఐదు రూపాయల కాయిన్ టిప్గా వదిలి లేచాడు.

నేను వడివడిగా నడుస్తూ అతనికంటే ముందే బయటకొచ్చాను. అతను బైక్ కిక్ కొట్టి నాకోసం నిలబడ్డాడు. నేనతని వంకయినా చూళ్లేదు.

లక్కీగా అప్పుడే అటు వచ్చిన ఆటోని ఎక్కేసి అడ్రస్ చెప్పాను.



"కంప్యూటర్ యంత్రమే కావచ్చు కానీ... మనిషికి మనిషిలా సహకరిస్తోంది. ఎట్రిజెంట్ కంప్యూటర్లు మనిషి మాటల్నీ, రూపురేఖల్ని కూడా గుర్తించగలుగుతున్నాయి. దానికి ఈ కృత్రిమ మేధను ప్రసాదించింది మనిషే.

ఇవాళ ఆర్టిఫిషియల్ ఇంటెలిజన్స్ రంగం రోబోట్లనీ, సైబర్గ్లనీ, యాండ్రాయిడ్స్నీ ప్రపంచానికందిస్తోంది.

మనిషి ఆదేశించిన పనులు చేసేవి రోబోట్లు, కంప్యూటర్స్తో సులువుగా కాన్వర్స్ చేసేందుకు శరీరంలో ఆటోమేటిక్ చిప్స్ని అమర్చుకుని యంత్రమానవులుగా తయారయ్యేవారు సైబర్గ్లు.

కంప్యూటర్నీ, మనిషినీ సమపాళ్లలో కలిపితే తయారయ్యే హ్యూమన్ కంప్యూటర్లు యాండ్రాయిడ్స్.

యాండ్రాయిడ్స్ని సృష్టించేదిశగా ఇప్పుడు శాస్త్రజ్ఞులు పరుగులు తీస్తున్నారు. భవిష్యత్తులో ప్రతి ఇంటా మనిషిలా ఆలోచించి మనిషిలా పనిచేయగల యాండ్రాయిడ్స్ని

మెయింటెన్ చేసే రోజులు వచ్చే తీరు తాయి.

నేనూ ఆ విషయంమీదే పరిశోధనలు చేశాను. యాండ్రాయిడ్స్‌ని సృష్టించలేకపోయినా మెదడు పనితీరును నిర్దేశించగల చిప్స్‌ని మాత్రం కనిపెట్టాను. నా ప్రయోగాలు విజయవంతమయ్యాయనడానికి నిదర్శనం అదుగో. ఆమే ప్రత్యక్షసాక్షి" పురుషోత్తం మా హనుమాయమ్మ పిన్నికేసి చూశాడు.

మా పిన్ని కళ్లు కృతజ్ఞతతో నిండిపోయాయి. "నేను కొలిచే దేవుళ్లు నాకేం మేలు చేశారో నాకు తెలీదమ్మాయ్. ఈ డాక్టరు గారు చేసిన మేలు మాత్రం జన్మజన్మలకీ మరవలేను" అంది.

ఆరోజు భాస్కర్రావుని రెస్టారెంట్లో వదిలేసి ఇంటికెళ్లేసరికి మా ఆయన అప్పటికే ఇల్లు చేరుకుని టీవీలో "ప్రియురాలీ అడ్రస్సేమిటో కాస్త చెప్పమ్మా" అంటూ జగపతిబాబుతో గొంతుకలిపి పాడుతున్నాడు. శ్యామలగౌరి పుట్టింటి అడ్రసు చెబుదామనుకుని, ఎట్లానో నన్ను నేను కంట్రోల్ చేసుకుని అడిగాను. "ఏమైందివాళ"

"బైక్ ట్రబులిచ్చింది. షెడ్‌లో ఇచ్చాను. ఇదుగో అయిపోయింది. అదిగో అయిపోయిందంటూ ఓ గంటా గంటన్నర కూర్చోబెట్టాడుగాని ప్చ్... అవలేదు. రేపు కలెక్ట్ చేసుకోవాలి. అవునూ నువ్వెట్లా వచ్చావ్?"

భాస్కర్రావు లిఫ్ట్ ప్రహసనం ఎత్తకుండా "ఆటోలోవచ్చా" అన్నాను ముక్తసరిగా.

★ ★ ★

ఆ మార్నింగ్ ఇద్దరం ఆఫీస్‌కి బయలుదేరినప్పుడు నాకెందుకో చప్పున క్రిష్ణప్రియ గుర్తుకొచ్చింది.

'లిఫ్ట్‌కావాలా' అంటూ దేబిరించుకున్నట్టు నిలబడి వున్నాడు మాముందు భాస్కర్రావు.

"మీరు... అతని బైక్‌మీద వెళ్ళండి. నేను దార్లో మా కొలీగ్‌ని కల్సి... ఆమెతోపాటు వెళతాను" అన్నాను.

'మహద్భాగ్యం' అన్నట్టూ మా ఆయన భాస్కర్రావు బైక్ ఎక్కేశాడు. భాస్కర్రావ్ నా వంక అదోలా చూస్తూ బైక్ స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయాడు.

టైమ్ చూశాను. ఆఫీస్ టయానికి ఇంకా అరగంటుంది.

ఎందుకట్లా అన్పించిందోగానీ క్రిష్టప్రియని చూడాలని బలంగా అన్పించింది. ఆటో పిల్చి ఎక్కాను. క్రిష్టప్రియ ఇంటిముందు ఆటో దిగుతున్న నాకు ఇంటిముందు ఓ పదీపదిహేను మంది గుంపుగా నిలబడి వుండటం కన్పించింది.

ఆటోఫేరు చెల్లించకుండానే గబగబ ఇంటివైపు నడిచాను.

"సమయానికి నేను రాకపొయ్యుంటే... ఘోరం జరిగిపోయేది" అంటోంది గుంపులోని ఒకావిడ.

"ఏమైంది" ఆదుర్దాగా అడిగాను లోపలికి తొంగిచూస్తూ. క్రిష్ణప్రియకోసం నా కళ్లు వెదుకుతున్నాయి.

"క్రిష్ణమ్మా నిద్రమాత్రలు మింగేసిందమ్మా. ఇంట్లో పాలు విరిగిపోతే ఆ అమ్మాయిని కొంచెం అడుగుదామని వెళ్లాను. వంటగది గడపకడ్డంగా పడిపోయింది" చెప్పింది ఇందాక మాట్లాడుతున్నావిడ.

ఆమె ప్రియనిచూసి కేకలేసేసరికి మొద్దులా నిద్రపోతున్న ఆమె భర్త లేచొచ్చాడు. నలుగురూ పోగయ్యి ఆమెను హాస్పిటల్లో చేర్పించారు. విషయం అర్థమవగానే అడిగాను "ఏ హాస్పిటల్లో అడ్మిట్ చేశారు?"

"ప్రశాంతీ నర్సింగ్‌హోమ్" చెప్పారొకరు.

రూమ్ నెంబర్ అక్కడెవరికీ ఇంకా తెలీదు. ప్రియని తీసికెళ్ళి ఓ అరగంటయ్యిందంతే.

ఇందాక నేనెక్కి వచ్చిన ఆటోనే ఎక్కి హాస్పిటల్‌కి పోనిమ్మన్నాను.

రిసెప్షన్‌లో... సూయిసైడ్ కేసని వివరాలు చెప్పగానే రిసెప్షనిస్టు ప్రియ రూమ్ నెంబర్ చెప్పింది.

కానీ... రూమ్‌లో ప్రియలేదు. ఇంకా డాక్టర్ల అబ్జర్వేషన్లోనే ఆపరేషన్ థియేటర్లో వుంది. థియేటర్ బయట దిగాలుగా నిలబడి వున్నాడొక పొడుగాటి వ్యక్తి. నేనెప్పుడూ క్రిష్ణప్రియ భర్తను చూళ్లేదు. ఇతనే అతనై వుంటాడన్పించింది. ఇంకో ఇద్దరాడవాళ్లు, ఓ నడివయసాయనా కూడా వున్నారు.

దగ్గరగా వెళ్లి "క్రిష్ణప్రియ కెట్లావుంది? " అన్నాను.

అతను నాకేసి ఆరాగా చూసి "స్టాఫా" అన్నాడు.

ముందు విషయం చెప్పరా వెధవా అనుకుని "ఆ...ఆమె కెట్లావుంది? " అన్నాను.

"ఇంకా ఏం చెప్పటంలేదు డాక్టరుగారు" అన్నాడు కర్చీఫ్‌తో కళ్లు తుడుచుకుంటూ. అతని కళ్లలో కన్నీళ్లు లేకపోవడం స్పష్టంగా కనబడింది నాకు.

'ఓ బాటిల్ గ్లిజరిన్ కొనుక్కో. నేచరల్‌గా వుంటుంది' అని చెప్పాలనిపించింది.

"ప్రియ పేరెంట్స్‌కి ఇన్‌ఫాం చేశారా? " అన్నాను.

"ఇంకా లేదు" అన్నాడు.

"చచ్చాక చేద్దామనుకొన్నారా? " అసంకల్పితంగా అనేశాను.

అతను హర్ట్ అయినట్టుగా చూశాడు.

"అదేంటండీ అట్లా అంటారు" అన్నాడు.

నేనతని మాటల్ని పట్టించుకోకుండా "వాళ్లకి ఫోన్ ఫెసిలిటీ వుందా? " అడిగాను.

"వాళ్లకు లేదు. పక్కింటికి చేస్తే చెబుతారు" అని "వాళ్లనెందుకండీ కంగారు పెట్టడం. నే చూసుకుంటాలెండి" అన్నాడు.

"ప్లీజ్ నెంబర్ చెప్పండి" అన్నాను.

"ఇందాకట్నుంచీ మేమూ అదే చెబుతున్నామమ్మా. అటు పెద్ద వాళ్లనో, ఇటు పెద్ద వాళ్లనో, పిలవమని. వినడంలేదు" అన్నారు అతన్తో పాటూ అక్కడున్నవాళ్లలో ఒకరు.

వాళ్లు క్రిష్ణప్రియ నైబర్స్ అయివుంటారని అర్థమైంది.

అతను షర్ట్ పాకెట్‌లోంచి చిన్నబుక్ లాంటిది తీసి... ఓ నెంబర్ చెప్పాడు. చెప్పాక "నే చేస్తాలెండి" అన్నాడు.

నేనతనికి రెస్పాన్స్ ఇవ్వకుండా రిసెప్షన్‌లోకి పరిగెత్తినట్టుగా వెళ్లి ఓ ఫోన్ చేసుకుంటానని అడిగాను.

"నో అవుట్‌గోయింగ్ కాల్స్... ఓన్లీ ఇన్‌కమింగ్" అంది.

"నీ మొహంకాదూ" అనుకుని బయటకు పరుగెత్తి దగ్గర్లోనే వున్న టెలిఫోన్ బూత్ నుంచి ఫోన్ చేశాను. క్రిష్ణప్రియ పక్కింటి వాళ్లకీ విషయం చెప్పి... ప్రియ అమ్మకు చెప్పమన్నాను. తరువాత మా ఆఫీస్‌కి ఫోన్ చేసి విషయం చెప్పి, కాస్త లేట్‌గా వస్తానని చెప్పాను. క్రిష్ణప్రియ అమ్మగారిది ఈ వూరే. ఆమెకి తండ్రిలేడు. అమ్మా, ఓ చెల్లెలూ వున్నారు. ఫోన్‌చేసిన ఇరవై నిముషాలకల్లా దూకారు వాళ్లు.

రావడం... రావడమే "ఏం చేశావయ్యా రాధాకృష్ణా నా బిడ్డని" అంటూ బావురుమంది ప్రియతల్లి.

ప్రియ చెల్లెలు అతనికేసి నిరసనగా చూసి చెప్పింది. "మా అక్కకేమైనా అయ్యిందో నిన్ను పోలీసులకి పట్టిస్తాను. నేనే చంపేస్తాను"

అట్లా అంటున్నప్పుడు ఆమె పెదవులు దుఃఖంతో అదురుతుండటం స్పష్టంగా కనబడింది.

అతనేదో రోషంగా అనబోతున్నంతలో థియేటర్ తలుపు తెరుచుకుంది.

"ప్రమాదం తప్పింది. ఇంకేం పర్లేదు" అన్నాడు థియేటర్ బయటకొచ్చిన డాక్టర్.

ఆ సాయంకాలం... మా స్టాఫంతా వచ్చి ప్రియని పలకరిస్తున్నప్పుడు ఆమె వెక్కివెక్కి ఏడుస్తుంటే అన్నాన్నేను. "తప్పు చేసింది

అతను. శిక్ష మాత్రం నీకా? "

"అతను చేసిన తప్పుకు అతన్ని చంపె య్యాలి. ఆ పనెలాగూ చేయలేను కాబట్టే నేను చావాలనుకున్నా" సన్నగా రోదిస్తూ అందామె.

"చచ్చి దయ్యమై పడదామనుకున్నావా? " కోపంగా అంది సత్యవాణి.

"ఏదైనా బతికున్నప్పుడే సాధించగలం" అంది సీత.



"ఏంటి సాధించేది? అతని దృష్టిలో... నేనో కంప్యూటర్ని. మీటనొక్కి ఆర్డర్ చేస్తే... పనిచేసే రోబోట్‌లాంటిదాన్ని అంతే గాని మనిషిని కాదు. నేనో మనిషిననీ, నాకూ ఓ మనసుంటుందనీ అతననుకోడు. అనుకోకపోబట్టేగా అతనట్లాంటి పనులు చేస్తున్నాడు! యంత్రంలా ఇట్లా బతికే బదులు..." క్రిష్ణప్రియ ఏదేదో అంటోంది.

నేనో కంప్యూటర్నీ, రోబోట్‌లాంటిదాన్నీ అని క్రిష్ణప్రియ అంటున్నప్పుడు వెలిగింది నా మెదడులో ఓ బల్బ్. ఆ వెలుగులో మా హనుమాయమ్మ పిన్ని నవ్వుతూ కన బడింది. ఆ వెంటనే డాక్టర్ పురుషోత్తమ్ 'డోంట్‌వర్రీ బేబీ' అంటూ ప్రత్యక్షమ య్యాడు.

ఆఫ్టరాల్... ఇప్పుడు మా పిన్నీ, నేనూ, క్రిష్ణప్రియా డాక్టర్ పురుషోత్తమ్ కన్సల్టింగ్ రూమ్‌లో వున్నాం.

"అయితే డాక్టర్! ఖచ్చితంగా నా భర్తలో మార్పు వస్తుందంటారా? "

"ఎగ్జాట్లీ... ప్లీజ్ ఆస్క్ హను మాయమ్మ" అన్నాడాయన.

ఈమధ్యనే స్పోకెన్ ఇంగ్లీష్ కోర్సులో చేరిన మా పిన్నికి డాక్టర్ అన్నమాట అర్థమైంది. అందుకే క్రిష్ణప్రియ అడక్కుం డానే ఆన్సర్ చెప్పింది.

"అమ్మాయ్ విజ్జీ! ఓసారి... ప్రియని మనింటికి తీసుకురా. మీ బాబాయ్‌నోసారి ఆడించి చూపిస్తా" అంది.

క్రిష్ణప్రియ డాక్టర్‌వంక అబ్బు రంగా చూసింది. "సర్... ఇదెలా సాధ్యం? " అంది.

"వెరీ సింపుల్... దిసీజాల్ పాజిబుల్ త్రూ కాగ్నిటివ్ సైన్స్. ఆర్టి ఫిషియల్ ఇంటలిజెన్స్‌తో ఆర్టిఫిషియల్ మనిషిని, ఐ మీన్ కంప్యూటర్ సిస్టమ్స్‌ని రూపకల్పన చేసే ప్రక్రియలో ముఖ్యమైన విభాగమిది. మనిషి ఆలోచనా విధానాన్ని విశ్లేషించే శాస్త్రం. మనిషి మెదడు ఎలా పని చేస్తుందనే విషయాన్ని ఇందులో అధ్య యనం చెయ్యొచ్చు ఈ సైన్స్ ప్రొడక్టే... ఎక్స్‌పర్ట్ సిస్టమ్స్ పేరిట ఫేమస్ అవుతున్న కంప్యూటర్ సాఫ్ట్‌వేర్లు"

ఆయన చెప్పేది ఆసక్తిగా వింటున్నా నేను.

"మెదడులో సమాచారాన్ని విశ్లేషించేవి న్యూరాన్లు. ఈ అనలైజేషన్‌కోసం, ప్రాసెసిం గ్‌కోసం మెదడులో లక్షలకొద్దీ సర్క్యూట్లుం

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.




ఎడిటర్:

చతుర

'ఈనాడు' కాంపౌండ్

హైదరాబాద్, 500 082.

# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

మే చతుర నవల **ది సిలికాన్ ఫ్యామిలీ**

చిరునామా: ____________________

____________________

____________________

____________________

టాయ్. ఇక కంప్యూటర్లో మెదడులా పని చేసే పరికరం మైక్రోప్రాసెసర్. సిలికాన్ తలం మీద తన మెదడులో వుండేలాంటి సర్క్యూట్లను ఎంతో దగ్గరగా అమర్చి ఈ మైక్రోప్రాసెసర్లని సృష్టించి కంప్యూటర్ని మనిషిలా ఆలోచించేలా చేస్తున్నారు. అదేవిధంగా మెదడులో ఆర్టిఫిషియల్ సర్క్యూట్ల ద్వారా... ఆర్టిఫిషియల్ ప్రాసెసర్ని సృష్టించి అతని ఆలోచనావిధానంలో ఎందుకు మార్పు తేకూడదూ అనుకున్నాను. అనుకున్నది సాధించాను"

ఆయన చెప్పిందంతా శ్రద్ధగా విన్నాక అడిగింది క్రిష్ణప్రియ.

"సర్... ఆయన్నెప్పుడు తీసుకురమ్మంటారు? "

"ఎట్ ఎనీ టైమ్. కన్సల్టింగ్ అవర్స్ కాకపోయినా ఐ డోంట్ మైండ్"

ఆ ఒక్కమాటతో అర్థమైంది నాకు. ఆయన చేసేది కేవలం ప్రాక్టీస్కాదనీ, ఓ రకమైన సోషల్ సర్వీస్ అని.

★ ★ ★

మా హనుమాయమ్మ పిన్ని ఎంతయినా ఉద్దండపిండం కాబట్టి బాబాయ్ని డాక్టర్ దగ్గరకి అవలీలగా తీసుకెళ్ళగలిగింది.

ఈ కాలపు వాళ్లకు ఎంత చదివినా, ఉద్యోగాలు చేస్తూ వూళ్లేలినా మొగుళ్లను గ్రిప్లో పెట్టుకునే ఆర్ట్మాత్రం అస్సలు రాదు.

పురుషోత్తంగారిని కలిసి మూడురోజులైనా క్రిష్ణప్రియ రాధాకృష్ణని కన్సల్టేషన్కి తీసుకెళ్లలేకపోతోంది.

'ఫలానా డాక్టర్ దగ్గరకెళదాం' అంటుందనుకో... అతను

'ఎందుకు? ' అంటాడు.

'నీ బుర్రకు రంధ్రమేసి అందులో ఓ మైక్రోచిప్ అమరుస్తారు. దాంతో నువ్వు నా కొంగట్టుకుని తిరుగుతావ్' అని చెప్పడం కుదరదుకదా!

మరి ఏం అబద్ధం చెప్పాలి. ఎలా అతన్ని పురుషోత్తంగారి ఎదుట కూర్చోబెట్టాలి అన్న ఆలోచనతోనే ప్రియ సతమతమౌతోంది.

నేనూ ఈ విషయంలో ఆమెకేదైనా హెల్ప్ చెయ్యగలనా అన్న దిశగా తెగ ఆలోచిస్తున్నా.

క్రిష్ణప్రియ మొగుడి ఆపరేషన్ సక్సెస్ అయితే మా ఆయనక్కూడా చేయిస్తానంటూ లైన్లోకొచ్చింది సీతమ్మ తల్లి.

సత్యవాణయితే... ఆల్రెడీ చిప్ అరేంజ్ చేయించాకే, సదరు వ్యక్తిని పెళ్లాడతానంటోంది.

ఆరోజు సాయంత్రం ఆరున్నరా ఏడు గంటలప్పుడు క్రిష్ణప్రియ భర్తను పురుషోత్తంగారి దగ్గరకు తీసుకెళ్లేదెలా అని ఆలోచిస్తూ వరండాలో కూర్చుని వున్నా. ఆయన ఇంట్లో లేడు. ఆఫీస్ నుండి రాగానే నేనిచ్చిన కాఫీ తాగి బలాదూర్ తిరగడానికెళ్లాడు.

ఆకాశంనిండా నల్లటి మబ్బులు. ఉండి ఉండీ రాలుతున్నాయి ఇంతలావు చినుకులు. వాటికి తోడు ఈదరగాలి, మొత్తంమీద వాతావరణం ఆహ్లాదంగానే వుందిగాని పవర్కట్ అవుతుందేమోనని ఓ మూల భయంగా వుంది. లోపలకెళ్ళి కేండిలూ, అగ్గిపెట్టె కరెంట్పోయాక తడుము కోకుండా రెడీగా తీసి పెట్టుకోవాలనుందిగానీ లేవాలంటే మాత్రం బద్ధకంగా వుంది.

చూస్తుండగానే ఒక్కొక్కటిగా రాలుతున్న చినుకులు ఒక్కటైపోయి ధారలుగా మారాయి. గాలి కూడా ఎక్కువైంది. వూగిపోతున్న కొబ్బరిమట్టలు పోల్నుంచి ఇంటికి కనెక్ట్చేయబడ్డ వైర్లకు వూరికే రాసుకుంటున్నాయ్. దాంతో లైట్స్ రెపరెపలాడుతున్నాయి.

ఇక లాభంలేదని... కేండిలూ, అగ్గిపెట్టె దగ్గర పెట్టుకుందామని లేవబోతున్నంతలో హఠాత్తుగా పవర్కట్టయింది. కటిక చీకటి. ఇక లేచీ లాభం లేదనుకుని... వున్నచోటే కూర్చుండిపోయాను.

ఉన్నట్టుండి... నా కళ్లమీద పడింది

టార్చ్‌లైట్ ఫోకస్. భృకుటి ముడిచి కళ్లకు అరచేతుల్ని అడ్డుగా పెట్టుకున్నాను.

"ఓ... సారీ... కళ్లకు ఫోకస్ చేశానా? " అంటూ టార్చ్‌లైట్ వెలుగుతోపాటు ఎంట రైపోయాడు భాస్కర్రావు ఎదురు పోర్షన్లోంచి మా వరండాలోకి ఓ వంక తడు స్తూనే.

ఎప్పట్నుంచీ... జేబులో పెట్టుకుని ఈ సదవకాశం కోసం చూస్తున్నాడో గాని, చొర వగా ఇంట్లోకెళ్ళి జేబులోంచి కేండిల్ తీసి, వెలిగించి మా డైనింగ్ టేబుల్ మీద పెట్టాడు. టార్చ్‌లైట్ వెలుగులో అతను చేస్తున్నదంతా స్పష్టంగా కనబడుతోంది నాకు.

తరువాత వరండాలోకొచ్చి నాకెదురుగా వున్న మరో చెయిర్లో కూర్చున్నాడు.

అతనట్లా మా ఇంటికొచ్చి కూర్చోవడం కొత్తేమీ కాదుగాని, ఆ రెస్టారెంట్ ఇన్సి డెంట్ దగ్గర్నుండీ, అతనేం చేసినా రోతగానే అన్పిస్తోంది నాకు.

"మీకు చీకటంటే భయమటగా, మీ ఫ్రెండ్ చెప్పింది" అన్నాడు తనేదో నాకు పెద్ద సాయం చేసినట్టు.

శ్యామలగౌరి మొగుడికి ఇట్లాంటి చెత్త విషయాలు కూడా చెబుతుందని ఇప్పుడే తెలిసింది నాకు.

"ఇంకా ఏం చెప్పింది? " అన్నాను. అన్నా నుగానీ తెలీలేదు నాకు అట్లా అని ఎంత పొరపాటు చేశానో!

"మీకు గులాబీపూలంటే ఇష్టంట. తెలుపు నలుపు రంగులంటే పడి చస్తార్ట. నాగార్జున మీ ఫేవరెట్ స్టారట. భూమిక అంటే ప్రాణమట. మీ ఫేవరెట్ డిషెస్ బాసుంది, వెజిటబుల్ బిరియానీ. యులైక్ హిందీ సాంగ్స్ ఇట్లా ఒకటేమిటి, మీ ఇష్టాయిష్టా లన్నీ చెప్పేసింది"

"శ్యామలగౌరీ! నీ టేస్ట్ గురించి నీ మొగు డికి చెప్పడం న్యాయం. నీ ఫ్రెండ్ టేస్ట్ గురించి చెప్పాల్సిన అవసరమేంటి? నీకిదేం పోయేకాలమే తల్లీ!" అనుకున్నాను.

"వర్షం ఇప్పట్లో తగ్గేలా లేదు" అన్నాడు.

"అవును. నువ్వు కూడా ఇప్పట్లో వదిలేలా లేవు" అనుకున్నాను.

కాసేపు నిశ్శబ్దంగా వుండిపోయాను. అతనూ మాట్లాడలేదు.

వర్షధారలు చేసే ధ్వని చిత్రంగా వుంది. స్ట్రీట్‌లైట్స్ కూడా వెలగటంలేదు. ఈయనె క్కడ తిరుగుతున్నాడో ఏమో!

"ఏమైనా చెప్పండి" హఠాత్తుగా అడి గాడు. అతని స్వరంలో ఏదో మార్పు.

"ఏం చెప్పమంటారు? " అన్నాను అయో మయంగా.

"మీ కాలేజ్‌డేస్ గురించి చెప్పండి. లేదా మీ పెళ్ళయిన తొలినాళ్ల గురించి చెప్పండి" అన్నాడు.

ఓ క్లోజ్‌ఫ్రెండ్‌ని అడిగినట్టు అడుగుతు న్నాడు. నా పెళ్ళయిన తొలినాళ్ల గురించి వీడికి చెప్పాలా! ఇంకా నయం. మీ హనీ మూన్ అనుభవాల గురించి చెప్పండి అన్లేదు.

"ఏదోకటి మాట్లాడండీ" గారంగా అన్నాడు.

సరే మాట్లాడితే పోలా అనుకున్నాను.

"మా పెళ్లయిన కొత్తల్లో..." అంటూ అతని ముఖంలోకి చూశాను. హఠాత్తుగా అలర్టయిపోయాడు. ఎంత ధైర్యం వీడికి. ఒక పరాయి స్త్రీని పట్టుకుని ఇట్లాంటి కబుర్లు చెప్పమంటున్నాడు!

నాలో ఏదైనా అలుసు తీసుకున్నాడా! నేనెప్పుడూ ఎవరితో కూడా నన్ను చీప్‌గా అంచనావేసేవిధంగా ప్రవర్తించను. నో... నాలో ఏ లోపం లేదు. వీడిలోనే వుంది. మా ఆయన కూడా శ్యామలగౌరితో ఇంత ఆక్వర్డ్‌గా ఎప్పుడూ మాట్లాడి వుండడుగాక వుండడు. మానసిక రోగిలా గుడ్లప్పగించి చూస్తూ వుంటాడంతే.

"చెప్పండి" చొంగ కార్చుకుంటూ అడి గాడు.

"మా పెళ్ళయిన కొత్తల్లో... హనీమూన్‌కి మేం వూటీ... కొడైకెనాల్ ట్రిప్ వేసుకున్నాంలెండి. ఊటీలో ఓ హోటల్లో రూమ్ తీసుకున్నాం" అతను వూపిరి బిగపట్టి వింటున్నాడు.

"మా వారు ఫ్రూట్స్సూ, ఫ్లవర్స్సూ తెస్తానని ఓ సాయంత్రం నన్నొక్కదాన్ని గదిలో వదిలి బయటకెళ్లారు. నాకూ బద్ధకంగా వుండి ఆగిపోయాన్లెండి. సరిగ్గా అచ్చు ఇదే టైమ్‌కి ఇట్లాగే వర్షం షట్టుకుంది. అచ్చు ఇట్లాగే హఠాత్తుగా పవర్‌కట్టయింది. గదిలో వుండాలంటే భయమన్పించి రిసెప్షన్‌లో కొచ్చి కూర్చున్నా. ఇంతలో అచ్చు మీకులాగే ఓ వ్యక్తి నా పక్కనే వచ్చి కూర్చున్నాడు. "హెలో మిస్... కంపెనీ కావాలా?" అన్నాడు. "ఐయామ్ మిసెస్ మధుకర్. మీ కంపెనీ అవసరంలేదు" అన్నాను. వదలడే జిడ్డు వెధవ. 'తోచడం లేదు మిసెస్ మధుకర్. ఏమైనా మాట్లాడండి' అన్నాడు. 'మీతో నేనేం మాట్లాడగలను!' అన్నాను. మీరు నమ్ముతారో నమ్మరోగాని ఇప్పుడు అచ్చు మీరడిగినట్టే 'మీ కాలేజ్‌డేస్ గురించో మేరేజ్ లైఫ్ గురించో చెప్పొచ్చుగా' అన్నాడు. ఇక మండింది చూడండి నాకూ... "లేరా లఫూట్" అన్నాను. లిటరల్లీ... ఆ ఇడియట్ చొక్కా పట్టుకుని పైకి లేపాను. కుడికాలి చెప్పు తీసి... వాయించాను. చూడండీ వాడి చెంపలూ. పవరెప్పుడొచ్చిందో... మా ఆయనెప్పుడొచ్చారో ఏమీ గమనించలేదు నేను. మా ఆయన్తోపాటూ హోటల్ మేనేజరూ... రిసెప్షనిస్టూ కూడా పట్టుకుని ఆపితేగాని నేను ఆగలేదు" చెప్పటం ఆపి అతని రియాక్షన్ కోసం చూశాన్నేను.

హఠాత్తుగా లైట్లు వెలిగాయి. ఆ వెలుగులో భాస్కర్రావ్ ముఖం చింతాకంతయి పోవడం ముచ్చటగా చూశాన్నేను.

"అరె కరెంట్ కూడా ఆ రోజు అచ్చు ఇలాగే వచ్చిందే" నాలో నేను అనుకున్నట్టుగా "మీరే చెప్పండి... ఒక పరాయి ఆడదాన్ని ఓ మగాడు... అట్లాంటి ప్రశ్నలడగొచ్చుంటారా?" ఉడికిస్తూ చూశాను.

అతనేం చెప్పేవాడోకానీ గేటులో బైక్ సౌండ్ అయింది. మా మగమహారాజు వేంచేస్తున్నాడు. అవునూ... మగమహారాజులేంటీ... ఆడమహారాజులుండరుగా" అనుకుంటూ భాస్కరరావువైపు చూశాను.

"వర్షం వెలిసిందండీ... వస్తాను" అంటూ హడావిడిగా వెళ్ళిపోయాడు ఎదురుపోర్షన్ వైపు.

'రెస్టారెంట్లో కొట్టిన దెబ్బకంటే ఇది ఇంకాస్త ఘాటుగా వున్నట్లుంది వెధవ. ఇంక నావైపు కన్నెత్తి చూడడు' అనుకున్నా.

★ ★ ★

"హెలో మిస్టర్ రాధాకృష్ణా?" అన్నాను.

"రాధాకృష్ణనే. ఎవరు మీరు?" అన్నాడు.

"మీ మిసెస్ ప్రియగారు... కళ్లు తిరిగి పడిపోతే... ఇక్కడకు దగ్గర్లో వున్న క్లినిక్‌లో అడ్మిట్‌చేశాం. మీరు అర్జంటుగా రండి"

"ప్రియకేమైంది" అన్నాడు.

"ఏమో! జస్ట్...ఇప్పుడే ఆఫీస్ అవర్స్ తరువాత అందరం బయటకు వస్తున్నాం. ఉన్నట్టుండి పడిపోయింది. ప్లీజ్ వెంటనే బయలుదేరండి"

"హాస్పిటల్ అడ్రస్ చెప్పండి" అన్నాడు.

"డాక్టర్ పురుషోత్తమ్... హైటెక్నాలజీ డిస్పెన్సరీ... బ్లూ హెవెన్స్ అపార్ట్‌మెంట్... గ్రౌండ్‌ఫ్లోర్" అన్నాను.

"ఇప్పుడే వస్తున్నా... అన్నట్టు మీరు" అన్నాడు.

"ఐయామ్ విజయ. మీ మిసెస్ కొలీగ్‌ని" చెప్పి రిసీవర్ క్రెడిల్‌చేశాను.

నేనూ, ప్రియా, మా హనుమాయమ్మ పిన్నీ... డాక్టర్ పురుషోత్తంగారి కన్సల్టింగ్ రూమ్‌లో వున్నాం. అందరం ఆత్రంగా అతనికోసం ఎదురుచూస్తున్నాం. ఈ ప్లాన్ చెప్పింది మా పిన్నే. డాక్టర్‌గార్ని కన్‌విన్స్

# ఏరిన ముత్యాలు

- కారులో కూర్చుని, కిటికీలోనుంచి చూస్తే వ్యవసాయం చేయడం చాలా తేలికగానే కనిపిస్తుంది.

  – కిన్‌హబ్బర్డ్

- కనిపించని వాటిని చూడగలిగినవాడే ద్రష్ట.

  – జోనాతన్‌స్విఫ్ట్

- మనిషి తానొక పులిని వేటాడి చంపడం గొప్ప క్రీడగా చెప్పుకుంటాడు. అదే ఒక పులి తనను చంపబోతే అది భీభత్సంగా చిత్రిస్తాడు.

  – జార్జిబెర్నార్డ్‌షా

- తాత్కాలిక భద్రత కోసం స్వేచ్ఛను కుదువబెట్టేవారు భద్రతకూ అనర్హులే, స్వేచ్ఛకూ అనర్హులే.

  – లింకన్

- ఎటువంటి ప్రజ్ఞా లేనివాడి ముఖ్యలక్షణం ప్రతి విషయాన్నీ ఖండించడం.

  – లారోష్‌షోకాల్డు

- పురుషునికి అన్నిసంపదలను మించిన సంపదలు మంచి భార్య, చక్కని ఆరోగ్యం.

  – థామస్ ఫుల్లర్

- క్షమించడం ఉత్తమం, మరచిపోవడం ఉత్తమోత్తమం.

  – బ్రౌనింగ్

- ఇతరులకు నీవు స్వేచ్ఛ ఇవ్వకపోతే నీకు కూడా స్వేచ్ఛ లభించదు.

  – ఫ్రాంక్లిన్

- వినయ సంపన్నుడు తనను గురించి తాను ఎప్పుడూ మాట్లాడడు.

  – లాబ్రియెల్

- మనిషి గొప్పతనానికి గీటురాయి అతని వినమ్రతే.

  – జాన్‌రస్కిన్

- నీ స్నేహితులను రహస్యంగా మందలించు, బాహాటంగా ప్రశంసించు.

  – సైరస్

- సమయపాలనే మనిషి సౌశీల్యానికి ఒక మచ్చుతునక.

  – లూయీ చక్రవర్తి

- సంతోషం అనేది సంతృప్తి చెందగల వారికే దక్కుతుంది.

  – అరిస్టాటిల్

సేకరణ: దాసరి వెంకటరమణారావు

చేసుకుని... ప్లాన్ అమలుచేశాం.

ఆసరికే ప్రియ... ఆపరేషన్‌కి తన అంగీకారాన్ని తెలుపుతూ ఫారాలమీద సంతకం చేసేసింది. చేస్తూ అచ్చు అప్పుడు మా పిన్ని అడిగినట్టే అడిగింది "నేనిట్లా ఆయనకి తెలీకుండా ఆపరేషన్ చేయిస్తున్నా. రేపు నన్నాయన నిలదీస్తే? "

డాక్టర్ పురుషోత్తం అప్పుడు మా పిన్నికి చెప్పినట్టే చెప్పాడు.

"అప్పటికి అతను నిన్ను నిలదీసే పొజిషన్‌లో వుంటాడా? ఆపరేషన్ తర్వాత నువ్వు వైఫాఫ్ రాధాకృష్ణవి కావు. అతనే హజ్బెండాఫ్ క్రిష్ణప్రియ అయిపోతాడు"

క్రిష్ణప్రియ సంతోషంగా నవ్వింది.

"డాక్టర్! క్రిష్ణప్రియగారి భర్తట. అర్జంటుగా మిమ్మల్ని చూడాలంటున్నారు". నర్స్ కన్సల్టింగ్ రూమ్ తలుపు తెరిచి చెప్పింది.

"సెండ్ హిమ్" అన్నాడు పురుషోత్తమ్.

క్రిష్ణప్రియ... అతి నీరసంగా వున్నట్టుగా ఓ ఎక్స్‌ప్రెషనిచ్చి తల వాల్చేసి కూర్చుంది.

"ప్రియా... ప్లీజ్ కళ్లు తెరువ్... ఎవరొచ్చారో చూడు" అన్నాన్నేను అప్పుడే లోపలకొచ్చిన రాధాకృష్ణనుద్దేశించి.

ప్రియ చూడ్డానికి ప్రయత్నం చేసిందిగాని ఆమె రెప్పలు తిరిగీ వాలిపోయాయి. రాధాకృష్ణ టెన్షన్‌గా డాక్టర్ దగ్గరకొచ్చాడు.

"ఏమైంది డాక్టర్...ఎట్లా వుంది? " అన్నాడు.

"ఆర్యూ మిష్టర్ రాధాకృష్ణా? " అన్నాడు పురుషోత్తం.

"అవునండీ...ఏమైంది మా ప్రియకి? " అన్నాడు.

"యు...సీ... మిష్టర్ రాధాకృష్ణా! ఈవిడ ఈమధ్య స్లీపింగ్ పిల్స్ మింగిందంటున్నారు నిజమేనా? "

అవునన్నట్టూ తలాడించాడు కాస్త ఫీలవుతూ.

"వాటి ప్రభావమే ఇది. చాలా వీక్‌గా వుంది బాడీ. ఆమెకు ఓ వారం రోజులు రెస్ట్ అవసరం"

"అట్లాగే డాక్టర్. ఆఫీస్‌కి సెలవు పెట్టించేస్తాను"

పురుషోత్తమ్ 'డు యిట్' అన్నట్టు అతనికేసి చూసి "మిసెస్ ప్రియా! ఓసారిలా చూడండి" అన్నాడు.

ప్రియ మళ్ళీ ప్రయత్నించిందిగానీ ఆమెకు సాధ్యంకాలేదు.

"వేడివేడి కాఫీ ఏమైనా ఇప్పించమన్నారూ? " అడిగింది మా పిన్ని.

"ష్యూర్" అన్నాడు డాక్టర్. అంటూనే టేబుల్ మీదున్న బజర్ నొక్కాడు. బాయ్ వచ్చి నిలబడ్డాడు.

"వీళ్లని తీసుకెళ్ళి ఓ రూమ్ అలాట్ చేయించు" అన్నాడు.

నావంక తిరిగి "మిసెస్ విజయా... ఇవాళంతా ఈమెనిక్కడే రెస్ట్ తీసుకోనివ్వండి" అన్నాడు.

అందరం మాకు అలాట్ చెయ్యబడ్డ పదహారో నెంబర్ రూంలోకి వెళ్ళాం. రాధాకృష్ణ కాఫీ తెస్తానంటూ బయలుదేరబోయాడు. ఆ మహానుభావుడు కాఫీ తెస్తే ఇక మా ప్లానంతా ఫ్లాపయినట్టే.

వెంటనే మా పిన్ని "నేనాల్రెడీ మనిషిని పంపించాన్నాయనా... ఇట్లాగొచ్చి కూర్చో" అంది.

రాధాకృష్ణ ప్రియ బెడ్ మీదనే అంచున కూర్చున్నాడు.

మా పిన్ని వెళ్ళి రూమ్ బయట నిలబడింది. క్రిష్ణప్రియ కళ్లు మూసుకుని పడుకుని వుంది. రాధాకృష్ణ గోళ్ళవంక చూసుకుంటూ కూర్చున్నాడు. నేనతన్నే గమనిస్తూ వున్నాను.

ఇంతలో మా పిన్ని... ఓ కుర్రాడిచేత కాఫీలు పట్టించుకుని వచ్చింది. ఓ కప్పును అతి జాగ్రత్తగా రాధాకృష్ణకందించింది. అతను దాన్ని ప్రియకు తాగించే ఉద్దేశ్యంతో "ప్రియా...లే" అంటూ ఆమెను తట్టబోయాడు.

"నువ్వు తాగు నాయనా. ప్రియకు మేం తాపిస్తాంగా" అంది మా పిన్ని.

నేను ప్రియను లేపాను నీరసంగా దిండు కానుకుని కూర్చుంది. కప్పు ఆమె నోటిదగ్గర పెట్టాను. మెల్లగా సిప్ చేస్తోందామె.

రాధాకృష్ణ కాఫీ తాగుతున్నాడు. మా పిన్ని తను తాగుతూనే అతన్ని గమనిస్తోంది. అతను కాఫీ తాగి కప్పుకింద పెట్టగానే... అందులోకి తొంగిచూసి అందులో ఒక్కచుక్క... కాఫీ కూడా అతను వదల్లేదని తెలుసుకున్నాక తృప్తిగా నిట్టూర్చింది.

"ఓ మాటడుగుతాన్నాయనా! నువ్వు మొన్న తాళికట్టబోయిన అమ్మాయి ప్రియ కంటె బాగుంటుందా? " అనడిగింది.

రాధాకృష్ణ సిగ్గుగా తలవంచుకున్నాడు.

"దాన్దేముందిలే. అందం, ఆకర్షణ అట్టాంటివి. అట్లా సిగ్గుపడమాక... మా ఇంటి దగ్గర్లో ఓ అబ్బాయి మొన్నెప్పుడో ప్రియని చూశాట్ట. ఆ అమ్మాయి అడ్రస్ చెప్పమ్మా. మెళ్లో తాళి కడతాను అంటున్నాడు. నిజం చెప్పొద్దూ. వాడు నీకంటే అందంగుంటాడు"

రాధాకృష్ణకు మా పిన్ని చెప్పేది చెవికి ఎక్కుతున్నట్టుగా లేదు. మత్తుగా తూలుతున్నాడు.

"ఇక వూరుకో పిన్నీ. అయ్యగారి పని అయిపోయినట్టుంది" అన్నాను.

రాధాకృష్ణ చూస్తుండగానే మంచంమీదకు ఒరిగిపోయాడు. ప్రియ చటుక్కున లేచి కూర్చుంది.

ఇంతలో డాక్టర్ పురుషోత్తం వచ్చాడు.

"ఎవ్రీథింగ్ ఓ. కె? " అన్నాడు.

"ఓ. కె. డాక్టర్" అన్నాను.

క్షణాల్లో రాధాకృష్ణను... ఆపరేషన్ థియేటర్లోకి తీసుకెళ్లడం... ఆపరేషన్ మొదలవడం జరిగిపోయింది.

"మా ఆయనలాంటి మగాళ్లందరికీ ఇట్లా ఆపరేషన్ చేసి పారేస్తేనా... సమాజమే మారిపోతుంది" అంది ప్రియ.

కనీసం నూటికి యాభైమందైనా ఇలాంటి మగాళ్ళుంటారు. ఈ విధంగా ఒక్కో వ్యక్తిని ట్రాప్ చేసి ఆపరేషన్ చేస్తూ పోతుంటే, ఎన్నాళ్ళకి మారుతుందీ సమాజం. ఒక శతాబ్దంపైనే పడుతుందేమో.

నాకెక్కడో అసంతృప్తిగా వుంది.

కేన్సర్‌కన్నా, ఎయిడ్స్‌కన్నా అతి భయంకరమైన రోగం ఈ చెడు ప్రవర్తన అనేది. కానీ ఈ రోగాన్ని అవలీలగా క్యూర్ చేయగల వ్యక్తి అందుబాటులో వుండి కూడా ఆయన సేవల్ని ఎక్కువమంది ఉపయోగించుకోలేకపోతున్నారు. అసలెవరికి తెలుసు ఈ ఆపరేషన్ వివరాలు? నాలా అతి కొద్దిమందికి తప్ప.

ఇలాకాదు, ఏదో చెయ్యాలి మగాళ్ళ మూలంగా నరకాన్ని చవిచూస్తున్న స్త్రీలకు విముక్తి కలిగించాలి.

పురుషోత్తంగారితో ఈ విషయంమీద ఓరోజు డిస్కస్ చెయ్యాలనుకున్నాను.

★ ★ ★

శ్యామలగౌరి నావంక ఒక్క చూపుచూసి అదోలా నవ్వింది, "మీ ఆయన గురించి బేడ్‌గా చెప్పాననేగా, మా ఆయనమీద నిందలేస్తున్నావ్" అంది.

హతాశులవడం, కొయ్యబారిపోవడం, ఎవరి చెవులను వాళ్ళే నమ్మలేకపోవడంలాంటివన్నీ నాకు అనుభవంలోకొచ్చిన క్షణమది.

"నువ్వేనా ఇలా మాట్లాడుతున్నది? " అన్నాను.

"ఏం మాట్లాడకూడదా? " అంది.

"శ్యామలా!" అన్నాను.

"నీ భర్త అలాంటివాడన్న ఆత్మన్యూనతా భావం నిన్నిట్లా మార్చేసింది. ఎదుటివాళ్ళమీద లేనిపోని అభాండాలు వేసేబదులు ముందు మీ ఆయన్ని మార్చుకోవడానికి ప్రయత్నించు" అని చెప్పి విసవిసా ఇంట్లోకెళ్ళిపోయింది.

శ్యామల నిన్ననే దిగింది వూర్నుండి.

రాత్రంతా వాళ్ళాయన విషయం దానికి చెప్పాలా వద్దా అని తెగ ఆలోచించాను. మా ఆయన గురించి నాకది అంత నిష్కల్మషంగా చెప్పి నన్ను అలర్ట్ చేసినప్పుడు నేను మాత్రం వాళ్ళాయన వేషాల్ని దాచి పెట్టి దాన్ని మోసం చేయడం అన్యాయం అన్పించింది. అలా దాస్తే అది స్నేహమే కాదని కూడా అనిపించింది.

ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందా అని ఎదురుచూసి విషయం దాని చెవినేశాను. అదేమో నా చెవిలో యాసిడ్ పోసినట్టే మాట్లాడుతోంది. ఇన్నాళ్ళ స్నేహంలో శ్యామలెప్పుడూ ఇలా ప్రవర్తించ లేదు. నాలో కోపంకన్నా ఆశ్చర్యం ఎక్కువైంది. నాలో ఒకటే ఆలోచన, "శ్యామల శ్యామలేనా?" అని.

అది నాతో మాట్లాడ్డమే మానేసింది. ఎదురుపడ్డా ముఖం తిప్పుకుని పోతోంది. వాతావరణం చాలా అబ్‌నార్మల్‌గా వుంది. అయితే ఒక్కటిమాత్రం అతి మామూలుగా, సజావుగా సాగిపోతోంది. మా ఆయన దాన్ని దేబిరించుకుని చూడ్డం, వాళ్ళాయన నన్ను చొంగ కార్చుకుంటూ చూడ్డం.

ఆ రోజు ఆదివారం. రోజూలాగే ఆరుగంటలకే మెలకువ వచ్చేసింది నాకు. మామూలుగా ఆదివారమే కదా అని కాసేపటూ ఇటూ దొర్లేదాన్ని. ఇవాళెందుకో పడుకో బుద్ధికాలేదు. లేచి తలుపుతీసి గుమ్మంలో పడున్న పాల ప్యాకెట్ అందుకుంటూ శ్యామలగౌరి పోర్షన్‌కేసి చూశాను. అదప్పటికే పెళ్ళికూతురిలా తయారై వుంది. ప్లాస్టిక్ బుట్టలో ఏవేవో సర్దుకుని గుమ్మంలో కొచ్చింది.

"వాటర్ బాటిల్స్ తీసుకున్నావా?" అంటూ భాస్కరరావు కూడా బయటకొచ్చాడు.

మొత్తానికి ఏదో ప్రోగ్రామ్ అని అనుకున్నాను. నేను చూస్తూనే వున్నా. శ్యామల కనీసం నా వంకైనా చూడకుండా భర్త వెనకాల కూర్చుంది. క్షణాల్లో బైక్ స్టార్టయ్యింది.

అప్రయత్నంగా నా కళ్ళలో నీళ్ళు చిప్పిల్లాయి.

శ్యామలగౌరి నా చిన్ననాటి నేస్తం, నాతో



చెప్పకుండా వేసుకున్న మొదటి ప్రోగ్రాం ఇదే.

అన్యమనస్కంగా ఇంట్లోకి నడిచాను. అవమానంతో ఉడికిపోతున్న మనసు శరీరాన్ని కూడా కాల్చేస్తున్న భావన. పాల ప్యాకెట్ పక్కన పడేసి స్నానానికి వెళ్ళాను. చల్లటినీళ్ళు ఒంటిమీద పడ్డాక కొంచెం శాంతించాను.

కాఫీ కలుపుతుంటే ఉన్నట్టుండి క్రిష్ణప్రియ, ఆమె భర్తా గుర్తుకొచ్చారు. వెళ్ళి చూడాలన్పించింది. కప్పులో కాఫీ పోసుకుని బెడ్‌రూమ్‌లోకెళ్తే ఆయనక్కడ లేరు.

ఇదివరకు ఆదివారం వస్తే చాలు ఉదయం పది దాటితే తప్ప పక్కమీంచి లేవని మా ఆయన ఈమధ్య నాతోపాటూ లేవటమేకాదు, ఒక్కోసారి నాకంటే ముందే లేచేస్తున్నాడు.

కారణం... అది ఏ వారమైనా సరే... శ్యామలగౌరి చీకటితో లేచేసి గుమ్మంలో ముత్యాలముగ్గులో సంగీతలా రంగవల్లులు దిద్దుతూ దర్శనమిస్తుంది.

కప్పు పట్టుకుని వరండాలోకెళ్ళాను.

శ్యామలగౌరి ఇంటిగుమ్మానికి నిరాశగా వేళ్ళాడుతున్నాయి మా ఆయన చూపులు.

"వాళ్ళు లేరు" చెప్పాను.

మా ఆయన చప్పున నావైపు చూశాడు. దిగాలుగా వున్న ఆయన ముఖం చూస్తుంటే సంతోషంగా అన్పించింది నాకు.

"ఎక్కడికెళ్ళారు? " కప్పు అందుకుంటూ అడిగాడు.

"ఇంకో గంటాగితే... ఈ వీధిలోకి చిలక జోస్యం చెప్పేవాడొస్తాడు. అడిగి తెలుసు కోండి" అన్నాను.

ఆయన ముఖం మాడిపోయింది. నాలోని బాధ మాయమై తేలికైనట్టు అన్పించింది. చకచకా... గంటంటే గంటలో వంట పూర్తిచేసి "నేను మా కొలీగ్ ఇంటికెళ్తున్నా. మీరు భోంచెయ్యండి" అని చెప్పి చెప్పులేసుకున్నాను.

"ఇప్పుడెందుకూ? " అన్నాడు చిరాగ్గా.

"వాళ్ళ వీధిలోకి మొన్నామధ్య ఓ మగ కోతి వచ్చిందట. చెట్టుకొమ్మలమీదో, గోడల మీదో కూర్చుని పెరట్లో పన్చేసుకునే ఆడాళ్ళని చూస్తూ పళ్ళికిలిస్తోందట. దాదాపు మా స్టాఫంతా వెళ్ళి చూసొచ్చారు దాన్ని. నేనూ చూసొద్దామనీ..." అన్నాను సాగదీస్తూ.

"సర్లె... త్వరగా రా" అన్నాడు.

నేను ఆటోలో క్రిష్ణప్రియ ఇంటికి వెళ్ళేసరికి వాళ్ళాయనా, తనూ టీవీ వాచ్ చేస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

నన్ను చూడగానే క్రిష్ణప్రియ ఆనందంగా ఎదురొచ్చింది. గుమ్మంలో నన్ను రిసీవ్ చేసుకున్నాక వెనక్కి తిరిగి "ఏమండీ... మా కొలీగ్ విజయ" అంది.

నేను 'నమస్తే' అందామనుకుని అటు చూశాను. అక్కడెవరూ లేరు. ఖాళీ కుర్చీ తప్ప.

క్రిష్ణప్రియ ఒక్కసారిగా నిట్టూర్చింది. అంతలోనే ఆమె ముఖంనిండా వెలుగు. "నిన్ను చూసి లోపలికెళ్ళిపోయాడు" అంది గుసగుసగా.

"ఎందుకూ? " అన్నాను ఆశ్చర్యంగా.

"ముందు కూర్చో చెప్తాను" అంది.

నేను కూర్చున్నాక ఓ గ్లాసునిండా కూల్ వాటర్ ఆఫర్ చేసి అంది, "ఆడవాళ్ళు కనబడితే చాలు. ఆమడదూరం పరుగెడుతున్నారు"

"ఏంటీ, ఆడపురుగును చూసినా అష్టవంకర్లు పోయే మీ ఆయన!"

"ఆ... ఆయనే. ఇదో కొత్త దిగులైందనుకో నాకు. చివరికి వాళ్ళమ్మతో, చెల్లితో కూడా తల వంచుకునే మాట్లాడుతున్నాడు" అంది.

క్రిష్ణప్రియ మాటవరసకి దిగులన్నదిగానీ ఆమె కళ్ళు సంతోషంతో మిలమిలమంటున్నాయి.

"కనీసం నీవంకైనా చూస్తున్నాడా? " ఆరాగా అడిగాను.

అందంగా సిగ్గుపడింది క్రిష్ణప్రియ. "ఇరవై నాలుగ్గంటలూ నా కళ్ళలోకే"

"కొయ్యకు... ఆఫీస్‌లో ఏడుగంటలు, నిద్రకు సుమారు ఆరుగంటలూ... స్నానం, గీనంలాంటి మిస్‌లీనియస్ వర్క్ ఓ గంటా, ఆ...ఏడూ ఆరూ పదమూడూ పదమూడూ ఒకటీ పద్నాలుగూ, మొత్తం ఇరవై నాలుగ్గంటల్లోంచీ పద్నాలుగు గంటలు తీసేస్తే పది. ఎలా చూసినా పది గంటలేనమ్మా మీ ఆయన నీ కళ్ళలో కళ్ళుపెట్టి చూసేదీ" అన్నాను.

క్రిష్ణప్రియ కిలకిలా నవ్వేసింది.

"మొత్తానికి డాక్టర్‌గారు మీ ఆయన బుర్రె లోకి మహా పవర్‌ఫుల్ చిప్‌నే పంపినట్టు న్నాడే" అంటూ నవ్వేసి "మరీ అంతొద్దులే. ఓసారిలా పిలువ్ మీ ఆయన్ని" అన్నాను.

క్రిష్ణప్రియ రెండు మూడుసార్లు "ఏవండీ, ఏవండీ" అని పిలిచినా పలకలేదా మాన వుడు.

ఇక లాభంలేదని లోపలి గదిలోకెళ్ళింది.

ఎంతసేపటికీ ఇద్దరూ బయటకు రాకపో యేసరికి మెల్లగా లేచి హాల్‌కీ, వాళ్ళున్న గదికీ మధ్యనున్న కిటికీ కర్టెన్ తొలగించి చూశాను. క్రిష్ణప్రియ అతని గడ్డం పట్టుకుని బతిమాలుతోంది. అతను ససేమిరా అంటు న్నాడు. ఈమేదో గారంగా బెదిరిస్తోంది. ఆయనేదో మారాం చేస్తున్నట్టు తల అడ్డంగా తిప్పుతున్నాడు.

ఓ అయిదు నిమిషాల అనంతరం ఇద్దరూ కాంప్రమైజ్ అయినట్టుగా అన్పిం చింది. ఇద్దరూ బయటకు వస్తారేమో బాబూ అనుకుంటూ గప్‌చిప్‌గా నా ప్లేస్‌లో కొచ్చి కూర్చున్నా.

ముందు క్రిష్ణప్రియా ఆ వెనుక రాధాక్రిష్ణా వచ్చారు.

ఆరోజు క్రిష్ణప్రియ ఆత్మహత్యా ప్రయత్నం చేసినరోజున హాస్పిటల్లో చూసిన ఆ రాధాక్రిష్ణకీ ఇవాళ తల కాదు కదా కనీసం కనురెప్పలు కూడా ఎత్తకుండా వచ్చి నాముందు నిలబడ్డ రాధాక్రిష్ణకీ ఎక్కడా మచ్చుకైనా పోలికేలేదు. వచ్చి నిలబడ్డాడేగానీ నోరు మెదపడానికి ఇబ్బంది పడుతున్నాడు.

"చూడండీ... ఆడవాళ్ళను నీచదృష్టితో చూడ్డం ఎంత నేరమో... వాళ్ళను చూస్తేనే మైలపడిపోతామనుకోవడం కూడా అంతే నేరం. మనసులో కల్మషం లేనప్పుడు ఎవ రినైనా చూడొచ్చు. ఎంతయినా మాట్లా డొచ్చు. ఇట్ మేక్స్ నో డిఫరెన్స్" అన్నాను.

అలా ఎలా చెప్పానో నాకే తెలీదు. అతన్నీ, అతని పరిస్థితినీ చూస్తూ అసంకల్పి తంగా అనేశానా మాటలు.

★ ★ ★

"ఆ... వాడికి నేన్నచ్చానట" అంటోంది స్త్రీ స్వరం నిర్లక్ష్యంగా. ఆ స్వరం సీతది.

"ఆహా... అయితే లేపుకుపోతాడేమో కనుక్కోవే. శని విరగడవుతుంది నాకు" అంటున్నాడు వాళ్ళాయన.

"అదేదో మీరే కనుక్కుందురూ..." అంది.

"కనుక్కుంటానే ముందు నీ మక్కెలు విరిచేసి ఆనక కనుక్కుంటా" అన్నాడు.

"మక్కెలు విరగ్గొడితే... వాడు నన్నేం చేసుకుంటాడు? "

బాప్‌రే... వీళ్ళు భార్యాభర్తలా?

"నువ్వాడదానివి కావే"

"నువ్వు మాత్రం మగాడివని ఎవరన్నారు"

త్వరలో డాక్టర్ పురుషోత్తమ్‌గారి మైక్రోచి ప్‌తో మళ్ళీ అవసరం పడబోతున్నదన్న మాట.

సీతని కలవటానికిది టైం కాదని సత్య వాణి ఇంటికి బయలుదేరాను. అయితే దారంతా నాకొకటే ఆలోచన. మైక్రోచిప్ సీత బుర్రలో అమర్చాలా, వాళ్ళాయన బుర్రెలో అమర్చాలా, సత్యవాణి ఇల్లు చేరే లోగా నా ఆలోచన ఓ కొలిక్కి వచ్చింది.

అతను రెచ్చగొట్టబట్టేగా సీత రెచ్చిపో యింది. సో... మైక్రోచిప్ అమర్చాల్సింది వాళ్ళాయనకే. మెదడు లోపాలతో బాధప డేది ఎటొచ్చీ... ఎక్కువగా మగాళ్ళే అను కుంటూ సత్యవాణి ఇంటితలుపు తట్టాను.

★ ★ ★

జూలై 29... "అబ్బ ఎంత క్యూట్‌గా వుందో శ్యామల ఫ్రెండ్. నిజంగా మధుకర్ అదృష్టవంతుడు. అతన్ని చూస్తుంటే ఈర్ష్యగా వుంది నాకు"

డైరీలోంచి చివుక్కున తలెత్తి చూశాను.

"సారీ..." అంది శ్యామల.

డైరీ మరో పేజీ తిప్పాను.

ఆగస్టు 1... "ఈరోజు నా జీవితంలో మరపురాని రోజు. మొదటిసారిగా విజయ చేతి కాఫీ తాగాను. దట్టూ... ఆమె ఎంగిలి చేసిన కాఫీ. నేనూ, శ్యామలా, విజయా, మధుకర్... టెర్రస్ మీద కూర్చుని వున్నాం. విజయ్ కిందికెళ్ళి నాలుగు కప్పుల్లో కాఫీ పట్టుకొచ్చింది. అందరికీ తలో కప్పూ ఆఫర్ చేసింది. తనూ తీసుకుంది. ఓసారి సిప్‌చేసి... పంచదార తక్కువైం దంటూ కప్పు అక్కడ పెట్టేసి పంచదార తెస్తానంటూ కిందకెళ్ళింది. నాకేమైందో తెలీదు మెల్లగా నా కప్పును ఎవరూ గమనించకుండా కింద పెట్టేసి విజయ ఎంగిలిచేసిన కాఫీకప్పు నేను తీసుకున్నాను. ఈలోపు ఆమె పంచదార పట్టుకొచ్చి అందరికీ వేసింది. నాకు వెయ్యబోతే వద్దన్నాను. నా కాఫీలో స్వీటెక్కువైంది అన్నాను పైకి. మనసులో మాత్రం 'నీ అధరాల మధురాలు అంటిన కాఫీ కదా ఇది' అనుకున్నాను.

డైరీలోంచి చివుక్కున తలెత్తి శ్యామలగౌరి కేసి చూశాను.

"సో... సారీ" అందది నావంక బేలగా చూస్తూ.

"సారీ సంగతలా వుంచు. అప్పుడు తాగిన కాఫీ నాకిప్పుడు వాంతయ్యేలా వుంది" అన్నాను.

మళ్ళీ "వెరీసారీ" అందది.

దాని 'సారీ'ని పట్టించుకోకుండా అన్నాను.

"నేను కిందకెళ్ళినప్పుడు మీ ఆయన కప్పులు మార్చాడు కదా. అతని కప్పులో కాఫీ ఎంగిలిచేశాకే మార్చాడా... ఎంగిలి చెయ్యకుండా మార్చాడా? "

"చేసే వుంటాడేమో" అంది.

నాకు తెలీకుండానే "ఓక్" అన్నాను.

"అబ్బెబ్బే... చేసి వుండడులే" అందది మళ్ళీ.

ఆ మాటతో కాస్త సర్దుకుని ఇంకో పేజీ తిప్పాను.

ఆగస్టు 24... "ఇవాళ సీ షోర్‌లో జరిగిన సంఘటన నా జీవితాంతం గుర్తుండిపోతుంది. మధుకర్... సముద్రంలో ఈత కొట్టికొట్టీ అలసిపోయి ఒడ్డున కూర్చున్నాడు. శ్యామల అంతకుముందే ఒడ్డున సెటిలై తడిసిన చీరెని సముద్రపు గాలికి ఆరబెట్టుకుంటోంది. నీళ్ళలో నేనూ, విజయా వున్నాం. ఇద్దరిమధ్యా... ఓ ఇరవై గజాలదూరం వుంది. శ్యామల రమ్మని పిలుస్తున్నా విజయ నీళ్ళతో ఆడుతూనే వుంది. నేను నెమ్మదిగా ఇరవైగజాల దూరాన్ని ఓ గజం మేరకు కుదించాను. 'మా శ్యామల వేస్టండీ... మీ స్టామినా తనకిలేదు' అంటూ మాటల్లో పెట్టాను. ఉన్నట్టుండి ఓ అల నన్ను బలంగా తాకింది. నిలదొక్కుకోగలిగి వుండి కూడా కావాలని నీళ్ళలో పడిపోయాను. విజయ 'అయ్యయ్యో' అంటూ తన చేతిని చాపింది. అపురూపంగా అందుకున్నానామె చేతిని. అలాగే వుండిపోవాలన్పించింది. పరవశంగా కళ్ళు మూసుకున్నాను. ఆమె "లేవండి ఇంకో అలొస్తోంది" అంటూ కేకలు పెడుతోంది. లేవక తప్పలేదు. అయితే లేచాక్కూడా నేనామె చేతిని వదల్లేదు. నాకేమైనా అవుతుందన్న కంగారులో ఆమె ఆ విషయాన్ని గుర్తించలేదు. ఈలోపు నాకేమో అయ్యిందనుకుని శ్యామలా... మధుకర్ రావడంతో విజయ చేతిని వదలేక వదిలాను"

డైరీలోంచి మళ్ళీ చివుక్కున తలెత్తి చూశాన్నేను.

"ఎక్స్‌ట్రీమ్‌లీ సారీ" అంది శ్యామల.

నా కుడిచేతిని దూరంగా చాపి అడిగాను "ఏదైనా పవర్‌ఫుల్ డిటర్జెంట్ పేరు చెప్పవే"

"ఏరియల్, వీల్, సర్ఫ్ ఎక్సెల్, రిన్..." అంటూ ప్రశ్నార్థకంగా చూసిందది.

నేను అడ్డంగా తల ఊపాను.

"ట్రిపుల్ ఎక్స్ డిటర్జెంట్? " గొప్పగా

చూసిందది సాహసం చేయరా డింభకాలో ఉదయభానుని తల్చుకుంటూ.

"అవేం కాదు. కాస్టిక్ సోడాలో వుడకబెడ తాను" చెప్పాను.

"దట్స్ గుడ్" అందది హేపీగా.

డైరీలో ఇంకో పేజీలో తల దూర్చాను.

సెప్టెంబరు...4

స్పెషల్ డిష్ అంటూ ఏదో స్వీట్ పుడ్డింగ్ తెచ్చింది విజయ. శ్యామల స్నానం చేస్తోంది. నేనే తీసుకున్నా.

"మొత్తం మీరే తినకండి. మా శ్యామల క్కూడా పెట్టండి" అంటూ జోక్ చేసి వెళ్ళింది విజయ. నా విజయ చేతులతో చేసిన స్వీట్ ఇంకొకరికి భాగం పెడతానా? శ్యామల స్నానంచేసి వచ్చేలోగా మొత్తం తినేశాను. చివరకి బౌల్ కడిగిన నీళ్ళు కూడా తాగేశాను"

"ఛీ... దరిద్రుడు" అన్నాను చివుక్కున తలెత్తి శ్యామల వంక చూసి,

"టెరిబ్లీ సారీ" అందది.

దానివంక జాలిగా చూసి "డోంట్ వర్రీ. ఇంకోసారి చేసి పెడతాలే" అన్నాను.

ఇంకో పేజీ...

విజయ నవ్వితే మణిశర్మ సంగీతంగా వుంటుంది. విజయను చూస్తే నా శరీ రంలో ర్యాంప్ షో... జరిగిపోతుంది. విజ్జీ మాట్లాడితే... నమ్రతాబారువా యాంక రింగ్‌లా వుంటుంది. విజ్జీ నడిస్తే... డిస్కో థెక్‌లో రెయిన్ డ్యాన్స్‌లా వుంటుంది"

నేను మళ్ళీ చివుక్కున తలెత్తి అన్నాను. "విజ్జీ కోప్పడితే గుజరాత్ భూకంపంలా వుంటుంది. ఖబడ్దార్"

"ఆఫుల్లీ సారీ" అంది శ్యామల.

ఎక్కడో దూరంనుండి వినబడుతోంది తరుణ్ పాట "ఐ యామ్ వెరీ సారీ... అన్నానుగా వందోసారి. సరదాగా నవ్వే సెయ్ ఓసారి"

ఒక్కసారిగా నవ్వొచ్చింది నాకు. పగల బడి నవ్వేశాను. ఓ రెండు నిమిషాలదాకా అలా నవ్వుతూనే వున్నాను.

నా నవ్వుల మధ్యలో వున్నట్టుండి వినబ డింది. ఎవరో వెక్కివెక్కి పడుతున్న ధ్వని.

శ్యామల రెండు మోకాళ్ళమధ్య తల దూర్చి ఏడుస్తోంది. దుఃఖతీవ్రతకు దాని భుజాలు ఎగిరెగిరి పడుతున్నాయ్.

నాకర్థమైంది దాని వేదన. తన భర్త గురించి చెడుగా...ప్రాణ స్నేహితురాలు చెప్పినా నమ్మలేదు. అంత గుడ్డిగా నమ్మిం దది అతన్ని. అనుకోకుండా చదివిన అతని డైరీ... వటవృక్షంలాంటి దాని నమ్మకాన్ని ఒక్కసారిగా నేలకూల్చింది.

తట్టుకోవడం కష్టమే మరి.

"శ్యామూ!" మార్దవంగా ఆమె తల నిమి రాను.

ఇంకా కుమిలి కుమిలి ఏడ్చింది. శ్యామల నాలాకాదు. చిన్న విషయానికే తల్లడిల్లిపో తుంది. ఇది చిన్నాచితకా వ్యవహారం కాదుగా. నాతిచరామీ... అంటూ చేయిప ట్టుకుని ఏడడుగులూ నడిచి...నా జీవి తంలో సగభాగం నీదే అంటూ ఒట్టేసి చెప్పిన వ్యక్తి, ఇవాళ జీవితాన్ని షేర్లకింద కనబడ్డ ప్రతి ఆడదానికీ అమ్మాలని చూస్తుంటే ఇంకేం చేస్తుందీ భార్య... ఏడ వడం మినహా.

అలా అనుకోవడం నాకెందుకో చిన్నత నంగా అన్పించింది. వెనువెంటనే నా కళ్ళ ముందు ప్రత్యక్షమయ్యారు డాక్టర్ పురు షోత్తం.

"శ్యామలా... ముందా ఏడుపు ఆపెయ్" అన్నాను.

అది కళ్ళు తుడుచుకుంటూ నాకేసి చూసింది.

"డాక్టర్ పురుషోత్తమ్, ఆయన మైక్రోచిప్స్ వుండగా మనకేంటే భయం" అన్నాను.

అప్పుడు చూసింది శ్యామల నన్నో చూపు.

"మెదడులో మైక్రోచిప్స్ అమర్చి...


యంత్ర మానవుడిగా తయారు చేసుకున్న మొగుడితో కాపురం చెయ్యాలా? మనస్సాక్షికి భయపడి మారే వ్యక్తి మనిషిగానీ మైక్రోచిప్ ప్రోగ్రామ్ ప్రకారం నడుచుకుంటే వాడు ఎన్నటికీ మనిషికాడే.

భార్యను ప్రాణంలా ప్రేమించే భర్త కావాలి గానీ... కంప్యూటరైజ్డ్ మొగుడు వద్దేవద్దు నాకు"

శ్యామల సెన్సిటివే కాదు సెన్సిబుల్ కూడా అని ఆ క్షణమే అర్థమైంది నాకు.

"విజయ నవ్వితే... మణిశర్మ సంగీతంలా వుంటుందంటున్నాడు మా ఆయన. అదే నేను... మధుకర్ క్రాఫ్ అచ్చు నాగార్జునదిలా వుంటుందంటే... డైజస్ట్ చేసుకుంటాడా. నీ మొగుడు నాకు వుంగరం కొనిపెట్టినా ఓర్చుకున్నావ్ నువ్వు. అదే నువ్వు నా మొగుడికి షేవింగ్ సెట్టు కొనిపెడితే ఒప్పుకుంటాడా మీ ఆయన?"

శ్యామల అడుగుతుంటే నేను నోటమాట రానట్టు వుండిపోయాను. "భర్త పెడదారి పడుతుంటే... మార్చుకుని మార్గంలో పెట్టు



కోవాలనుకుంటుంది భార్య. అదే భార్య చిన్న తప్పు చేసినా భర్త సహించలేడు. అర క్షణం కూడా ఆలోచించకుండా ఆమెను వది లేస్తాడు. ఈ సమాజం కూడా అంతే. చెడిన ఆడదాన్నయితే చావమని శాసిస్తుంది. ఎక్క డుందీ లోపం? "

అమ్మో శ్యామలా అనుకుంటూ "అది కూడా నువ్వే చెప్పు" అన్నాను.

"కేవలం మనలోనే ఐ మీన్ స్త్రీలోనే" ఆవే శంగా చెప్తోంది.

"అందుకే స్త్రీ ఆలోచనా ధోరణి మారాలి. ఆ మార్పు ఈ సమాజాన్ని మార్చాలి. నా మొగుడు ఫలానా దాన్ని వుంచుకున్నాడు. ఆయన మనసు మార్చి నా దగ్గరకు చేర్చు దేవుడా? అని ఏడ్చే స్త్రీ స్థానంలో 'నా పెళ్ళాం. ఫలానా వాడి మాయలో పడింది. ఆమె మనసు మార్చి నన్ను ప్రేమించేలా చెయ్ భగవంతుడా అని మొత్తుకునే మగాడు ఉద్భవించాలి. ఐ మీన్ చెడిపో యింది స్త్రీ అయినా పురుషుడైనా ఒక్కటే వారిలో మార్పనేది వస్తే ఈ సమాజం ఇద్దర్నీ ఆమోదించాలి. స్త్రీకీ పురుషుడికీ ఒకటే న్యాయం కావాలి"

"ప్రస్తుతానికి చాలు ఓ కప్పు బూస్ట్ తాగాక కంటిన్యూ చెయ్యి" అన్నాను.

అనటమేకాదు, శ్యామల్ని ఇంట్లోకి తీసు కెళ్ళి ఓ పెద్ద కప్పునిండా చెప్పింది చేసి ఇచ్చాను.

బూస్ట్ తాగాక కొత్త శక్తి పుంజుకుందది.

"అదికాదు విజ్జీ" అంటూ మొదలెట్టబో యింది.

"నేను చేప్పేది విని తరువాత మాట్లాడు శ్యామూ" అన్నాను.

చెప్పమన్నట్టు చూసింది.

"నువ్వు చెప్పిన మార్పు సమాజంలో రావాలని మనసారా కోరుకునే వాళ్ళలో నేను మొదటిదాన్ని. అయితే అది ఓల్డ్ మెథడ్‌లో. సాంప్రదాయసిద్ధంగా రావా లంటే మళ్ళీ వీరేశలింగంలాంటి సోషల్ రిఫార్మర్ పుట్టాలి. ఆయన పాకి... దోగాడి... పెరిగి పెద్దవాడయ్యేసరికి ఎట్ లీస్ట్ పాతికేళ్ళు పడుతుంది. ఇక అప్పటి నుంచీ రిఫార్మేషన్ మొదలెడితే... దానికా యన జీవితకాలం సరిపోనూ వచ్చు.. సరి పోకపోనూ వచ్చు ఆరోజు వచ్చేసరికి ఖచ్చి తంగా శ్యామలా... విజయా... మధుకర్... భాస్కర్రావులనే శాల్తీలుండవు. ఇక్కడ ఇంకో ప్రాబ్లెమ్ కూడా వుంది. అప్పట్లో జనాభా తక్కువ కాబట్టి ఒక్క వీరేశ లింగం... ఒంటిచేత్తో సొసైటీని మార్చడా నికి పూనుకున్నాడు. ఇప్పటి పాప్యులేషన్ ప్రకారమైతే వీధికో వీరేశలింగం చొప్పున వందల, వేల వీరేశలింగాలు కావాలి. అంత మంది వీరేశాల్ని..."

"నా మాటలు నీకంత కామెడీగా వున్నా యన్నమాట" శ్యామల నిష్ఠూరమాడింది.

"అది హర్టయిందని అర్థమైంది నాకు.

"కామెడీ కాదు శ్యామూ... సీరియస్‌గానే అంటున్నా. నువ్వు కోరుకున్న సొసైటీ అతి త్వరలో... మన ముందుండాలంటే... ఆ మార్పుల్ని మనం కళ్లారా చూడగలగాలంటే ఒక్కటే మార్గం. అది డాక్టర్ పురుషోత్తం కనిపెట్టిన మార్గం" అన్నాను.

శ్యామల ఓ క్షణం ఆలోచించి నిట్టూ ర్చింది. "సరే... నీ ఆర్గ్యుమెంట్ నేనొప్పు కుంటాను. బట్... ఏ కాఫీలోనో... కూల్ డ్రింక్‌లోనో మత్తుమందు కలిపి... ఇంత రహస్యంగా నెలకొకటీ... ఏడాదికొకటీ అన్నట్టు చేసే ఈ ఆపరేషన్లు... ఈ సొసై టీని ఎంత త్వరగా మార్చగలవంటావ్? ఈ టైపు రిఫార్మేషను క్కూడా ఈజీగా మళ్ళీ వీరేశలింగం పుట్టి పెరిగినంత టైం పట్టదూ? " అంది.

ఇన్నాళ్లూ... నేను పి.జి. చేశాను. ఎంప్లా యీని... నాది చాలా ఫాస్ట్ కల్చర్ అను కునే నేను... డిగ్రీ డిస్‌కంటిన్యూచేసి, హౌస్ వైఫ్‌గా సెటిలై, నా దృష్టిలో ఆర్ట్ హీరోయి న్‌లా నమోదైన శ్యామల దూరదృష్టికీ...

థాట్ బిల్డింగ్‌కీ ఒకింత ఆశ్చర్యపోయాను.

"తనంతతానుగా తప్పు దిద్దుకోలేని మనిషిని కనీసం తన తప్పు తెలుసుకొనేలా అయినా చెయ్యాలి. ఇక్కడ ఆడా మగా తేడాలేదు. భార్యాభర్తలిద్దరిలో జనరల్ అవేర్‌నెస్ తేవాలి. శారీరకంగా వచ్చే రోగాలకు తమంతట తాముగా ఎట్లా ట్రీట్‌మెంట్ తీసుకుంటున్నారో. అట్లాగే... మనసులో వున్న లోపాలను తమంతట తాముగా మైక్రోచిప్ సాయంతో దూరం చేసుకునే మోరల్ స్టెబిలిటీని వారిలో క్రియేట్ చెయ్యాలి. అప్పుడే విజ్జీ... నువ్వు, నేనూ కోరుకునే రిఫార్మ్‌డ్ సొసైటీ మన కళ్లముందు ఆవిర్భవిస్తుంది.

"ఆ సొసైటీలో... ఏ మగాడూ తన భార్యను తప్ప మరో స్త్రీని ప్రేమించడు. ఏ భార్యా తన భర్తను తప్ప మరొకర్ని ఆరాధించదు. ఒకరికి ఒకరుగా... ఒకరిలో ఒకరుగా బతుకుతారు" శ్యామల చెప్పటం ఆపి నా వంక చూసింది. "విజ్జీ... అటువంటి సొసైటీని మనం చూస్తామంటావా? చూడగలిగితే మాత్రం... కంప్యూటర్ని కనిపెట్టిన మనిషి జన్మ చరితార్థమైనట్టే" అంది.

ఆ రాత్రంతా శ్యామల చెప్పిన దాన్ని గురించి చాలా లోతుగా ఆలోచించాను. తెల్లవారుఝామున నాలుగవుతుండగా నా కళ్లమీదకు నిద్ర కలలా వచ్చేసింది.

"శ్యామలా... ఐ లవ్‌యు శ్యామలా... ఐలవ్‌యు రియల్లీ ఐలవ్‌యూ" హఠాత్తుగా నా చెవుల్లో పడిన ఆ పలవరింత నా నిద్ర తెరలను కత్తిలా చీల్చి చెండాడేసింది.

పవిత్రమైన మంత్రాల నడుమ... మనసా... వాచా... కర్మణా నన్నే కోరుకుంటున్నానంటూ... ఏడడుగులూ కాదు. ఏడేడు జన్మలూ నీతోనే నడుస్తానంటూ పెళ్లినాడు నాకు ప్రమాణాలు చేస్తూ నా మెడలో మూడు ముళ్ళూ వేసిన నా భర్త... ఇవాళ అవన్నీ మర్చిపోయి మెలకువలోనే కాదు నిద్రలో సైతం పరాయి ఆడదాన్ని ప్రేమిస్తున్నాడు.

పక్కకి ఒత్తిగిలి మా ఆయనకేసి చూస్తూ పడుకున్నాను. నా కనుకొలుకుల్లోంచి జారిన కన్నీటిబిందువులు నా గుండెను ఆర్తిగా స్పృశిస్తున్నాయి. నాకు స్వాంతన నివ్వటానికి విఫలయత్నం చేస్తున్నాయి.

దుఃఖంతో అదురుతున్న కింది పెదవిని



ఘునిపంట నొక్కిపెట్టి అప్పటికప్పుడు తీసుకున్నానో నిర్ణయం.

"రేపు ఆఫీసుకు సెలవు పెట్టి డాక్టర్ పురుషోత్తంగారిని కలవాలి"

★ ★ ★

'ఇచ్చట మెదళ్లు మార్చబడును'

రెండు సెంటిమీటర్ల డయామీటర్‌తో అతి లాఘవంగా... న్యూస్‌పేపర్‌కి చేసిన రెండు రంధ్రాల్లోంచీ... ఎదుటి పోర్షన్

గుమ్మంలో ముగ్గులేస్తున్న శ్యామలగౌరిని గుడ్లగూబలా చూస్తున్న మా ఆయన ఉలిక్కిపడ్డాడు.

"ఏంటీ? " అన్నాడు.

"ఇచ్చట మెదళ్లు మార్చబడును" మళ్ళీ చదివాను. పాంఫ్లెట్‌లో బాక్స్ కట్టి రాసిన ఆ ప్రకటనని.

నా చేతిలోంచి... పాంఫ్లెట్ లాక్కొన్నట్టుగా తీసుకున్నాడు.

'ఇచ్చట మెదళ్లు మార్చబడును'

ఇన్ ఇండియా మేరేజ్ ఈజె సెక్రామెంట్... బట్ నాట్ ఎ సివిల్ కాంట్రాక్ట్.

డియర్ కపుల్స్!

మీకు మీ శ్రీమతికన్నా... ఇతర స్త్రీలు అందంగా కనబడుతున్నారా?

మీకు మీ శ్రీవారికన్న ఇతర పురుషులు సమర్థులుగా అన్పిస్తున్నారా?

మీకు మీ శ్రీమతిపై ఎల్లవేళలా మండిపడడం అలవాటైపోయిందా?

మీకు మీ శ్రీవారిని నసపెట్టడం హాబీగా మారిందా?

మీకు మీ శ్రీమతి అంటే ఇష్టం లేదా?

మీకు మీ శ్రీవారంటే లక్ష్యం లేదా?

ఒక ఒరలో ఇమడలేని రెండు కత్తుల్లా... ఒకర్నొకరు మాటలతో చేతలతో పొడుచుకుంటూ మీ మనసుల్ని రక్తసిక్తం చేసుకుంటూ బతికేస్తున్నారా?

అనుక్షణం టీ కప్పులో తుపానుల్ని సృష్టించుకుంటూ ఆ పెనుగాలుల తాకిడికి చెరో దిక్కుగా చెదిరిపోతున్నారా?

అయితే ఇది 'అక్వాయెర్డ్ హేట్రెడ్ మేరేజ్ సింద్రోమ్' అయివుంటుంది. ఓ కేన్సర్ కన్నా... ఎయిడ్స్‌కన్నా... సార్స్ కన్నా ఇది ప్రమాదకరమైంది.

ఎందుకంటే...

శారీరక రుగ్మతలు మనిషిని మట్టుబెడితే... ఈ మానసిక రుగ్మత ఏకంగా కుటుంబాన్నే మట్టుబెడుతుంది. తద్వారా సమాజాన్నే నాశనం చేస్తుంది. వివాహ వ్యవస్థనే సవాలు చేస్తున్న ఈ సింద్రోమ్ నుండి విముక్తి పొందాలన్నా...

మీ వైవాహిక జీవితం పూలపడవలా సాగాలన్నా ది ఓన్లీ రెమెడీ ఈజ్... డాక్టర్ పురుషోత్తమ్స్ హై టెక్నాలజీ క్లినిక్. ఒక్కసారి విచ్చేయండి. మీ బ్లూశాండ్స్‌ని మాకిచ్చి... మా వైట్ శాండ్స్‌ని మీరు పట్టుకుపొండి.

గమనిక: 12-9-2003, ఆదివారం సాయంత్రం ఆరు గంటలకు, హాస్పిటల్ ఆవరణలో దంపతుల అవగాహనా సదస్సు జరుగును.

ఇట్లు

డాక్టర్ పురుషోత్తమ్, న్యూరాలజిస్ట్

అండ్ ఫ్రెండ్స్

సుదీర్ఘమైన ఆ పాంఫ్లెట్‌ని చివరంటా శ్రద్ధగా చదివి అడిగాడు. "పురుషోత్తమ్ అంటే... మీ సత్యనారాయణ బాబాయ్‌కి..."

"ఆс... ఆс... ఆయనే" మధ్యలోనే అందుకుని అన్నాను.

"ఈ పాంఫ్లెట్ ఎక్కడిది? " అన్నాడు.

"మీరు న్యూస్‌పేపర్ చదువుతున్నప్పుడు అందులోంచి జారిపడింది. మీరేమో... పేపర్‌లో రంధ్రాన్వేషణ చేస్తుంటిరి. మీరెక్కడ గమనిస్తారూ" అన్నాను.

గతుక్కుమని "రంధ్రాన్వేషణేంటి? " అన్నాడు.

"అంటే అక్షరమక్షరం చదువుతున్నారన్న మాట" అన్నాను.

'హమ్మయ్య' అని ఊపిరి పీల్చుకున్నవాడు అంతటితో ఆగకుండా "ఈమధ్య న్యూస్ పేపర్లనిండా హోల్సే. ఇంట్లో ఎలుకలున్నాయో ఏంటో" అన్నాడు స్వగతంలా.

"ఇప్పుడేగా బోయ్ పేపర్ వేసింది. ఇంతలోనే చూడండి. దీనిక్కూడా రంధ్రాలే. ఇట్ మీన్స్ ఎలుకలు ఇంట్లో లేవు. ఏజెంట్ షాపులోనే వున్నాయ్" అన్నాను.

న్యూస్‌పేపర్‌కున్న హోల్స్‌ని. అప్పుడే గమనిస్తున్నట్టు నటిస్తూ...

"అవునవును నువ్ చెప్పింది నిజమే" అన్నాడు.

"నేను చెప్పింది అబద్ధంరా మొగుడా. నిజం చెబ్తే నువ్వు గుండాగి చస్తావ్" కసిగా అనుకున్నా.

ఇంతలో శ్యామలా వాళ్ళాయన చేతిలో పాంప్లెట్‌తో హడావుడిగా మా వరండాలో కొచ్చి "ఇచ్చూశారా... మధుగారూ... మెదళ్లు మారుస్తారట. గమ్మత్తుగా వుంది కదూ" అంటూ మా ఆయన ఎదురుగా సెటిలైపోయాడు.

"మెదళ్ళంటూ వుంటేనేగా మారుస్తారు. అసలు మెదడే లేనివాళ్ళనేం చేస్తారో" అంటూ మా ఆయన జోకితే... భాస్కర్రావు పగలబడి నవ్వుతూ నాకేసి చూశాడు.

"ఛీ" అనుకుని వంటింట్లోకి వెళ్ళిపోయాను.

భాస్కర్రావు డైరీ చదవగానే... పురుషోత్తమ్‌గార్ని . కలవాలని నిర్ణయించుకున్న ప్రకారం ఆరోజు తెల్లవారగానే ఆఫీసుకు సెలవు పెట్టేసి... శ్యామలతో కల్సి ఆయన క్లినిక్కి వెళ్ళాను.

ఆరోజు పెద్దగా పేషంట్లు లేరు. ఆఖరి పేషంట్ వెళ్ళేవరకూ వెయిట్‌చేసి ఇద్దరం ఆయన కన్సల్టింగ్ రూమ్‌లో కెళ్ళాం.

"హెలో...మిసెస్ విజయా... కమాన్" అంటూ శ్యామలగౌరికేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"శ్యామలగౌరి నా బెస్ట్‌ఫ్రెండ్" చెప్పాను.

"గ్లాడ్ టు మీట్ యూ... కూర్చోమ్మా" అన్నాడు.

ఆనక నా వంక తిరిగి "ఎనీ ప్రాబ్లెమ్" అన్నాడు.

ఒక్కక్షణం తటపటాయించి శ్యామలకేసి చూశాను.

"ప్లీజ్ కమ్ అవుట్ విజయా" అన్నాడాయన.

గొంతు సవరించుకుని క్రితంరోజు మా ఇద్దరి మధ్య జరిగిన సంభాషణ... పూస గుచ్చినట్టు చెప్పాను. మధ్యమధ్యలో శ్యామల కూడా మాట్లాడింది. మేం చెప్పింది ఆసాంతం విన్న ఆయన కాసేపు గాఢంగా ఆలోచిస్తూ వుండిపోయాడు.

"బికాజాఫ్ దీజ్ ఆపరేషన్స్... నేను లీగల్‌గా కొన్ని ఇబ్బందులు ఎదుర్కోవాల్సివస్తోంది. ప్లీజ్... గో త్రూ యిట్" అంటూ ఓ కవర్‌ని నా ముందుకు తోశాడు.

నేనానక్తిగా కవర్‌మీది సూపర్‌స్క్రిప్షన్ చదివాను. అది ఒక ప్రైవేట్ లాయర్ ద్వారా వచ్చిన లీగల్ నోటీస్.

నేనూ, శ్యామలా దాన్ని చదువుతుంటే ఆయన చెప్పుకుపోతున్నాడు.

"ఓ వారం క్రితం ఈ నోటీస్ ఇచ్చిన వ్యక్తి కొడుక్కి మా క్లినిక్‌లో ఆపరేషన్‌చేసి మైక్రో చిప్ అమర్చాను. అతను మీ కొలీగ్ క్రిష్ణ ప్రియ భర్తలాగే ఉమనైజర్. నా ఆపరేషన్ వల్ల అతనికీ, అతని భార్యకీ జరిగింది మేలే. బట్ అతని భార్యంటే గిట్టని అతని తల్లిదండ్రులు నామీదా అతని భార్యమీదా కేస్ ఫైల్ చేశారు. నేను అతనికి రహస్యంగా ప్రమాదకరమైన ఆపరేషన్ చేశాననీ, దాని క్కారణం అతని భార్య నాతో కుమ్మక్కవడమేననీ అభియోగం మోపారు"

"భార్య అంగీకారంతో భర్తకు ఆపరేషన్ చెయ్యడం ఇల్లీగల్ ఎట్లావుతుంది డాక్టర్" అన్నాను.

"యు ఆర్ కరెక్ట్. కోర్ట్‌లో కేసు నిలవదు గాని మన హాస్పిటల్ ప్రతిష్ట దెబ్బతింటుంది. ఆపరేషన్ ఎయిమ్ జనాల్లోకి బేడ్‌గా ఇంట్రడ్యూస్ అవుతుంది" బాధగా అన్నాడాయన.

"నో డాక్టర్... దీనివల్ల ఆపరేషన్ ఎయిమ్ పదిమందికీ పబ్లిక్ అవుతుంది. మీరింకా ఫేమస్ డాక్టర్ అవుతారు" చెప్పింది శ్యామల.

"వెల్ సెడ్ శ్యామలా. యుఆర్ యాన్ ఆప్టిమిస్ట్. నీ మాటల్తో నాకు కొత్త శక్తి వచ్చింది" అన్నారాయన.

"అందుకే - డాక్టర్! మీరు జనంలోకి వెళ్ళాలి. మీరు చేస్తున్నదెంత గ్రేట్ వర్కో జనానికి తెలియాలి. విలువలుడిగిపోతున్న వివాహ వ్యవస్థకు మీరు టానిక్‌లా మారి దాన్ని ఎనర్జయిజ్ చెయ్యాలి. సమస్యలతో, చికాకులతో కూలిపోతున్న కుటుంబాలను మీ కంప్యూటరైజ్డ్ ఆపరేషన్లతో పునరుద్ధ రించాలి" ఆవేశంగా అన్నాను.

ఆ తర్వాత మా మగ్గురి మధ్యా చోటుచే సుకున్న డిస్కషన్‌కి ఫైనల్ ఫామ్ ఈ పాంఫ్లెట్. ఈ పాంఫ్లెట్‌ని నేనూ, శ్యామలా కల్సి డిజైన్ చేశాం.

కేప్షన్‌గా ముందు 'మైక్రోచిప్ అమర్చు కోండి. మనసు మార్చుకోండి' అంది శ్యామల.

నాకేమంత నచ్చలేదు.

"బిఎ సైబర్గ్ రేదర్ దెన్ టు బిఎ శాడిస్ట్" అన్నాన్నేను.

అది శ్యామలకు నచ్చలేదు.

డాక్టర్ పురుషోత్తంగారు "చింతలు లేని ఫ్యామిలీ... ది సిలికాన్ ఫ్యామిలీ" అన్నాడు.

ఇదేదో సగం తెలుగూ సగం ఇంగ్లీష్‌తో వెరైటీగా వుందనుకున్నాంగాని పూర్తిగా శాటిస్‌ఫ్యాక్షన్ రాలేదు ఎన్నో కేప్షన్స్. మన సులోకి వస్తున్నాయ్ పోతున్నాయ్. ఏదీ నచ్చడంలేదు.

ఆ టైంలో వచ్చింది మా హనుమా యమ్మ పిన్ని మా ఇంటికి బాబాయ్‌ని వెంటబెట్టుకుని. మాటల్లో మా బాబాయ్ అప్పటి ప్రవర్తనని ఇప్పటి ప్రవర్తనని బేరీజు వేసి చెప్తూ. "ఇప్పుడు మీ బాబాయ్ నన్ను పువ్వల్లె చూసుకుంటున్నాడే. సంగీతం క్లాసులకీ, ఇంగ్లీషు క్లాసులకీ నన్ను ఆయనే వదిలిపెడుతున్నాడు. ఒకప్పుడైతే గడపలో నుంచుంటేనే 'భోగందానా ఇంట్లో కెళ్ళవే' అని గదిమే మీ బాబాయ్, ఇవాళ వారానికో సినిమా చూపిస్తున్నారు. ఇదంతా డాక్టర్‌గారి చలవే. ఆయన గనక మీ బాబాయ్ మెదడు మార్చకపోయుంటే ఈపాటికి నేను వంటింట్లోనే మగ్గిపోతూ మగ్గిపోతూ తిట్లు తింటూ జీవచ్ఛవంలా పడుండేదాన్ని" అంది.

చటుక్కున వెలిగింది నా మెదడులో బల్బు.

పిన్ని ఏమందీ... ఆయన గనక మీ బాబాయ్ మెదడు మార్చకపోయుంటే,

మెదడు మార్చకపోయుంటే...

యస్... 'ఇచ్చట మెదళ్ళు మార్చబడును'

మార్వెలస్. చదవగానే గమ్మత్తుగా మన సుకు హత్తుకొనేలా వుంది. "అసలైన జీవి తాన్ని నేనూ ఇప్పుడే అనుభవిస్తున్నా నమ్మా. భార్యను హింసిస్తూ బతకడంలోని కర్కశత్వం కన్నా భార్యను ప్రేమిస్తూ బత కడంలోని మాధుర్యం మనసుకెంతో శాంతి నిస్తుందని నాకర్థమైంది" బాబాయేదో అంటున్నాడుగానీ నా మైండ్ కేప్షన్ చుట్టూ రానే తిరుగుతోంది.

వాళ్ళు వెళ్ళిపోగానే డాక్టర్ పురుషోత్తమ్‌కి ఫోన్‌చేసి కేప్షన్ చెప్పాను.

"ఫెంటాస్టిక్ కేప్షన్. కేప్షన్ చదవగానే పాంఫ్లెట్ ఆసాంతం చదవాలన్న ఆసక్తి కలుగుతుంది" అన్నాడాయన.

అంతే పాంఫ్లెట్ డిజైనింగ్ క్షణాల్లో అయిపోయింది.

కాఫీ పెడుతూ ఆలోచిస్తున్న నన్ను ఈ లోకంలోకి తెచ్చింది మా ఆయన స్వరం.

"ఎట్లాగూ మీటింగ్ సండేనేకదా... అటెం డవుదాం. ఏం చెప్తారో విందాం"

వెంటనే భాస్కర్రావు గొంతు వినబ డింది. "ష్యూర్... అట్లాగే వెళ్దాం" అన్నాడు. వాళ్ళు మాట్లాడుకునేది డాక్టర్ పురుషోత్తంగారి హాస్పిటల్లో కమెన్స్ కాబోయే దంపతుల అవగాహనా సదస్సు గురించే అని అర్థమైంది నాకు.

★ ★ ★

ఎప్పుడో చదువుకునే రోజుల్లో కట్టగట్టి అటకమీద పారేసిన పుస్తకాల గోతాన్ని మా

ఆయనచేత కిందికి దింపించాను. నా సర్టి ఫికెట్స్‌నే కాదు పాత పుస్తకాల్ని కూడా అతి భద్రంగా దాచుకోవడం నా నైజం.

గోతం మూతికి కట్టిన పురికొస విప్పి పుస్తకాల్ని బయటకు తీశాను. పుస్తకాల నిండా వాటిని తినేసే సిల్వర్‌ఫిష్‌లే. ఒక్కొక్క పుస్తకాన్ని దులిపి పక్కన పెడు తుంటే "ఇప్పుడేం పని ఆ పుస్తకాలతో. ఆ పురుగులు చూడు. నేలంతా పాకుతున్నయ్" అన్నాడు మా ఆయన.

"పురుగులుకదా పాకుతయ్" అన్నాను.

"అంత పుస్తకాలంటే మోజున్నదానివి బుక్ కీపింగ్ కూడా తెల్సుకోవాలి. ఏ రేక్ లోనో సర్ది నాఫ్తలీన్ బాల్స్... వేస్తుంటే ఇట్లా పురుగు పట్టదుగా" అన్నాడు.

"బ్రెయిన్ కీపింగ్‌లో పడి హౌస్‌కీపింగ్ బుక్‌కీపింగ్ లాంటివన్నీ వదిలేశానండీ" అన్నాను.

"బ్రెయిన్ కీపింగా? అదేంటి?" అన్నాడు.

"ఇంటికి బూజుపడితే ఎట్లా దులుపుకుని శుభ్రం చేస్తామో బ్రెయిన్‌కి పట్టిన బూజుని కూడా అట్లాగే అప్పుడప్పుడూ దులుపుకో వాలి. ఇప్పుడీ పుస్తకాల్ని తినే సిల్వర్‌ఫిష్ లాగే బ్రెయిన్‌కు కూడా అప్పుడప్పుడూ చెడు ఆలోచనలనే చెదపురుగులు పడుతుం టాయ్. పుస్తకాల పురుగుల్ని చంపటానికి నాఫ్తలీన్ బాల్స్ వేసినట్టే బ్రెయిన్ని క్లియర్ చేసుకోవటానికి ఇంట్రాస్పెక్షన్ ఉపయోగిం చాలి"

'ఇంట్రాస్పెక్షన్ అంటే ఏమిటి?' అనడు గుతాడనుకున్నా. అడగలేదు. పైపెచ్చు అక్కడనుండి గబగబ వెళ్ళిపోయాడు.

చెడు ఆలోచనలూ... చెదపురుగులూ లాంటి పదప్రయోగాల వలన ఇన్‌ఫీరి యర్‌గా ఫీలయ్యాడేమో అనుకున్నా.

పుస్తకాలన్నీ ఓ పక్కగా సర్దాను. నాక్కా వలసిన సోషియాలజీ బుక్ మాత్రం తీసు కుని బెడ్‌రూమ్‌లో కెళ్ళాను.

మా ఆయనేమైనా ఇంట్రాస్పెక్షన్ చేసు కుంటూ తప్పొప్పుల్ని బేరీజు వేసుకుంటూ వుంటాడేమో అన్న నా ఆశ అడియాశే అయింది. గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు మహానుభావుడు. ఓ నిట్టూర్పు విడిచి లైటార్పి టేబుల్ లైటు వెలిగించాను. టేబుల్ దగ్గరగా కుర్చీ లాక్కుని నా చేతి లోని పుస్తకాన్ని ఓపెన్ చేసి చదవటం ఆరంభించాను. టేబుల్ సొరుగులోంచి ఓ నోట్‌బుక్కూ, పెన్నూ తీసి చదువుతూనే నోట్స్ ప్రిపేర్ చేస్తున్నాను.

ఓ రెండు గంటలపాటు వర్కవుట్ చేశాక ఇక నిద్రకు ఆగలేక వెళ్ళి పడుకొ న్నాను. కూర్చుని చదువుతుంటే నిద్ర ముంచుకువచ్చిందిగానీ పడుకుంటే మాత్రం రాలేదు. ఇక మొదలైనాయ్ మనసులో ఏవేవో ఆలోచనలూ, జ్ఞాపకాలూ.

సంవత్సరం క్రితం ఈయనతో జరిగిన నా పెళ్ళీ ఒకే వూళ్ళో ఉద్యోగాలవడంతో అందరూ సంతోషించడం అదృష్టవంతురా లివే అంటూ ప్రతి ఒక్కరూ నన్ను పొగడ్డం, ఈ ఇంట్లో కాపురం పెట్టడం, ఆ తర్వాత ఎదురు పోర్షన్‌లోకి శ్యామలగౌరి దిగడం, మా ఆయన దానికి లైను వెయ్యడం, దాని మొగుడు నాకు సైటు కొట్టడం, హనుమా యమ్మ పిన్నీ, డాక్టర్ పురుషోత్తమ్ ఆపరే షన్స్, క్రిష్ణప్రియ మొగుడు, అనుమానపు మొగుడికి నసాళానికంటేలా జవాబులిచ్చే సీత, పెళ్ళాన్నే సరిగా పోషించలేని సత్య వాణి నాన్న మరోదాన్ని వుంచుకోవడం...

ఒకటా... రెండా... లెక్కలేనన్ని కేరక్టర్స్ నా బుర్రలో గిర్రున తిరుగుతున్నాయి.

మొత్తానికి నా మైండ్ డెవిల్స్ వర్క్‌షా పులా వుంది.

లేచెళ్ళి... నేనంతక్రితం చదువుతున్న పుస్తకాన్ని తెచ్చుకున్నాను. పుస్తకం తిరగే స్తుంటేనన్నా నిద్రపడుతుందన్న ఆశతో.

నా ఆశ ఫలించింది. ఓ కమ్మని నిద్రతెర నా కళ్ళమీద అట్లా పరుచుకుంది. మాగ

న్నుగా మూతలు పడిన నా కనురెప్పల వెనుక కదిలిపోతున్నాయ్ ఏవేవో దృశ్యాలు.

ఒకటి కాదు. వందల వీధులు... నల్లని చీకట్లతో నిండిన సందులూ గొందులూ... వాటినిండా జుట్టు విరబోసుకుని శోకదేవతల్లా తిరుగుతున్న స్త్రీలు... వారి కళ్ళలోంచి నిశ్శబ్దంగా జారుతోంది కన్నీరు. బరువైన గోతపు సంచుల్ని భుజాలమీద వేసుకుని మోస్తున్నారు వాళ్ళు.

సన్నగా... అతిసన్నగా వినబడుతోంది వాళ్ళ పెదాలనుండి జాలువారుతున్న ఏదో సవ్వడి. జాగ్రత్తగా చెవులు రిక్కించి విన్నాను. వాళ్ళేదో విషాదగీతాన్ని పాడుతున్నారు.

"హూ విల్ బై మై బ్లూ శాండ్స్
హూ విల్ బై మై గ్రే శాండ్స్?"

ఆ పాట రాగం గుండెను కోస్తోంది. నరనరాల్లో విషాదాన్ని పోస్తోంది.



చివుక్కున మెలకువొచ్చింది నాకు. నోరు తడారిపోతున్నట్టుగా అన్పిస్తుంటే ఓ గ్లాసు మంచినీళ్ళు గటగట తాగేశాను. కలలో విన్న పాటను మననం చేసుకుంటూ పడుకున్నాను.

హూ విల్ బై మై బ్లూశాండ్స్?
హూ విల్ బై మై గ్రే శాండ్స్?
హూ విల్ బై మై...

ఉన్నట్టుండి ఎవరివో అరుపులు వినిపించాయి. వీధిలో ఏవో రణగొణధ్వనులు. పరుగెత్తుకు వెళ్తున్న పదాల సవ్వళ్లు. చప్పున లేచి కిటికీ తెరిచి చూశాను. చాలా మంది జనం. గుంపులు గుంపులుగా మా ఇంటిని దాటుకుని ముందుకు వెళుతున్నారు. శ్యామలా వాళ్ళాయనా కూడా తలుపు తెరుచుకుని బయటకొచ్చారు. వరండాలో లైటు వెలిగించి తలుపు తీసుకుని బయటకు వెళ్ళాన్నేను. శ్యామల గుమ్మంలో నుంచుని వెళ్తున్నవారిలో ఒకరినాపి ఎంక్వయిరీ చేస్తోంది.

"హెల్తాఫీసర్ రంగారావు లేడూ... ఆయన కోడలు ఒళ్ళు కాల్చుకుని చనిపోయిందట"

"ఏంటీ... మొన్న... ఆర్నెల్లక్రితం పెళ్ళయినమ్మాయి" ఆశ్చర్యపోయాను.

తెల్లగా... సన్నగా... జాజిపువ్వులా వుంటుందా అమ్మాయి. మా ఇంటికి నాలుగిళ్ళ అవతలే వాళ్ళుండేది. నేనూ, శ్యామలా ఎప్పుడైనా వాళ్ళింటి మీదుగా వెళుతుంటే... వరండాలో కూర్చుని పూలు కడుతూనో... పుస్తకం చదువుకుంటూనో కనబడుతుంది. మమ్మల్ని చూస్తే పలకరింపుగా నవ్వుతుం దిగానీ పెద్దగా పరిచయంలేదు.

రంగారావు... ఆయన భార్య... కోడల్ని కూతురిలా చూసుకుంటారని మా వీధివీధంతా చెప్పుకుంటారు. ఆమె భర్తని గురించి మాత్రం అటు చెడుగా చెప్పుకోవటంగానీ... మంచిగా చెప్పుకోవటంగానీ నేను విన్లేదు. అందరితో కలిసి నేనూ, శ్యామలా అటు నడిచాం.

"పెరట్లో ఏదో అలికిడైనట్టన్పిస్తే... వంటింటి కిటికీ తెరిచి చూశా... రంగారావు గారి పెరట్లోంచి పెద్దపెట్టున మంటలు కన్పించాయి. నాకు తెలీకుండానే వెర్రికేకలేశాను. దాంతో మా ఇంట్లో... వాళ్ళింట్లో అందరూ లేచేశారు" ఓ నడివయసావిడ కళ్ళారా చూసిన దృశ్యాన్ని మరవలేనట్టు మళ్ళీ మళ్ళీ చెబుతోంది.

తెల్లటి, సన్నటి, జాజిమొగ్గ... రాక్షసి బొగ్గులా పడి వుందక్కడ. ఆమె ఒంట్లో కాలకుండా మిగిలిన పార్ట్ అంటూ ఏమీ లేదక్కడ. నల్లగా మాడిపోయిన శరీరం నుంచి ఇంకా పొగలు వస్తున్నయ్.

ఒళ్ళు జలదరించినట్టయి ఒక్కక్షణం కళ్ళు మూసుకున్నా.

అత్తామామా... ఆడపడుచూ తలలు బాదుకుని ఏడుస్తున్నారు. భర్త వూళ్ళోలేడట. జనం అనుకుంటుంటే విన్నాను.

అత్తమామలు దేవుళ్ళేనట... ఆడపడుచు చాలా మంచమ్మాయట. ఇదీ జనం మాటే.

"అంతా వాడివల్లనేలే. పెళ్ళికి ముందే ఎఫైర్ వుందట. దాన్ని పక్కూళ్ళో పెట్టాడట. ఇప్పుడు అక్కడికే తగలడ్డాడట"

"అత్తమామలకు తెలుసుట్లే. విషయం దాచిపెట్టి పెళ్ళి చేశారు. ఆ పిల్లకు తెలిసిపోయిందేమో. తట్టుకోలేక ఈ పని చేసింది"

జనం రకరకాలుగా అంటున్నారు.

"తెల్లవారేదాకా పెట్టుకుంటే కేసవుతుంది త్వరగా కానిస్తే మంచిది" రంగారావుకు అనుకూలుడైన ఓ వ్యక్తి సలహా ఇస్తున్నాడు.

అప్పుడు మండింది నాకు ఒళ్ళు. శ్యామ చెవిలో ఓ మాట చెప్పి నిశ్శబ్దంగా మా ఇంటికి వెళ్ళాను.

పోలీస్ స్టేషన్‌కి డయల్ చేసి విషయం ఇన్‌ఫాం చేశాను. నా వెనుకే వచ్చిన మా ఆయన అన్నాడు "నీవల్ల ఇవాళ మంచి ఆదాయం పోలీసులకు"

అదేంటన్నట్టు చూశాను.

"నీ ఫోనందుకున్నారుగా.. పరుగెత్తుకొచ్చేస్తారు. రంగారావ్ మాంచి సౌండ్ పార్టీ నేగా. పెద్ద మొత్తమే వసూలు చేస్తారు. రేపీ పాటికల్లా ఆ బాడీని... పోస్టమార్టమ్ చేయించి 'ఆమె చావుకు ఎవరూ కారణం కాదు. మతిస్థిరం లేక ఆత్మహత్య చేసుకుంది' అని ఓ రిపోర్ట్ ఇప్పిస్తారు"

మా ఆయన చెప్పింది అక్షరసత్యం. అందుకే నోరెత్తలేదు నేను. ఎక్కడుందీ స్త్రీకి రక్షణ!

1955లో ప్రవేశపెట్టిన ది హిందూ మేరేజ్ యాక్ట్, 1956లో ప్రవేశపెట్టిన ది హిందూ సక్సెషన్ యాక్ట్, 1985లో పాసయిన బిల్లు ది డౌరీ ప్రొహిబిషన్ యాక్ట్... 1987లో పాసైన ది కమిషన్ ఆఫ్ సతి యాక్ట్... స్త్రీ కోసం సృష్టించిన ఇన్ని యాక్టులూ ఏ స్త్రీ కన్నీళ్ళనూ తుడవలేవని నాకు. తెలుసు.

★ ★ ★

హాస్పిటల్ వెనుకవైపున్న విశాలమైన ఆవరణలో దంపతుల అవగాహనా సదస్సు ప్రారంభమైంది. ముందు హాస్పిటల్ హాల్ అనుకున్నారుగానీ... ఎందుకైనా మంచిదని ఓపెన్ ప్లేస్‌లో అరేంజ్ చేశారు. అట్లా చెయ్యటం ఎంత మంచిదైందో... వచ్చిన జనాన్ని చూశాక అర్థమైంది. మీటింగ్ హాల్ కెపాసిటీకీ వచ్చిన జనానికీ పొంతనే లేదు. సుమారు వెయ్యిమంది దంపతులు అటెండ్ అయివుంటారు.

ఆ రెస్పాన్స్ చూసిన డాక్టర్ పురుషోత్తం వండరయ్యాడు.

డయాస్‌మీద చీఫ్‌గెస్ట్... జిల్లా జడ్జి మోహన్రావు... డాక్టర్ పురుషోత్తం... ఇంకో ముగ్గురు డాక్టర్లు వున్నారు. వి.ఐ.పిలకు కేటాయించిన సీట్స్‌లో పట్టణంలోని డాక్టర్స్... ఇంకొంతమంది ముఖ్యులు ఆసీనులయ్యారు. ఇక వాళ్ళ వెనక వరసల్లో అంతా సదస్సుకు హాజరైన జంటలే. వాళ్ళలో మా హనుమాయమ్మ పిన్ని దంపతులు... క్రిష్ణప్రియ దంపతులు... మా ఆఫీస్ స్టాఫ్‌తోపాటు మా ఆయనా, శ్యామల వాళ్ళాయనా కూడా వున్నారు. ఓ లోకల్ చానల్ వాళ్ళని ప్రోగ్రామ్ కవరేజ్ కోసం ఆహ్వానించాం. ఇంకో ఇద్దరు, ముగ్గురు న్యూస్ పేపర్ రిపోర్టర్లు వున్నారక్కడ.

హాస్పిటల్ స్టాఫ్‌తోపాటూ, నేనూ శ్యామలా కూడా కష్టపడుతున్నాం. కేటరింగ్ సెక్షన్ని సూపర్‌వైజ్ చేస్తున్నాం మేము. ఓ నర్స్ ప్రార్థనా గీతాన్ని పాడాక ఉన్నట్టుండి మైక్‌లో వినబడింది డాక్టర్ పురుషోత్తం గొంతు. "ఐ రిక్వెస్ట్ అవర్ ఆనరబుల్ చీఫ్ గెస్ట్ మిష్టర్ మోహన్‌రావు టు ప్రిసైడ్ ఓవర్ ద ఫంక్షన్"

జడ్జ్‌గారు లేచి దంపతుల్ని అడ్రస్ చేశారు. డాక్టర్ పురుషోత్తం వైద్యరంగానికి అందిస్తున్న సేవల్ని కొనియాడారు. కంప్యూటర్ టెక్నాలజీ గురించి కొన్ని సాధారణ విషయాలు మాట్లాడారు. ఆ తర్వాత... "ఇప్పుడు డాక్టర్ పురుషోత్తంగారు... వైద్య రంగలో తను సాధించిన అద్భుతాల్ని గురించి మీతో ముచ్చటిస్తారు" అంటూ కూర్చున్నారు.

డాక్టర్ పురుషోత్తం లేచి గొంతు సవరించుకున్నాడు. అందర్నీ విష్‌చేసి... మాట్లడ్డం మొదలెట్టాడు.

"కంప్యూటర్లను మానవీకరించే దిశలో మనిషి పరుగులు తీస్తున్నాడు. తన శరీర నిర్మాణ విశేషాల్ని ఛేదించుకుంటూ, తన మెదడు పనితీరును విశ్లేషించుకుంటూ, తను కనుగొన్న రహస్యాల్ని యంత్రాలలోకి చొప్పించి మనిషికి సాటి రాగల యంత్రాలను సృష్టించే ప్రయత్నంలో ఆ సృష్టికర్తతోనే పోటీ పడుతున్నాడు. తన తెలివితేటల్ని యంత్రాలకు ధారాదత్తం చేసే ప్రక్రియలో తలమునకలవుతున్నాడు. ఆర్టిఫిషియల్ ఇంటెలిజన్స్‌తో ఆర్టిఫిషియల్ మానవుడ్ని సృష్టించే ప్రయత్నంలో అలసిపోతు

న్నాడు. కానీ...

ఆయన ఒక్క క్షణం ఆగి ఆడియన్స్‌కేసి చూశారు.

"అయితే క్రియేటివిటీ, నిర్ణయాలు తీసుకునే శక్తి, ఒక విషయాన్ని చూసి నేర్చుకోగల నేర్పూ... సమస్యను విశ్లేషించి... పరిష్కారాన్ని సూచించగల మేథా సంపత్తినీ కృత్రిమ మేథతో పనిచేసే యంత్రానికి నేర్పడానికీ... మానవుణ్ని పోలిన యాంత్రాయిడ్‌ని సృష్టించడానికీ తాపత్రయపడుతున్న మానవుడు... తన సహజమేథలోని లోపాల్ని ఎందుకని సవరించలేకపోతున్నాడు.

సరిగ్గా ఈ దిశలోనే నా పరిశోధన సాగింది. ఎవ్రీథింగ్ పర్‌ఫెక్ట్‌గా వుండి చిన్న బలహీనతవల్ల వెళ్ళకూడని మార్గంలో వెళుతున్న మనిషిని... మానవుడైవుండి కూడా మానవత్వంలేని యంత్రంలా ప్రవర్తించే ఒక వ్యక్తిని ఎందుకని... మనం నియంత్రించకూడదు? అతని మెదడులోని న్యూరాన్ సర్క్యూట్లను సవరించి మైక్రోప్రాసెసర్లను సరైన పద్ధతిలో సృష్టించి అవి సక్రమంగా పనిచేయగలిగేలా ఎందుకు చెయ్యకూడదు...? అనుకున్నాను.

ఈ విషయం మీద రీసెర్చ్ చేస్తూ దేశవిదేశాలు తిరిగాను. అంతర్జాతీయంగా నా థీసిస్‌ని అందరూ ముక్తకంఠంతో ఒప్పుకునేలా చేశాను. నా సొంత లేబరేటరీలో ప్రయోగాలు చేశాను. అనూహ్యమైన ఫలితాలు సాధించాను.

ఒక చిన్న మైక్రోచిప్‌ని మనిషి మెదడులోకి చొప్పించి ఆ చిప్‌లో రూపొందించిన ప్రోగ్రామ్ ప్రకారం ఎనలాగ్ సంకేతాలకు మెదడు స్పందించేలా చేయగలిగాను.

అయితే! నా ఈ పరిశోధనా ఫలితాల్ని ఎవరికి పంచి పెట్టాలో... ఎవరి బ్రెయిన్ని నేను ట్యూన్ చెయ్యగలిగితే... ఈ సమాజంలో ఆరోగ్యకరమైన మార్పులొస్తాయో సూచించిన వ్యక్తి మాత్రం... ఒక స్త్రీ. నా పరిశోధనలకు పరమార్థం ఇదీ అని చెప్పిన ఆమెను మీకు ఈ సభావేదికమీద పరిచయం చెయ్యబోతున్నాను" అంటూ ఆగాడాయాన.. ఆయన మాట్లాడింది నా గురించే... ఆవిషయం నాకు స్పష్టంగా అర్థమైంది.

"ఐ రిక్వెస్ట్... మిసెస్ విజయా మధుకర్ టు కమ్ ఆన్ టు ద డయాస్" అన్నాడాయన.

నా గుండె దడదడలాడింది. శ్యామల చేతిని గట్టిగా పట్టుకున్నాను. "డోంట్ బి సిల్లీ" అందది.

నిజమే నేనేం చిన్న పిల్లను కాదు. ఫుల్లీ మెచ్యూర్డ్. ఈ అవగాహన సదస్సులో మాట్లాడ్డానికి ప్రిపేర్ అయ్యాను.

"ఒన్స్ ఎగైన్ ఐ రిక్వెస్ట్" డాక్టర్ పురుషోత్తమ్ మళ్ళీ పిలుస్తున్నాడు నన్ను.

ఇక లాభం లేదనుకుని లేచి నిలబడ్డాను. డయాస్ మీదకు వెళుతుంటే కాళ్లు సన్నగా వణికాయి. నన్ను ఆడియన్స్‌కి పరిచయం చేసి కూర్చున్నాడాయన. జడ్జ్‌గారు లేచారు. ప్రోగ్రామ్ అజెండాలో చూస్తూ ఇట్లా అన్నాడు.

"మెదడు పరివర్తనకు సంబంధించిన ఈ కంప్యూటరైజ్డ్ ఆపరేషన్ని చిత్రవిచిత్రమైన సమస్యలతో బాధపడుతూ సంసారాన్ని కకావికలం చేసుకుంటున్న దంపతులకోసం... ముఖ్యంగా... వినియోగించమని డాక్టర్ పురుషోత్తమ్‌గారికి అమూల్యమైన సలహా ఇచ్చిన ది సెన్సిబుల్ లేడీ... మిసెస్ విజయా మధుకర్ ఇప్పుడు మీతో తన అంతరంగాన్ని పంచుకుంటారు"

నేను మైక్ అందుకున్నాను. అందర్నీ విష్ చేశాను. నా గొంతు సన్నగా వణుకుతూనే వుంది. అయినా మాట్లాడ్డం మొదలెట్టాను.

"ఒక పురుషుడు... ఒక స్త్రీని పెళ్లాడితే ఇద్దరూ దంపతులవుతున్నారు. ఈ దంపతుల దాంపత్యఫలాలుగా పిల్లలు పుడితే...

దాన్ని కుటుంబం అంటున్నాం. ఇటువంటి వందల, వేల కుటుంబాల్ని కలిపి సమాజం అంటున్నాం. అంటే ఈ సమాజ సృష్టిక ర్తలు దంపతులే"

ఒక్కసారిగా కరతాళధ్వనులు చేశా రంతా. నాలోని ఒణుకు మాయమైంది. ఒకలాంటి ఉత్సాహం వచ్చేసింది.

"సో... ఈ సమాజ నిర్మాణకర్తలైన దంపతుల్లో ఏ చిన్నలోపం వున్నా అది సమాజాన్నే దెబ్బతీస్తుంది. ఒక దుర్మార్గు డైన భర్త భార్యను సుఖపెట్టలేడు. ఒక స్వార్థపరురాలైన భార్య భర్తను ప్రశాం తంగా బతకనివ్వదు. ఇద్దరి మధ్యా దాంపత్యం నరకమౌతుంది. ఆ నరకం లోంచి ఉద్భవించే పిల్లలు నిర్వీర్యులౌతారు. ఇట్లాంటి లోపభూయిష్టమైన కుటుంబాలతో ఏర్పడే సమాజం జ్ఞానేంద్రియాలు లేని మనిషిలాంటిది. మంచిచెడుల విచక్షణ దానికి తెలియదు. మూర్ఖత్వం, మూఢత్వం దాని ఆయుధాలవుతాయి. ఆ ఆయుధాలకు బలైపోతున్న మానవుల హాహాకారాలతో చివరికి సమాజం సమాజమే దద్దరిల్లిపో తుంది. రక్తపంకిలమవుతుంది.

ఇట్లాంటి పరిస్థితి రాకుండా వుండాలంటే ఒక్కటేదారి. దంపతుల మధ్య అవగాహన వుండాలి. వివాహవ్యవస్థపట్ల నమ్మకం వుండాలి. ఆ వ్యవస్థను వెయ్యి కళ్లతో కాపా డగలగాలి.

ఆది మానవుడికి ఆకలి తప్ప ఇంకోటి తెలియదు. క్రమంగా కాలం అతనికి అభి మానాన్ని నేర్పింది... ఆత్మీయతల్ని పంచింది... అనురాగాన్ని రంగరించిపో సింది... అనుభూతుల జల్లులు కురిపిం చింది... అతని గుండెల్లో ప్రేమజ్యోతిని వెలిగించింది. పెళ్లిదాకా నడిపించింది.

అయితే ప్రస్తుతకాలంలోని అప్రూవ్డ్ మేరేజ్ సిస్టమ్ ఏర్పడ్డానికి ఎన్ని జీవితకా లాలు పట్టాయో, ఎన్ని ఆటుపోట్లు ఎదురై నాయో మనం వూహించగలిగితే తెలు స్తుంది. వివాహ వ్యవస్థలోని గొప్పతనం.

పెళ్లి అనే వ్యవస్థ ఎన్నో రూపాంతరాలు చెందింది. ఒకప్పుటి ఈ వ్యవస్థలో పాలి యాండ్రీ వుండేది. అంటే ఒక స్త్రీ ఎంత మంది పురుషులనైనా పెళ్లి చేసుకోవచ్చు. ముఖ్యంగా ఈ ఆచారం టిబెట్, పాలినే షియా, మలబార్ ప్రాంతాల్లో వుండేది. అప్పట్లో సోషల్ లైఫ్ కష్టతరంగా వుండేది. కుటుంబ భారాన్ని మోయడం ఒక్కడికి తలకు మించిన పని. అందుకే ఫామిలీని సపోర్ట్ చెయ్యడానికి ఒక భార్యకు ఎక్కువ మంది భర్తల అవసరం వుండేది. అయితే ఈ విధానంలో నష్టపోయింది స్త్రీనే. శారీర కంగా, మానసికంగా ఆమె శిథిలమైపో యింది.

కొన్నాళ్లకు ఈ వ్యవస్థ రూపుమాసిపోయి పాలిగైనీ సిస్టమ్ మొదలైంది. ఇందులో ఒక పురుషుడు ఎంతమంది స్త్రీలనైనా నిర భ్యంతరంగా వివాహమాడవచ్చు. ఆర్థికంగా బలవంతుడైన వాడైతే డజన్లకొద్దీ భార్యల్ని కొనుక్కోవచ్చు. ఇక్కడ కూడా నష్టపో యింది స్త్రీనే. భర్త ప్రేమను ఇతరులకు పంచలేకా పంచక తప్పకా ఒక బానిసలా జీవితాన్ని సాగించింది. ఇక పురుషుడి వైపు నుండి ఆలోచిస్తే కూడా ఈ వ్యవస్థ ఆర్థి కంగా అతనికి మోయలేని భారమైంది. అంతమంది భార్యల్నీ, వారికి పుట్టిన సంతా నాన్ని సపోర్ట్ చేయడం కామన్‌మేన్‌కి సాధ్యం కాలేదు. రానురాను పాలిగైనీ ధన వంతులకే పరిమితమైపోయింది. ఆ తర్వా త్తర్వాత సివిలైజ్డ్ సొసైటీస్ దాన్ని ఇల్లీగల్ వ్యవస్థగా డిక్లేర్ చేశాయి.

మన ఇండియన్ గవర్నమెంట్ పాలిగై నీకి వ్యతిరేకంగా దాన్ని నేరంగా పరిగ ణిస్తూ 1955లో హిందూ మేరేజ్ యాక్ట్‌ను ప్రవేశపెట్టింది.

ఆ తర్వాత వచ్చిన వ్యవస్థే మోనోగమీ. ఇందులో ఒక పురుషుడు ఒక స్త్రీనే వివాహ మాడాలి. ఇది ఇప్పటి లీడింగ్ ఫామ్ ఆఫ్

మేరేజ్. ఇక్కడ భర్త ప్రేమానురాగాలు పూర్తిగా భార్యకే సొంతం. అట్లాగే భార్య జీవితం భర్తకే అంకితం. భార్యాభర్తలిద్దరూ కల్సి పిల్లల భవిష్యత్తు కోసం పాటుపడ తారు. వారికి అనిర్వచనీయమైన ఆప్యాయ తనీ అపురూపమైన భద్రతనీ అందిస్తారు. తిరిగి అటువంటి ఫేవరింగ్ కోడ్‌నే ముసలి తనంలో పిల్లలద్వారా పొందుతారు. ఇందులో అడ్వాంటేజెస్ తప్ప డిస్ అడ్వాం టేజెస్ లేనేలేవు. అందుకే మోనోగమీ దటీజ్ ఒక మేన్ ఒక వైఫ్ సిస్టమ్ ఒక పవిత్రమైన ఇమేజ్‌ని సంపాదించుకుంది.

ఆ తర్వాతేవో కంపానియనేట్ మేరేజ్ అనీ ఎక్స్‌పెరిమెంటల్ మేరేజ్ అనీ ఏవేవో ఇంట్రడ్యూస్ అయ్యాయిగానీ మోనోగమీ ముందు అవి నిలబడలేదు. ప్రెజంట్ సొసైటీలో తిరుగులేని వ్యవస్థ ఇది.

ఇంత పటిష్టమైన, పవిత్రమైన వ్యవస్థను కూడా నీరు కార్చేందుకు కొందరు మను షులు వెనకాడ్డంలేదు. శారీరకంగా దీన్ని యాక్సెప్ట్ చేస్తూనే మానసికంగా పాలి యాండ్రీ, పాలిగ్రైనీ, రాజ్యమేలిన రోజుల్లోకి వెళ్లిపోతున్నారు.

ఫరెగ్జాంపుల్ ఓ రామారావు ఒక్క రాధా రాణినే చేసుకుంటాడు. నాతిచరామీ అంటాడు. ఏడడుగులూ నడుస్తాడు. బట్ మూడు ముళ్లు వేసిన మరుక్షణం నుండీ అతని కళ్లకు భార్యకన్నా చుట్టుపక్కల ఆడాళ్లే నచ్చుతారు. వీలైతే వారితో అక్రమ సంబంధం పెట్టుకుంటాడు. వీలుకాకుంటే మానసిక వ్యభిచారం చేస్తాడు. ఇంకో సుబ్బారావుంటాడు. భార్యను అనుక్షణం వేధిస్తుంటాడు. శారీరకంగా హింసిస్తుం టాడు.

మరో రాజారావు... భార్యను అయిన దానికీ కానిదానికీ అనుమానిస్తుంటాడు.

ఇది కేవలం పురుషులకే వర్తించదు. స్త్రీలకూడా. అయితే దీనికంతటికీ కారణం... అతనిలోని బలహీనత.

కొందరికి ఎటువంటి బలహీనతలూ వుండవు. వారిది సంపూర్ణ వ్యక్తిత్వం. కొందరికి బలహీనతలున్నా నేచురల్‌గా వాటిని జయించగలుగుతారు. కొందరు బలహీనతల్ని గుర్తిస్తారుగాని జయించ లేరు. కారణం వాటికి బానిసలై బతుకుతుం టారు. కొందరసలు వారి బలహీనతల్ని కనీసం గుర్తించరు.

పై రెండు రకాల మనుషులతో ప్రాబ్లం లేదు. వారివి నేచురల్లీ హెల్దీ ఫ్యామిలీస్. కానీ చివరి రెండు రకాల వాళ్లతోనే చిక్కంతా. ఇటువంటి వారివల్లే సొసైటీ సిక్ అయ్యేది. అటువంటి అవాంతరం మన సమాజానికి రాకుండా ఆదుకోవల్సిన బాధ్యత మన భుజాలమీద వుంది.

అందుకే డియర్ కపుల్!

ఇద్దరిలో ఏ ఒక్కరిలో బలహీనతవున్నా అది ఎటువంటిదైనా దాన్ని జయించే అవ కాశాన్ని డాక్టర్ పురుషోత్తమ్‌గారు మీ ముందుంచారు. ఒక చిన్న హైలీ సోఫిస్టికే టెడ్, కంప్యూటరైజ్డ్ ఆపరేషన్‌ద్వారా... యుకెన్ విన్నోవర్ యువర్ వీక్‌నెస్. సో దట్ యుకెన్ బిల్డప్ ఎ హెల్దీ సొసైటీ.

మీ ఫ్యామిలీని... సిలికాన్ ఫ్యామిలీగా మార్చుకోండి. చింతల్నీ బాధల్నీ చికాకుల్నీ తరిమికొట్టి మీ జీవితాల్ని ఆనందమయం చేసుకోండి"

థ్యాంక్స్ చెప్పి నా ప్రసంగాన్ని ఆపాను.

నేనూహించలేదు అందరూ అంత ఇన్ స్పైర్ అవుతారని. చప్పట్లతో మార్మోగిపో యిందా ప్రదేశం.

ఓ రెండు నిమిషాలపాటు ఆ క్లాపింగ్ ఓ ప్రవాహంలా సాగిపోయింది.

నా తర్వాత శ్యామలని మాట్లాడమని అడిగానుగాని అది ససేమిరా అంది. స్టేజ్ మీద వున్న ముగ్గురు డాక్టర్స్ స్పీచ్ అయ్యాక డాక్టర్ పురుషోత్తం మళ్లీ మాట్లా డుతూ "ఇప్పటికి ఈ సిటీలో నేను దాదాపు ఓ పది ఆపరేషన్లు కండక్ట్ చేసి వుంటాను.

వారిలో ఎవరైనా... ఎవిడెన్షియల్ స్పీచ్ ఇవ్వదల్చుకుంటే నేను వారిని మనః పూర్వ కంగా వేదిక మీదకు ఆహ్వానిస్తున్నాను" అన్నాడు.

"జంటగా వస్తే మరీ ఆనందం" అన్నారు జడ్జ్‌గారు.

చటుక్కున లేచింది మా హనుమా యమ్మ పిన్ని. మా బాబాయ్ చెవిలో ఏదో వూదింది. వెంటనే ఆయన కూడా లేచాడు.

వంటింటి కుందేలులాంటి మా పిన్ని, ఎవరైనా పరాయి మగాళ్లు ఇంటికొస్తే తలుపు చాటున నిలబడి భుజాలనిండా కొంగుకప్పుకుని మరీ మాట్లాడే మా పిన్ని డేరింగ్ అండ్ డేషింగ్ హీరోయిన్లా డయాస్ మీదకు దూసుకొస్తుంటే అన్పిం చింది నాకు ఆమెలోని ఇంత గొప్ప జీల్‌నీ, మా బాబాయ్ ఇంతకాలం ఎంత కర్కశంగా అణిచి పెట్టాడా అని.

మా పిన్ని, బాబాయ్ డయాస్ మీద పక్కపక్కనే నిలబడ్డారు. ముందు మా పిన్నే మాట్లాడింది.

"కేవలం వంటింటికే పరిమితమై... జీవ చ్ఛవంలా బతికేదాన్ని. అంట్ల గిన్నెలకన్నా, మసిగుడ్డకన్నా ఎక్కువ విలువేం లేదు నాకు. నేను ఇంట్లో నోరు మెదిపితే తిట్టడం, తల తిప్పితే కొట్టడం మా వారి హాబీ. నాకప్పట్లో ఆయన్ని చూస్తే బుస కొట్టే పాములూ... శవాల్ని పీక్కుతినే హైనాల్లూ గుర్తుకొచ్చేవి తప్ప ఆయన్నో మనిషిలా ఎప్పుడూ అనుకోలేదు. గుమ్మంలో అడుగుల చప్పుడైతే చాలు హార్ట్ ఎటాక్ వచ్చినంతగా భయపడేదాన్ని. ఒక్క మాటలో చెప్పాలంటే గొలుసుల్తో బంధిం చిన బానిసలాంటి బతుకు నాది. అట్లాంటి నా చీకటి జీవితంలో... దీపం పెట్టిన మహానుభావుడీయన" మా పిన్ని వెనక్కి తిరిగి పురుషోత్తమ్‌గారికి నమస్కరించి మళ్లీ మాట్లాడ్డం ఆరంభించింది "ఆయనేం చేశాడో నాకు తెలియదు. మా ఆయన మెదడులో ఏదో చిప్ అట అది పెట్టి కుట్టే శాడు. అంతే... ఆవాల్టి నుండీ మా ఆయన బంగారమై పోయాడు. నన్ను ప్రాణంలా చూసుకుంటున్నాడు. ఇంగ్లిషు, సంగీతం లాంటి వెన్నో నేర్చుకోవాలన్న నా ఒకప్పటి కోరికలన్నీ ఇప్పుడు తీరుతున్నాయి" ఇక అంతటితో ఆపి మా బాబాయ్‌కి ఛాన్సి చ్చింది మా పిన్ని.

"డాన్స్ అంటే కూడా తగని మోజు ఆవి డకి. వయసయిపోయిందని నేనే వద్దన్నా" అన్నాడు ఉపోద్ఘాతంలా మా బాబాయ్.

ఒక్క పెట్టున నవ్వారందరూ. అందరూ నవ్వడం ఆపాక చెప్పాడాయన.

"జీవితమెంతో తియ్యనిది... అందుకనే అతి స్వల్పమదీ అన్నారో సినీకవి. ఈ స్వల్పమైన జీవితంలోని మాధుర్యాన్ని అను భవించకుండానే... ఒక పశువులా, ఒక బండరాయిలా బతికి... ఏదో ఒకరోజు రాలిపోవలసిన నన్ను మనిషిని చేశారు డాక్టరుగారు. గిన్నెలతో పాయసాన్ని జుర్రు కుంటున్నట్టు జీవనమాధుర్యాన్ని జుర్రుకో మని నా నుదుట రాశారు. జీవితాంతం ఆయనకు ఋణపడి వుండటం మినహా... ఇంకేం చెయ్యలేను" ఆయన కళ్లు చెమ ర్చాయి. గొంతు గాద్గదికమైంది. వాళ్లు డయాస్ దిగబోతుంటే డాక్టర్ పురుషోత్తమ్ ఆపి అన్నాడు ఆడియన్స్‌తో 'ది ఫస్ట్ సిలి కాన్ ఫ్యామిలీ ఇన్ ద సిటీ.. ప్లీజ్ విష్ దెమ్ ఎ వెరీ హేపీ లైఫ్"

ఒక్కసారిగా అరిచారు ఆడియన్సంతా "వియ్ విష్ యు ఎ హేపీ లైఫ్... మెర్రీ లైఫ్... వండ్రఫుల్ లైఫ్" అంటూ. తర్వాత క్రిష్ణప్రియా, రాధాక్రిష్ణా... ఇంకా కొంత మంది డాక్టర్స్ పురుషోత్తమ్‌ని పొగడ్తలతో ముంచెత్తారు.

జడ్జ్‌గారు ఆ సదస్సును కంక్లూడ్ చేస్తూ అన్నారు "ఎటువంటి ఇన్‌హిబిషన్స్‌కి లోను కాకుండా ధైర్యంగా ముందుకొచ్చి నీలోని వీక్‌నెస్ నువ్వు పటాపంచలు చేసుకో. ఒక

పది నిమిషాల ఇంట్రాస్పెక్షన్ చాలు... నువ్వేంటో నువ్వే తెలుసుకునేందుకు. నీ తప్పొప్పులను నువ్వే బేరీజు వేసుకో. నీ తప్పేంటో తెలుసుకున్నాక ఒక్కసారి డాక్టర్ పురుషోత్తమ్‌ని కలువు. చిన్న ఆపరేషన్‌తో గొప్ప జీవన మాధుర్యాన్ని పొందు"

ఆయన మాటల్లోని పర్సనల్ అప్రోచ్ ప్రతి ఒక్కరినీ టచ్ చేసి వుంటుందను కున్నా.

ఓటాఫ్ థాంక్స్ తర్వాత అందరూ డిస్పర్స్ అవుతున్నప్పుడు చాలా జంటలు పురుషోత్తమ్‌ని చుట్టుముట్టి ఏవేవో ప్రశ్నలతో ఆయన్ని ఉక్కిరిబిక్కిరి చెయ్యడం, చూస్తూ అన్నాను శ్యామలగౌరితో... "గ్రాండ్ సక్సెస్ కదూ" అని.

మరుసటిరోజు రాత్రి ఎనిమిదింటికల్లా టీవీ ముందు సెటిలైపోయాను. ఆయన మాత్రం లోపల చూడాలని వున్నా పైకి ఇంట్రెస్ట్ లేనట్టు నటిస్తూ, ఉదయం చదివేసిన పేపర్ని మళ్ళీమళ్ళీ చదువుతున్నాడు. అది కూడా ఆ సదస్సు గురించి వార్త వేసిన పేజీని మాత్రం పక్కనపెట్టి.

ప్రోగ్రాం స్టార్టవడానికి ఇంకో రెండు నిముషాలు టైం వుండడంతో నేను శ్యామల పోర్షన్‌కేసి వెళ్ళి "శ్యామలా... టీవీ పెట్టుకున్నావా? " గుర్తుచేస్తున్నట్టు అన్నాను.

ఆ సరికే భార్యాభర్తలిద్దరూ టీవీకెదురుగా కూర్చుని వున్నారు. అది నన్ను చూసి నాతోపాటు బయటకొచ్చి "అలా చూడు. టీవీ స్క్రీన్‌కేసి గుడ్లగూబలా ఎలా చూస్తున్నాడో. నువ్ కనబడతావన్న ఆశ" ఉక్రోషంగా అంది.

అప్పుడర్థమైంది నాకు మా ఆయన అంత అనింట్రెస్టెడ్‌గా ఎందుకున్నాడో. ప్రోగ్రామ్‌లో శ్యామల కనబడదుగా.

వచ్చి మళ్ళీ నా ప్లేస్‌లో కూర్చున్నా. ప్రోగ్రాం స్టార్టవబోతున్నప్పుడు అన్నాను. "మొత్తం కవర్ చేసి వుంటారుగా. ఎక్కడో చోట శ్యామల కనబడకపోదు"

అంతే... మంత్రంలా పనిచేసిందామాట. పేపర్ని విసిరిపుచ్చి కొట్టి స్ప్రింగ్‌లా లేచి కూర్చున్నాడు.



అచ్చు శ్యామలా వాళ్ళింట్లోలాగే మరో గుడ్లగూబ తయారయ్యిందిక్కడ. కన్ను మలిపితే ఒట్టు. ఏ స్ప్లిట్ సెకెండ్‌లో ఆయన కలలరాణి కనబడి మాయమవుతుందోనని కదలకుండా కూర్చున్నాడు.

ప్చ్... ఈ మగాళ్ళిద్దరిలో ఆ సదస్సు ఆవగింజంత మార్పయినా తేలేదు. ఎందుకో గాని నిస్త్రాణగా అన్పించింది నాకు.

డాక్టర్ పురుషోత్తం స్పీచ్ అయ్యాక నాది మొదలైంది స్క్రీన్‌మీద. టీవీ వాల్యూమ్ పెంచాను. ఎక్జయిటింగ్‌గా నన్ను నేను వింటూ,

# ఏరిన ముత్యాలు

* ప్రతీమనిషీ ఒక ఉద్గ్రంథమే, దానిని నువ్వు చదవగలిగితే.

– ఛానింగ్

* చట్టాలు అంతరిస్తాయి. అయితే పుస్తకాలు మాత్రం శాశ్వతంగా ఉంటాయి.

– బుల్వర్‌లైటన్

* పరిస్థితులు మారవు. వాటిని మనమే మార్చాలి.

– థోరో

* ఒక కవికి లభించిన అదృష్టం ఈ శిలాఫలకం మీద కనిపిస్తుంది. అతను రొట్టెను అడిగితే ఓ రాయి లభించింది.

– శామ్యూల్‌వెజ్లే

* ఎంత దూరంలో ఉన్నా రక్తసంబంధం తెగిపోదు. ఎన్నటికీ సోదరులు సోదరులే!

– కెల్లీ

* ఉదయం రోజును ఏవిధంగా చూపుతుందో, చిన్నతనం రూపొందబోయే మనిషిని చూపుతుంది!

– జాన్ మిల్టన్

* మనిషికన్నా చాలా శక్తివంతమైనవి పరిస్థితులు.

– నెహ్రూ

* దుస్తులు మనిషికి ఆత్మ వంటివి.

– షేక్స్‌పియర్

* ఏ పనీ చెయ్యలేని వారు తమ అశక్తతను కప్పిపుచ్చు కోవడం కోసం, పరిస్థితులు అనుకూలంగా లేవని చెప్తారు.

– సర్ జగదీశ్‌చంద్రబోస్

* దుస్తులు మనిషిని రూపొందిస్తాయి.

– ఓ సామెత

* సింహం వంటి బలమైన జంతువు సహితం, ఈగల బారినుంచి తనను తాను రక్షించుకొంటుంది.

– నోకోలస్

* సౌందర్యరాశి అయిన ఓ మగువ కళ్లకు స్వర్గం వలే కనిపిస్తుంది. ఆత్మకు నరకమవుతుంది.

– చామ్‌ఫోర్డ్

సేకరణ: కొడిమెల శ్రీరామమూర్తి

"ఎందుకంత సౌండు? " అన్నాడాయన చిరాగ్గా.

ఆయన చిరాకు నాకర్థమైంది. ఎంత యినా మేల్ డామినేటింగ్ సొసైటీ కదా ఇది.

అదే ఆయన మాట్లాడి వుంటే నేను అబ్బురంగా వినాలి. దాన్ని గొప్పగా ఫీల వ్వాలి.

"మరీ డ్రేగింగ్‌గా వుంది స్పీచ్" కామెంట్ చేశాడు.

నేను సమాధానం ఇవ్వలేదు.

"ఆల్వేస్ షార్టీజ్ ఎఫెక్టివ్. లాంగ్ ఈజ్ ఇనెఫిక్టివ్" అన్నాడు.

దానికీ మాట్లాడలేదు నేను.

నేను మోనోగమీ తర్వాత కంపానియ నేట్, ఎక్స్‌పెరిమెంటల్ మేరేజెస్ గురించి మాట్లాడుతున్నప్పుడు అడిగాడు, "ఆ రెండూ ఏంటో ఎక్స్‌ప్లెయిన్ చెయ్యలేదే" అన్నాడు.

"లాంగీజ్ ఇనెఫిక్టివ్ కదా. అందుకే షార్ట్‌కట్ చేశా" అన్నాను కసిగా.

"ఓ కప్పు కాఫీ ఇస్తావా? " అన్నాడు.

నన్ను డిస్టర్బ్ చెయ్యాలని అడగడం తప్ప భోజనానికి ముందు ఆ టైంలో కాఫీ ఏంటి?

"ఫిల్టర్‌లో డికాక్షన్ వుంది. కుక్కర్‌లో పాలున్నాయ్. ప్లీజ్ కలుపుకుందురూ" అని, "ఆ చేత్తోనే నాకూ ఓ కప్పు పట్రండి" అన్నాను. నేనట్లా అంటానని ఊహించలే దేమో. ఖంగుతిన్నట్టు చూశాడా కుళ్ళుబోతు మానవుడు.

"ఇప్పుడొద్దులే. ఆకలి చచ్చిపోతుందేమో" అన్నాడు.

'నిజమే దాన్నట్లా బతకనీ' అనుకున్నా మనసులో.

స్క్రీన్‌మీద నేను మాయమై ఓ డాక్టర్ మాట్లాడుతున్నాడు.

అప్పుడు లేని శ్రద్ధ నటిస్తూ చాలా జాగ్ర త్తగా వింటున్నట్టు పోజిచ్చి కూర్చున్నాడు.

అతని స్పీచ్ పూర్తవుతుండగా, "ఫెంటా స్టిక్ స్పీచ్. హి ఈజె వండ్రఫుల్ ఆరేటర్" అన్నాడు.

నేనాయనకేసి చురుగ్గా చూసి ఏదో అన బోతున్నంతలో ఆపసోపాలు పడుతూ వచ్చాడు భాస్కరరావు.

"కంగ్రాట్యులేషన్స్ విజయా" నా కరచా లనం కోసం అన్నట్టు చేయి చాపాడు.

మా ఆయన చూపులు ఇమీడియట్‌గా టీవీ స్క్రీన్‌మీదనుండి టర్న్ అయిపోయి భాస్కర్రావు హేండ్‌మీద ఫిక్సయిపో యాయి.

అప్పుడొచ్చింది నా మనసులోకి ఓ చిలిపి ఆలోచన. చప్పున భాస్కర్రావు చేతిని అందుకుని కరచాలనం చేస్తూ ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అవుతున్నట్టూ "థాంక్యూ... థాంక్యూ...వెరీమచ్" అన్నాను.

మా ఆయనో గుటక మింగడం నా చూపు దాటిపోలేదు. ఈ విషయాన్ని గమ నించడంలోపడి అవతల భాస్కరరావు పరి స్థితి పట్టించుకోలేదు నేను. నాకు తెలుసు అతను ఫ్లాటయిపోయి వుంటాడని. అయినా చూద్దామని అతనికేసి చూశాను. భాస్కర్రావింకా నేను ముట్టుకున్న తన చేతి వంక అడ్మయిరింగ్‌గా చూసుకుంటూనే వున్నాడు. ఓ వారంపాటు ఆ చేతిని దేనికీ ఉపయోగించకుండా ఆట్టిపెట్టుకోడుకదా అని భయంగా అనుకున్నాను.

నా ఆలోచనకు నాకే నవ్వొచ్చి పక్కుమని నవ్వాను. నేనెందుకు నవ్వానో అర్థంకాని మాఆయన ముఖం చిన్నబుచ్చుకున్నాడు. ట్రాన్స్‌లో వున్న భాస్కరరావు మాత్రం "ఒన్స్ ఎగైన్ కంగ్రాట్యులేషన్స్" అంటూ మళ్ళీ చెయ్యి ముందుకు చాపాడు.

"ఓర్నీ దుంపతెగ" అనుకుని ఈసారి కర చాలనం చెయ్యకుండా, "థాంక్యూ ఒన్స్ ఎగైన్" అన్నాను.

"ఏమండీ... ఏం చేస్తున్నారక్కడ రండీ" అంటూ కేకేసింది శ్యామల వాళ్ళ వరండా

లోనే నిలబడి.

భాస్కరరావు నా కళ్ళలోకి ఓ కిలోమీటర్ లోతున చూసి వెళ్ళలేక వెళ్ళిపోయాడు.

మా హనుమాయమ్మ పిన్ని స్క్రీన్ మీదకు రాగానే "మీ బాబాయ్‌కి కాదు. మీ పిన్ని పుర్రెలో పెట్టాల్సింది చిప్. లేకుంటే ఈ వయసులో చదువేంటీ... సంగీతమేంటీ" అన్నాడు.

"షి ఈజ్ మెంటల్లీ యంగ్" అన్నాను.

"అవును మేము ఓల్డ్" అన్నాడు.

ప్రోగ్రామ్ అయిపోయాక ఇద్దరం భోజనాలక్కూర్చున్నాం.

"ఏంటీ వంకాయిట్లా చేశావ్. టేస్టేలేదు" అని వంకాయ కర్రీ నెట్టేశాడు.

చట్నీ వేసుకున్నాడు "ఛీ... కారం" అని ఓ గ్లాసు నీళ్ళు గటగటా తాగేశాడు.

రసం ట్రైచేసి "ఇది రసమా... రసానికి పట్టిన శనా? ఇంత పుల్లగానా చేసేది" అన్నాడు ఓ వంక తింటూనే.

పెరుగు వేసుకుని ముఖం చిట్లించాడు. "ఇంత పల్చగా వుందేమిటీ... పైగా పాలవాసన" అన్నాడు.

'వంట చేయడమే రాదు. నువ్వేంటి స్టేజ్ లెక్కి స్పీచ్‌లివ్వడమేంటీ' అన్నది ఆ ప్రవర్తన యొక్క టీకా మరియు తాత్పర్యం. అతని మేల్ ఈగో అతన్ని ప్రాపర్‌గా ఆలోచించనివ్వడంలేదు.

ఇద్దరం పడుకున్నాక "ఇందాక కంపానియనేట్ ఎక్స్‌పెరిమెంటల్ మేరేజెస్ గురించి అడిగారుగా చెప్పనా" అన్నాను.

ఆయనేం మాట్లాడలేదు. పైగా కళ్ళు మూసుకుని అటుతిరిగి పడుకున్నాడు.

నేను వదలదలుచుకుంటేగా... అందుకే బలవంతంగా ఇటుతిప్పి చెప్పడం మొదలెట్టాను. "కంపానియనేట్ మేరేజ్ సిస్టమ్‌లో దంపతులకు పిల్లలు పుట్టలేదనుకోండి. మ్యూచువల్ కన్‌సెంట్ మీద విడిపోవచ్చు ఇద్దరూ ఎవరికివాళ్ళు ఇంకో పార్టనర్‌ని సెలెక్ట్ చేసుకోవచ్చు మళ్ళీ ఆ జంటలక్కూడా సంతానం లేదనుకోండి. మళ్ళీ విడిపోవచ్చు బెన్.బి. లిండ్‌సే అనే జడ్జ్ ఫ్రీ లవ్ కన్నా ట్రయల్ మేరేజ్ కన్నా ఈ మేరేజ్ బెటర్ అన్నాడు గానీ అపోనెంట్స్ దీన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. సంతానాన్ని సాకుగా పెట్టుకుని క్విక్ మేరీడ్... క్విక్ డైవోర్స్‌డ్ ట్రెండ్స్ డెవలప్ అవుతాయనీ, మేరేజ్ కున్న అసలు ఎయిమ్ దెబ్బతిని సెక్స్ బేస్డ్ అవుతుందనీ వాళ్ళ వాదన. అందుకే క్రమేణా ఇది డిజాల్వ్ అయిపోయింది. వింటున్నారా? " అన్నాను.

"ఆ..." అన్నాడు.

ఇక ఎక్స్‌పెరిమెంటల్ మేరేజ్‌లో ఆడా మగా పెళ్ళి కాకుండానే టెంపరరీగా కలిసుంటారు. మేరేజ్ కానివాళ్ళు మేరిటల్ లైఫ్‌ని గడపవచ్చు దీని ఎయిమ్ పెళ్ళికిముందే ఒకర్నొకరు అర్థం చేసుకోవడం. ఒకరితో ఒకరు అడ్జస్ట్ కాగలరా లేదా టెస్ట్ చేసుకోవడం. ఇద్దరి పర్సనాలిటీ ఒకదాన్తో ఒకటి సూటబుల్‌గా వుందా లేదా తెల్సుకోవడం. అన్నివిధాలా ఇద్దరూ సంతృప్తి చెందితే పర్మనెంట్ మేరేజ్ రిలేషన్స్‌లోకి ఎంటరవడం, ఒకరికొకరు నచ్చకపోతే గుడ్‌బై చెప్పుకుని విడిపోవడం ఇదీ ఎక్స్‌పెరిమెంటల్ మేరేజ్" అన్నాను.

"ఈ మేరేజ్... లేబొరేటరీలో అయితే బాగుంటుంది. సొసైటీలో కాదు" అన్నాడాయన.

"అందుకేగా ఇది అప్రూవ్ కాలేదు. ఎక్కడో నాగరికత వెర్రితలలు వేసే చోట తప్ప" అన్నాను. అలా అన్నాక ఓ క్షణం ఆగి, "అయితే పెళ్ళిని పవిత్రంగా భావించే మనలాంటివాళ్ళకన్నా ఎక్స్‌పెరిమెంట్‌గా తీసుకునే అలాంటివాళ్ళే బెటరనిపిస్తున్నారు" అన్నాను.

"ఏంటా వాగుడు? " అన్నట్టుగా భృకుటి ముడిచి చూశాడు.

"ఇది నగ్నసత్యం. వాళ్ళు కావాలనుకుంటే

కలిసుంటారు. వద్దనుకుంటే విడిపోతారు. దట్సాల్. ఆ చాప్టర్ అంతటితో క్లోజ్. బట్... మనం వద్దనుకుంటూ కలిసుంటాం. మానసికంగా ఒకరితో, శారీరకంగా ఇంకొకరితో కాపురాలు చేస్తాం. ఒకర్నొకరం ద్వేషించుకుంటూనే అసహ్యించుకుంటూనే ఒకే కప్పుకింద బతికేస్తాం"

అప్పుడడిగాడు మా ఆయన ఒక థౌజండ్ డాలర్ క్వశ్చన్. "ఏం నీ మనసులో ఇంకెవడైనా వున్నాడా? "

ఒక్క క్షణం మెదడుకు పెరాలిటిక్ స్ట్రోక్ వచ్చినదాన్లా అయ్యాను.

ఒక్క క్షణమే... మరుక్షణం మామూలయ్యాను.

మా ఆయనలాంటి వాళ్లనోటినుంచి అలాంటి మాటలు రావడం పెద్ద ఆశ్చర్యమేమీ కాదనుకున్నాను. అసలది నూటికి నూరుపాళ్ళూ ఆయన అడగాల్సిన ప్రశ్నే అని కూడా అనుకున్నాను.

ప్రశ్నకు జవాబు చెప్పాల్సిన బాధ్యత నామీద వుంది.

"ప్రశ్నవేశారు కదా. జవాబు వద్దా? " అన్నాను.

"ఏమండీ... మీరేనా ఇలా మాట్లాడేది. మనసావాచా కర్మణా మిమ్మల్నే నమ్ముకున్నదాన్ని. ఇదిగో అగ్నిసాక్షిగా మీరు కట్టిన తాళిబొట్టుమీద ఒట్టేసి చెపుతున్నా. నేనలాంటిదాన్ని కాదు. నా మనసు అద్దంలో మీ బొమ్మ తప్ప ఇంకొకరి బొమ్మలేదు" అంటాననుకున్నాడేమో నావంక ఆశగా చూశాడు.

నేను స్టబర్న్‌గా చూశాను.

"ఉంటే ఏం చెయ్యగలరు? "

కొలిమిలా మండుతున్న నా మనసు లోంచి ఓ నిప్పురవ్వ ఎగిరి ఆయన ముఖం మీద పడింది.

క్షణాల్లో ఆయన ముఖం నల్లగా మాడిపోయింది.

★ ★ ★

కిటికీ దగ్గర నిలబడి తదేకంగా బయటకు చూస్తున్న నన్ను "ఏంటీ... అంత దీక్షగా చూస్తున్నావు? " అనడిగాడు మా ఆయన.

అలా అడుగుతూనే నా వెనగ్గా వచ్చి నిలబడి నా చూపుల గాలంలో చిక్కుకున్నదేమిటాని డేగకళ్ళతో పరిశీలిస్తున్నాడు.

నా చూపులు గుచ్చుకుంటున్న ఆబ్జెక్ట్, భాస్కర్రావు. అయితే విషయం తెలియని భాస్కరరావు యమ సీరియస్‌గా బండి తుడుచుకుంటున్నాడు.

మా ఆయన నా వెనక నిలబడ్డం చూసి భాస్కర్రావుని నా చూపులతో మరింతగా తినడం మొదలెట్టాను.

మా ఆయనకి సీన్ అర్థమైందని నాకర్థమైంది.

అందుకే చిర్రెత్తుకొచ్చేలా ఓ డైలాగ్ కొట్టాను, "భాస్కర్రావ్ క్రాఫ్... వెరీ లౌలీ కదండీ. ఐ లైక్ దట్ స్టైల్"

ఆ మాటన్నాక మా ఆయనవంక చూశాను.

యద్దనపూడి సులోచనారాణి నవలల్లో కథానాయకుడికి మల్లే ఆయన ఎముక దవడ బిగుసుకుంది.

అంటే కోపం తారాస్థాయినందుకుందన్న మాట.

"వచ్చి టిఫిన్ పెట్టు" ఇంకోసారి దవడ ఎముక బిగిస్తూ అన్నాడు.

"అన్నీ అక్కడే వున్నాయ్. పెట్టుకుని తిందురూ" అన్నాను.

ఇవాళ ఆయనకు నేను బెడ్‌కాఫీ కూడా ఇవ్వలేదు. ఆయన ఎనిమిదింటికి లేస్తే నేను ఎనిమిదీ పదికి లేచాను. అదీ ఆయన నన్ను లేపబట్టి.

బెడ్ కాఫీ కాదుకదా... అసలు కాఫీ పెట్టే టైమే లేనట్టుగా నేరుగా వంటపనిలో పడ్డాను.

అది మొదటి షాకయితే... ఈ టిఫిన్

వ్యవహారం రెండో షాక్.

"వచ్చి పెట్టనంటావ్" అడిగాడు రెట్టిస్తూ.

"అబ్బ పెట్టుకుందురూ" ఇంచి కూడా కదలకుండా చెప్పాను.

ఏమనుకున్నాడో ఏమో... చరాలున వెళ్ళి పోయాడు. నేను క్రీగంట ఆయన్నే గమని స్తున్నాను. డైనింగ్ టేబుల్‌కి ఒక చివరన బోర్లించిన టిఫిన్ ప్లేట్లలోంచి ఓ ప్లేటు తీసుకుని టేబుల్‌మీద ఎత్తిపెట్టి కొట్టాడు. నాలుగు ఇడ్లీ పెట్టుకుని చేసిందాన్లో మూడొంతుల చట్నీ పైనే గుమ్మరించుకు న్నాడు.

నేను కిటికీ దగ్గర్నుండి రెండడుగులు మా ఆయనవైపు వేసి "అబ్బ! ఏం కల రండీ... భాస్కర్రావు షర్టుది. అతని కాంప్లె క్షన్‌కి అద్దినట్టూ సరిపోయింది. మీరూ అలాంటిది కొనుక్కోగూడదూ" అన్నాను.

నన్నోచూపు చూసి "కాఫీ వుందా?" అన్నాడు.

"లేటుగా లేచా కదండీ... కాఫీ పెట్టే టైమెక్కడుంది?" అన్నాను.

"కిటికీ చువ్వలకలా వేళ్ళాడే బదులు పెట్టొచ్చుగా" అంటాడనుకున్నా. ప్చ్... అన్లేదు. ముఖం మాడ్చుకుని లేచిపో యాడు. వాల్‌క్లాక్‌కేసి చూశాను. తొమ్మిది న్నర. ఇక లాభంలేదని కిటికీ చువ్వల్ని వదిలేసి ఇద్దరికీ లంచ్ ప్యాక్ చేశాను.

నేనూ టిఫిన్ చేయాలిగా వచ్చి కూర్చుని ఇడ్లీ పెట్టుకున్నాను. చట్నీవేసుకోబోతూ మా ఆయన్ని గావుకేక పెట్టాను.

డ్రెస్ చేసుకుంటున్నవాడల్లా ఆదరాబా దరా వచ్చాడు నా పవర్‌ఫుల్ కేక విని.

"ఇదేంటండీ... చట్నీ ఏమైంది? పాపం భాస్కర్రావుకి ఇష్టమని చెప్తే చేశాను. ఇంకేం పెట్టాలి ఈ కొంచెంలో" అన్నాను.

"మరేం ఫర్లేదు. నువ్వు కానివ్వు" అన్నాడు కక్షగా. నేను పూర్తిగా రెడీ అవక ముందే బైక్ కొట్టి నిలుచున్నాడు గుమ్మంలో అసహనంగా.

నేను కానిచ్చి మా ఆయన్తో ఆఫీసుకు బయలుదేరాను. బయలుదేరేముందు గుమ్మంలో నుంచుని నాకేసే చూస్తున్న శ్యామలకి కన్నుగీటాను.

ఆ పని పూర్తయ్యాక "పదండి" అన్నాను మా ఆయన వంక తిరిగి.

ఆ చిన్న గేప్‌లోనే మహా లోతుగా శ్యామల కళ్ళలోకి ఓ లుక్కేసుకుంటున్నాడు మా ఆయన.

అదేదో పాటలో అన్నట్లు 'ఎంత ఇనప లవ్వో' అనుకున్నాను. కాకుంటే నామీద ఓ వంక మండిపడుతూనే మరోవంక శ్యామల మీద స్నోఫాల్ కురిపించడం సాధ్యమా!

బైక్ ఎప్పటికంటే స్పీడుగా పోతోంది, మా ఆయన ఉక్రోషానికి సింబాలిక్ షాట్‌లా.

మొన్న రాత్రి మా ఆయన "ఇంతకీ నీ మనసులో ఎవడైనా వున్నాడా?" అన్న పుడు కొలిమిలా మండిన నా మనసు లోంచీ పుట్టుకొచ్చింది ఓ గరమ్ గరమ్ ఐడియా.

హింస... మానసిక హింస పెట్టాలి. భర్త పెడదారులు పడుతుంటే... ఓ భార్య మనసెంత గాయపడుతుందో అనుభవం లోకి తేవాలి. ఆ బాధ అనుభవించేలా చేయాలి.

నిన్న శ్యామలా నేనూ ఈ విషయంమీద చాలాసేపు డిస్కస్ చేసుకున్నాం.

నిద్ర లేచీ లేవగానే బెడ్‌మీదకు కాఫీ వస్తుంది. బద్ధకంగా లేచొచ్చి బాత్‌రూమ్ డోర్‌నానుకు నిలబడగానే బ్రష్‌మీదకు పేస్టూ, భుజంమీదకు టవలూ వస్తాయ్. సోప్‌బాక్స్ సైతం దానంతటదే తెరుచుకుం టుంది. ఆనక ఈజీ చెయిర్లో పడుకుని కాళ్ళూపుకుంటూ న్యూస్‌పేపర్ పఠిస్తుంటే టిఫిన్ ప్లేట్లోకొచ్చి పిలుస్తుంది. ఇంకో కప్పు కాఫీ గొంతులోంచి వెచ్చగా దిగుతుంది. ఇక లంచ్ ప్యాక్ రెడీ. ఆఫీసులో అరగంట వర్కూ రెండున్నర గంటల హస్కూ పూర్త

వగానే లంచ్ ప్యాక్ ఆకలి తీరుస్తుంది. ఇక సాయంత్రం సరేసరి... భూమి గుండ్రంగా వున్నట్టూ, కాఫీలూ, టిఫిన్లూ, భోజనాలూ మేజిక్ వేండ్‌తో మంత్రించినట్టూ ప్రత్యక్షం. బాదరబందీ లేని జీవితం. కోరుకున్నవన్నీ క్షణాల్లో అమరుతున్నప్పుడు మనసుకు బోలెడంత తీరిక.

తీరిక ఎక్కువైతే బోర్ కొడుతుంది. ఆ బోర్‌డమ్‌ని బ్రేక్ చెయ్యాలంటే కొత్తరకం ఎంటర్‌టైన్‌మెంట్ కావాలి.

ఫుల్ లెంగ్త్‌లో తృప్తినిచ్చే హాబీ... లేడీస్‌ని వాచ్ చెయ్యడం. వాచింగ్ అయ్యాక పెళ్ళాన్ని అమాంతం గుండెల్లోంచి తోసేసి పక్కింటివాడి పెళ్ళాన్నో, ఎదురింటివాడి ఉడ్‌బీనో మనసులో ప్రతిష్టించుకోవడం ఆనక కలలు కనడం, కలలో పలవరించడం, భార్య మనసును క్రషింగ్ మెషిన్‌లో పెట్టి క్రష్ చేయడం...

ఇదీ మగవాడి వరస. అయితే ఈ అనర్థమంతా భార్యవల్లనే. మాయలమరాఠీలా 'ఛూమంత్రకాళీ' అంటూ అయ్యగారి అవసరాలన్నీ తీర్చి అతనికి పనిలేకుండా చేసి, పనిలేనివాడి బుర్రను దెయ్యాల కార్ఖానాగా మార్చేది భార్యే.

సో... భర్త తీరికను భార్య కొల్లగొట్టాలి. అంతేకాదు భర్త పరాయి స్త్రీని ఆరాధిస్తున్నప్పుడు భార్య మనసెంత కలత పడుతుందో... అతనికి తెలిసివచ్చేలా చెయ్యాలి. తను పడుతున్న మానసిక హింసని అతను పడేలా ప్రవర్తించాలి.

అందుకే మేమిద్దరం కొన్ని కఠినమైన నిర్ణయాలు తీసుకున్నాం. వాటి అమలుకు ఇవాల్టినుంచే శ్రీకారం చుట్టాం. అందులో మొదటి అంకమే నేనిప్పుడు ప్రదర్శించింది. ఇక రెండవ అంకం శ్యామల ప్లే చేస్తుంది.

★ ★ ★

ఆఫీస్‌లో అడుగు పెట్టగానే సీతమ్మతల్లి ఓ గుడ్‌న్యూస్ చెప్పింది. "విజ్జీ! మా ఆయన ఆపరేషన్ చేయించుకుంటాట్ట. స్వయంగా తనే చెప్పారామాట"

"రియల్లీ" అన్నాను.

"అవును. నువ్వంటే నాకు పంచప్రాణాలు సీతా. ఎంత ప్రేమంటే నేను కాకుండా ఇంకెవరు నీవంక చూసినా నేను భరించలేను. తట్టుకోలేని ఆ బాధ కోపంగా మారుతుంది. ఆ కోపం నిన్ను అనుమానించేలా చేస్తుంది. అవమానించేలా చేస్తుంది. అందుకే ఆ చిప్పేదో నా మెదడులో అమర్చుకుంటే నా రాక్షస ప్రేమకు దైవత్వం వస్తుందేమో! నిన్ను నా దేవతలా చూసుకుంటానేమో అన్నాడు" సీత కళ్లలో నీళ్లు మెరిశాయి.

ఎ గ్రేట్ ఇంట్రాస్పెక్షన్! తనను తను ఎంతో గొప్పగా ఆత్మపరిశీలన చేసుకున్నాడు సీత మొగుడు.

సదస్సు మార్చిన తొలి మనిషా! ఏమో! ఇతనితోపాటూ ఇంకా ఎందరిలో పరివర్తన వచ్చిందో.

ఇతను... జస్ట్ ఫరెగ్జాంపుల్ లాంటివాడై వుంటాడు. సీతకంటే ఎక్కువ ఆనందమైంది నాకు.

"కంగ్రాచ్యులేషన్స్" అన్నాను.

"థేంక్యూ" అంది సీత.

"అద్భురే సీతమ్మ తల్లీ! మీ ఆయనన్న మాటల్ని అంత కరెక్ట్‌గా ఎట్లా కోట్ చేశావ్? " అన్నాను.

సీత అందంగా సిగ్గుపడింది. "అవి జస్ట్ ఆయన నోటివెంట వెలువడ్డ మాటలు కావు విజ్జీ... ఎన్నో ఏళ్ల తర్వాత ఆయన గుండెల్లోంచి పుట్టిన అనురాగపు వూటలు"

"ఎ స్మాల్ డౌట్... పరుచూరి బ్రదర్స్‌కి నువ్వు వేలు విడిచిన సిస్టర్‌వా? " అన్నాను.

సీత నవ్వింది. ఆ నవ్వులో దిగుల్లేదు.

"ప్చ్ సీత ప్రాబ్లం సాల్వ్ అయినట్టే. మా నాన్న మారేదెప్పుడో" అంది సత్యవాణి.

"ఓ పన్చెయ్. మీ నాన్న కీప్‌ను పట్టుకొచ్చి ఆమె బుర్రలో మైక్రోచిప్ పెట్టేద్దాం.

ఆ చిప్ ప్రోగ్రాం ఏంటో తెలుసా? మీ నాన్న కనబడితే చాలు ఆవిడ బడితెపూజ చేసేస్తుంది. దట్సాల్ ప్రాబ్లమ్ విల్ బి సాల్వ్‌డ్" అన్నాను.

నా జోక్‌ని సత్యవాణి ఎంజాయ్ చెయ్యలేదు.

"ఏం లాభంలేదు. మా నాన్న ఆవిడ్ని దిలి ఇంకో లేడీని పట్టుకుంటాడు" చెప్పింది దిగులుగా.

"సో... మీ నాన్న బుర్ర బద్దలు కొట్టట మొక్కటే మార్గమంటావ్" అన్నాన్నేను, సత్యవాణిని నవ్వించటానికి ప్రయత్నిస్తూ.

★ ★ ★

నేనూ శ్యామలా టెర్రస్‌మీద కూర్చుని వున్నాం. అది ప్లేట్‌నిండా చేగోడీలు పోసు కొచ్చింది. ఇద్దరం పోటీలమీద తింటూ కబుర్లలో పడ్డాం.

శ్యామల మొదలెట్టింది.

"నేనూ ఆయనా రాత్రి జగపతిబాబు సినిమా వస్తుంటే చూస్తున్నాం. నేను వున్న ట్టుండీ అన్నాను. ఎంతయినా జగపతి బాబు... ఎ స్మార్ట్ గై అన్నాను. నా వైపో చూపు చూసి మళ్ళీ సినిమాలో మునిగిపో యాడు. కొంచెం పాజ్ ఇచ్చి 'హౌ మేస్లీ హి ఈజ్' అన్నాను. ఈసారి ఇంకొంచెం చురుగ్గా చూశాడు. మళ్ళీ పాజ్ ఇచ్చి 'జగ పతిబాబు నా ఫేవరెట్ హీరో... ఐ లైక్ హిమ్" అన్నాను. ఈసారసలు నావైపు చూడలేదు. అప్పటికి హాఫ్‌బాయిల్డ్ అయ్యాడు. ఇక సిమ్‌లో కాదు... హైలో పెట్టాలనుకున్నాను.

"అరె! ఇన్నాళ్లూ నోటీస్ చెయ్యలేదు. జగ పతిబాబు అచ్చు మా విజ్జీ హజ్బెండ్‌లా వున్నాడు కదండీ" అన్నాను కొలంబస్ అమె రికాను కనుగొన్నంత ఆనందంగా.

మా ఆయన బాయిలింగ్ పాయింట్‌కి రీచ్ అవుతున్నాడు. ఇక ఆపలేదు. నేను "ఆ మీసకట్టు చూడండి. అచ్చు మధుకరే. ఆ వాయిస్‌లో రఫ్‌నెస్... వాకింగ్‌లో ఆ గ్రేస్, ఆ కళ్లలోని చిలిపితనం... ఆ పెదవు ల్లోని కొంటెతనం... ఆ స్మయిల్ ఆ స్టయిల్... మైగాడ్. నాకు స్క్రీన్‌మీద మధుకరే కన్పిస్తున్నాడు" ఎప్పుడో బాయి లింగ్ పాయింట్‌ని ఓవర్‌టేక్ చేశాడల్లే వుంది. మా ఆయన చెవుల్లోంచీ... ముక్కు లోంచీ...కళ్లలోంచీ ఒకటే పొగలు"

"ఇక చాల్లే ఆపవే" నవ్వాపుకోలేక అన్నాను శ్యామలతో.

"నేనాపేదేమిటి... ఆయనే ఆపేశాడు టి.వి. నేనొప్పుకోలేదు. జగపతిబాబు సినిమా చూసి తీరాలన్నాను. రిమోట్ నా ముఖాన కొట్టి ముసుగుతన్ని పడుకు న్నాడు. పడుకున్నాడేగానీ ఆయనకి నిద్రప ట్టడం లేదని నాకు తెల్సు. అందుకే ఓ రెండుసార్లు తట్టి మరీ లేపి... "ఈ ప్రొఫైల్లో జగపతి మధుకర్‌లా లేదూ... నా మాట అబద్ధమైతే చూడండి" అంటూ అమాయకంగా అడిగాను.

సినిమా ఆసాంతం చూసి... నాలో నేను అనుకుంటున్నట్టుగా "రేపు మధుకర్‌కి చెప్పాలి తను హీరో జగపతికి జిరాక్స్ కాపీ అని" అన్నాను. మా ఆయన తన్నిన ముసుగు ఏమాత్రం చెదరకుండా ఇట్నుంచి అటు తిరిగి పడుకున్నాడు. చెప్పడం ఆపి ఆఖరి చేగోడీ నోట్లో వేసుకుంది.

"మొత్తంమీద... నువ్వు, నేనూ... మన సిల్వర్ ఫిష్‌లకు మంచి డోసే ఇచ్చాం" అన్నాను.

"సిల్వర్ ఫిష్? " అంది శ్యామల.

"పుస్తకాల్ని కొరుక్కుతినే పురుగులవి. వీళ్ళూ ఆ పురుగుల్లా మన మెదళ్ళను తింటారుగా... అందుకే ఆ పేరు పెట్టా" అన్నాను.

"సూటబుల్ నేమ్" మెచ్చుకుంది శ్యామల.

"చిన్న చిన్న డోసులకూ... ఒకటి రెండు షాకులకూ జెర్కు అయ్యే టైప్ కాదు మన సిల్వర్ ఫిష్‌లు. ఛాంచి బూస్టర్ డోసో...

పవర్‌ఫుల్ షాకో త్వరలో ఇవ్వాలి" కసిగా అన్నాను.

ఆ తర్వాత మా మాటల్లోకి సీతా... ఆమె భర్తా... సత్యవాణీలాంటి వాళ్ళంతా ఎంటరయ్యారు. ఫైనల్‌గా రేపు మా ఆయ నకెట్లాంటి డోసివ్వాలో... అది వాళ్ళాయన కెట్లాంటి షాకివ్వాలో డిస్కస్ చేసుకుని టెర్రస్‌మీంచి దిగాం.

★ ★ ★

"నమ్మలేకపోతున్నా డాక్టర్" అన్నాను ఆయనవంక ఆశ్చర్యంగా చూస్తూ.

"నమ్మాలి" అన్నాడు డాక్టర్ పురుషో త్తమ్. ఆయన ముఖంలో ఎనలేని తృప్తి. కళ్ళలో సంతోషం.

"సో...ఫార్... హండ్రెడ్ అండ్ ట్వెంటీ మెంబర్స్ అండర్ గాన్ దిస్ ఆపరేషన్" ఆయన మళ్ళీ చెప్పాడు.

నేనూ, శ్యామలా ఓ ఆదివారం ప్లాన్ చేసుకుని డాక్టర్ని కలిశాం. ఆ రోజైతే ఆయన కాస్త తీరిగ్గా వుంటాడని.

"ఒక్క నెలలోనే? " అన్నాను.

"ఆ... ఒక్క నెలలోనే" అన్నాడు.

"అంటే. సుమారు నూట ఇరవై కుటుం బాలు...సిలికాన్ కుటుంబాలుగా మారిపో యాయి"

"ఎగ్జాట్లీ... ఒన్ హండ్రెడ్ అండ్ ట్వెంటీ ఫ్యామిలీస్"

"మీ పిన్నిగారే... పదికేసులు రెకమండ్ చేశారు. షిఈజ్ వెరీ ఇంట్రెస్టింగ్ పర్సనా లిటీ" మెచ్చుకున్నాడాయన.

"డాక్టర్... అప్పుడెవరో మీకు లీగల్ నోటీస్ ఇచ్చారు...ఏమైంది? " అడిగింది శ్యామల.

"మన సదస్సుకు జడ్జిగార్ని చీఫ్ గెస్ట్‌గా ఇన్‌వైట్ చెయ్యమని నువ్వే కదమ్మా సలహా ఇచ్చావ్! నీ ఐడియా అద్భుతంగా పనిచేసింది. మనం చేస్తున్న పనిలోని ఔన్నత్యాన్ని ఆరోజే గుర్తించారాయన. మొదటి హియరింగ్‌లోనే కేస్‌ని కొట్టేశారు. అంతేకాదు... ఈ ఆపరేషన్లని లీగలైజ్ చేస్తున్నట్టు డిక్లరేషన్ కూడా ఇచ్చేశారు"

"హౌ నైస్" ఎగ్జయిటింగ్‌గా అన్నాను.

"రియల్లీ... ఇట్స్ నైస్" నవ్వాడాయన.

"డాక్టర్... మాకు ట్రీట్ ఇవ్వాలి? " డిమాండింగ్‌గా చూసింది శ్యామల.

"ష్యూర్... టు బి ఫ్రాంక్. ఈ విజయం మీది... యు ఆర్ మై గాడ్ మదర్స్"

ఆయన మాటలకు ఇద్దరం నవ్వాం.

"చెప్పండి... ఏంకావాలి? " అడిగాడా యన.

"డాక్టర్... జస్ట్ జోక్ చేశానంతే... ఏంవద్దు" అంది శ్యామల.

"నో" అన్నాడాయన. "కాసేపు ఈ హిపో క్రసీ ముసుగు తీసి పక్కన పెడదాం. నౌ వి ఆర్ గుడ్ ఫ్రెండ్స్... లెటజ్ గో సమ్ వేర్... స్టార్ హోటల్? " నేను శ్యామల వంక చూశాను.

శ్యామల మెల్లగా నన్ను గోకి అంది. "మన సిల్వర్ ఫిష్‌లు కంగారు పడతా యేమో"

"అవునుకదా! వెరీగుడ్... అయితే మనం తప్పకుండా వెళ్ళాలి" అన్నాను.

శ్యామల నా ఆంతర్యం అర్థం చేసుకుంది.

"మీ ఇష్టం డాక్టర్. ఎక్కడికైనా సరే" అంది.

నగరంలోనే పేరుపొందిన ఒక న్యూరాల జిస్ట్... మెడికల్ ఫీల్డ్‌లో సరికొత్త ప్రయో గాలు చేసిన ఒక సైంటిస్ట్... కంప్యూటరైజ్డ్ ఆపరేషన్ ద్వారా పేరు తెచ్చుకున్న ఒక ప్రముఖ సర్జన్...

ఒక మామూలు వ్యక్తిలా... జస్ట్ ఫ్రెండ్‌లా మా వెంట బయలుదేరు తుంటే... ఎంత ఎగ్జయిట్ అయిపోయా మంటే... లిటరల్లీ... వి... వెంట్ బాక్ టు అవర్ కాలేజ్ డేస్"

నేనూ, శ్యామలా డాక్టరుగారి మెర్సిడస్‌లో బయలుదేరాం. కారు ఆయనే డ్రైవ్ చేస్తు న్నారు. ఓ అరగంటలో హోటల్లో వున్నాం.

ఎప్పుడో పెళ్ళయిన కొత్తల్లో... ఓసారి మధుకర్, నేనూ వెళ్లాం స్టార్ హోటల్‌కి. మళ్ళీ ఇదే వెళ్ళడం.

అక్కడి మెనూ... గురించి మాకంత నాలెడ్జ్ లేదు గనక... ఐటమ్స్ ఆర్డరిచ్చే భారం డాక్టర్‌కే వదిలేశాం.

ఫస్ట్ సూప్ సప్లయ్ చేయబడింది.

దాన్ని సిప్ చేస్తూ వున్నప్పుడు... ఎప్పుడూ రాని ఓ ఆలోచన వచ్చింది నాకు. డాక్టర్ పురుషోత్తమ్ ఫ్యామిలీని ఎప్పుడూ చూడలేదు నేను. ఆయన మా హనుమాయమ్మ పిన్ని తరపు బంధువుగా నాకూ బంధువేగానీ... ఆ సెన్స్‌లో ఆయన్నెప్పుడూ చూడలేదు. కనీసం ఆయన ఫ్యామిలీ గురించి మా పిన్నికైనా తెలుసో లేదో కూడా నేనెప్పుడూ ఎంక్వయిరీ చెయ్యలేదు.

"డాక్టర్" పిల్చాను.

"వాట్ మేడమ్" అన్నాడు నవ్వుతూ.

"మీకు వీలైనప్పుడు మీ ఫ్యామిలీని మాకు పరిచయం చెయ్యరూ"

"అదెప్పటికీ వీలుకాదు" టక్కున చెప్పాడాయన.

చివుక్కుమంది మనసు. ఇక అక్కడ ఏ ఐటమూ తినబుద్ధికాలేదు. ఎందుకడిగాన్రా దేవుడా... అని నన్ను నేనే వెయ్యిసార్లు తిట్టుకున్నాను.

శ్యామల కూడా బాగా ఫీలయినట్టుంది. ఏం మాట్లాడకుండా కూర్చుంది. ఆయనదేం పట్టించుకోలేదు. అదీ, ఇదీ ఉత్సాహంగా మాట్లాడుతున్నాడు.

హోటల్ బయటకొచ్చాక ఆయన కారెక్కమన్నప్పుడు మాత్రం సున్నితంగా తిరస్కరించాను. అవతలి వాళ్ళక్కూడా హార్ట్ వుంటుందనీ అది హర్ట్ అవుతుందనీ ఈ సిలికాన్ ఫ్యామిలీ బ్రహ్మకు తెలీదూ!

"వైడోంట్ యు? ఐ విల్ డ్రాప్ యు బోత్" అన్నారు.

"నో థేంక్స్" అన్నాను.

"యాజ్ యు లైక్" అనేసి వెళ్ళిపోయాడాయన.

"ఛ... ఈ అరిస్టోక్రట్ మనుషుల ప్రవర్తన ఎప్పుడు ఎలా వుంటుందో చెప్పలేం. ఇది ఫ్రెండ్‌షిప్పో... షో ఆఫో ఏమీ అర్థం కావడంలేదు" సణుక్కున్నాను.

"అర్థం కాకపోవడానికిందులో ఏముంది? ట్రీట్ అడిగాం. మర్యాదగా ఒప్పుకున్నారు. దిసీజ్ మై స్టేటస్ అని చెప్పడానికి స్టార్ హోటల్‌కి తీసుకొచ్చాడు. లిమిట్స్ దాటాం. నోర్మూసుకోమన్నారు. దట్సాల్" అంటూ అనలైజ్ చేసింది ఆయన బిహేవియర్ని శ్యామల.

అంతేలే. ఆయన పర్సనల్ మేటర్స్ మనకెందుకు? " అని నాకు నేను సర్దిచెప్పుకున్నాను.

ఇద్దరం ఆటో చేసుకుని ఇంటికొచ్చాం.

"ఎక్కడికెళ్ళావే అమ్మాయ్" అంటూ మా ఇంట్లోంచి ఎదురొచ్చింది హనుమాయమ్మ పిన్ని.

"డాక్టర్ పురుషోత్తమ్‌గారు హోటల్లో ట్రీట్ ఇచ్చారు పిన్నీ. అదీ మామూలు హోటల్లో కాదు స్టార్ హోటల్లో" మా ఆయన్ని క్రీగంట గమనిస్తూ చెప్పాను.

"సర్లె... సర్లె...రాక రాక వచ్చిందావిడ ఏమైనా చేసి పెట్టు" అన్నాడు. హేండ్‌బేగ్ టేబుల్ పైన పడేసి ఫ్రెష్ అప్ అయి వచ్చాను.

ఈలోపు మా పిన్ని కాఫీ పెట్టింది నాకో కప్పు. మా ఆయనకో కప్పు ఇచ్చి... తను మాత్రం ఓ పొడవాటి గ్లాసునిండా పోసుక్కూర్చుంది.

"ఓ పెద్ద గ్లాసుడు కాఫీ పడందే తాగినట్టుండదే అమ్మాయ్... పాడు ప్రాణం అలవాటైపోయింది" అంది.

"నువ్విప్పుడు గ్లాసుడు కాఫీ తాగితే మళ్ళీ రేపు ఉదయం తాగుతావ్. మేమట్లాకాదే... గంటకో కప్పు వంతున ఓ చెంబుడు తాగుతాం. ఇంతకీ పిన్నీ నీకేం కావాలో చెప్పు వండేస్తా" అన్నాను.

"నేవెళ్ళిపోతానే... మీ బాబాయ్ ఎదురుచూస్తూ వుంటాడు" అందామె. అప్పుడు సాయంత్రం ఏడవుతోంది.

"ఎక్కడికీ వెళ్ళేది? రేపుదయం వెళ్దాగానీలే. కావాలంటే మా బాబాయ్‌ని కూడా రమ్మని ఫోన్ చేస్తాను" అన్నాను.

"అప్పుడు మాధవి ఒక్కత్తేగా వుండాలి" అంది.

"దాన్ని కూడా రమ్మంటాను"

"ఇంకోసారి వస్తాంలేమ్మా. ఏదీ నువ్వేదైనా విశేషం చెబుతావంటే... ఊc...హుc... ఆ వూసే ఎత్తవ్" అంది.

"అద్సరే కానీ... కనీసం భోంచేసి వెళ్ళు మీ అబ్బాయి డ్రాప్ చేస్తాళ్ళే" అన్నాను.

దానికి ఒప్పుకుందావిడ.

ఇద్దరం కలిసి వంటపనిలో పడ్డాం, సరదాగా కబుర్లు చెప్పుకుంటూ.

మా వారికీ ఆమెకీ వడ్డించాను.

"నువ్వో" అంది.

"పురుషోత్తమ్‌గారిచ్చిన ట్రీట్‌తో ఇక రెండ్రోజులు ఇట్లాగే వుండొచ్చు ఎన్ని ఐటమ్స్ ఆర్డర్ చేశాడో ఆయన. తినలేక చచ్చామనుకో నేనూ శ్యామలా" అన్నాను.

అట్లా అంటుంటే చటుక్కున గుర్తుకొచ్చింది. పురుషోత్తమ్ ఫ్యామిలీ గురించి అడగాలనే విషయం.

"అవును పిన్నీ... పురుషోత్తమ్‌గారి భార్యా పిల్లల్ని నువ్వెప్పుడైనా చూశావా? " అన్నాను.

ఓ గుక్కనీళ్ళు తాగి చెప్పిందావిడ "ఎక్కడున్నారు భార్యాపిల్లలు! పెళ్ళయిన ఏడాదికే కార్ యాక్సిడెంట్‌లో పోయింది భార్య"

నమ్మలేని నిజాన్ని వింటున్నట్టూ చూశాను.

"ఇక అప్పటినుండీ ఒంటరిగాడే పురుషోత్తమ్. ఎంతమంది పోరుపెట్టినా మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు. చదువులనీ పరిశోధనలనీ వ్యాపకాలు పెట్టుకుని జీవితాన్ని అల్లాగే సాగించాడుగానీ, మహానుభావుడు ఇంకో ఆడదానివంక కన్నెత్తి చూడలేదు"

నా మనసు ఆర్ద్రమైంది.

"మీ ఫ్యామిలీని పరిచయం చెయ్యరూ" అని నేనడిగినప్పుడు "అదెప్పటికీ వీలుకాదు" అంటున్న ఆయన స్వరమే గింగుర్లాడిపోయింది నా చెవుల్లో.

తనకంటూ ఫ్యామిలీ లేదుగాని... ఇతరుల ఫ్యామిలీస్‌ని నిలబెట్టే బాధ్యత చేపట్టారు. ఎంత గొప్ప వ్యక్తిత్వం!

"పెరుగు వెయ్" అన్నాడు మా ఆయన.

పెరుగు వేస్తూ 'ప్చ్... కొందరికి సొంత ఫ్యామిలీని నిలబెట్టుకోవాలన్న బాధ్యత కూడా వుండదు. పురుషోత్తమ్‌లాంటివాళ్లు భార్య పోయినా ఆమె మధురస్మృతులతో కాలం గడుపుతుంటే ఇదుగో మా ఆయన లాంటి వాళ్ళు భార్య వున్నా... పక్కింటివాడి పెళ్ళాం జ్ఞాపకాలతో తలమునకలవుతున్నారు' మనసులో అనుకుని నిట్టూర్చాను.

★ ★ ★

చీకటిలో లేచి పాయసం, పులిహోరా చేసేశాను. వెజిటబుల్ బిరియానీ చేస్తున్నప్పుడు మసాలా వాసనకి అదిరిపోయి లేచి కూర్చున్నాడు మా ఆయన.

అలవాటుకు విరుద్ధంగా లేవగానే వంటగదిలోకొచ్చి "ఏంటివాళ స్పెషాల్టీ? " అన్నాడు.

"బర్త్‌డే... అవునూ.. పాయసం... పులిహోరా... బిరియానీ చాలుగా. పోనీ కాసిని చిప్స్ వేయించనా... పూరీ చెయ్యమంటారా? "

మా ఆయనోక్షణం తలగోక్కుని.

"నా బర్త్‌డే జనవరి ఆరు. నీది జూలై పదిహేను పొరబడ్డావా? " అన్నాడు.

"అయ్యో... మీదీ... నాదీ కాదండీ. భాస్కర్రావుది" చివరిపదం మృదుమధురంగా ఉచ్చరించాను.

నా సమాధానం మా ఆయన తలని గిర్రున తిప్పేస్తుందని నాకు తెలుసు.

"ఎవరిదీ? " అన్నాడు తన చెవుల్ని తనే నమ్మలేక.

"భాస్కర్రావుది" అన్నాను, ముఖంలో

సిగ్గులాంటి ఎక్స్‌ప్రెషన్ ఇచ్చి అంతే... ఒక్కమాట కూడా మాట్లాడలేదు. బెడ్ కాఫీ కూడా అడగలేదు. నేరుగా బాత్‌రూమ్‌లోకి వెళ్ళిపోయాడు. నా మాటల్తో బుర్ర వేడెక్కిందేమో. షవర్‌బాత్ చేశాడు.

ఇదివరకైతే తల తుడిచే బాధ్యత నాదే. చక్కగా చెయిర్లో కూర్చోబెట్టి తలమీదో టవల్ దిగేసి పదినిమిషాలపాటూ రబ్ చేసేదాన్ని. అయితే దాన్నెప్పుడూ నేను బాధ్యతగా భావించలేదు. ప్రేమతో చేసేదాన్ని. అసలు నన్నడక్కుండా ఎప్పుడైనా ఆయనే తుడుచుకున్నా ఒకలాంటి వెలితిగా వుండేది. ఎట్ టైమ్స్ అలిగేదాన్ని కూడా.

ప్రస్తుతం అలాంటి ఫార్మలిటీస్ అన్నీ మూటగట్టి పక్కన పడేశా.

లుంగీ కట్టుకుని హాల్లో సోఫాలో కూర్చున్నాడు మా ఆయన. ఇదీ అలవాటుకు విరుద్ధమైన చర్యే. మామూలుగా అయితే న్యూస్ పేపర్‌కి రంధ్రాలేసుకుని వరండాలో ఈజీ చెయిర్లో కూర్చోవాలి. అన్నట్లు ఈమధ్య మా ఆయన రంధ్రాన్వేషణ కార్యక్రమం కొంతకాలంగా వాయిదావేశాడు. రంధ్ర సన్యాసం అంటారేమో! మొన్నీమధ్య పాతపేపర్లబ్బాయి కూడా "ఎలుకల మందు పెట్టారా ఏందమ్మా... పేపర్లు సుబ్బరంగా వున్నాయ్" అన్నాడు.

"మరీ అంత కసాయిదానిలా కనబడుతున్నానా? " అన్నాను.

వాడో చూపు చూసి తనపని తను చేసుకుని వెళ్ళిపోయాడు.

"కాఫీ ఇవ్వు" అన్నాడు సీరియస్‌గా.

పోన్లే పాపం అని ఓ కప్పుకాఫీ పట్టుకెళ్ళి ఇచ్చి అన్నాను. "భాస్కర్రావ్ సీషోర్‌కి వెళదామంటున్నాడు. ఆఫీస్‌కి లీవ్ పెట్టెయ్యండి" అన్నాను.

"నువ్వు పెట్టావా? " అన్నాడు ఇంకాస్త సీరియస్‌గా.

"నేనాల్రెడీ పెట్టేశాను. నాల్రోజుల ముందునుంచే భాస్కర్రావు పోరుతున్నాడు సీషోర్ కెళ్దామని" అన్నాను.

"నేన్రాను" మరీ సీరియస్‌గా అన్నాడు.

"ప్లీజ్ రండీ" అన్లేదు నేను. "సరే కేరేజ్ సర్దమంటారా? " అన్నాను.

"నువ్వు? " అన్నాడు యమసీరియస్‌గా.

"నేవెళ్తున్నా" కన్‌ఫర్మ్‌డ్‌గా చెప్పాను.

"నేన్రాకపోయినా? " ఈసారి సీరియస్‌గా కాదు క్యూరియస్‌గా అడిగాడు.

"వెళ్ళకుంటే భాస్కర్రావు బాధపడ్తాడు" అన్నాను.

"వెళ్తే నేను బాధపడతాను" అన్లేదాయన. అనడు కూడా. భార్య కోసం బాధపడితే ఎంత నామర్దా!

ఆయనమీదో కన్నేసి ఒంటికంటితోనే పనులన్నీ చక్కబెడ్తున్నాను. చెంపకు చెయ్యి చేర్చి కాసేపు గుమ్మంకేసి చూస్తూ కూర్చున్నాడు. ఇంకాసేపు కిటికీకేసి చూశాడు. మరి కాసేపు టీపాయ్‌కేసి చూశాడు. ఆనక సీలింగ్‌కేసీ, నేలకేసీ, గోడలకేసీ చూసీచూసీ చివరగా గోళ్ళకేసి చూస్తూ వుండిపోయాడు.

నేను ఐటమ్సన్నీ ప్లాస్టిక్ బుట్టలో సర్ది... మేకప్ అయిపోయాను.

కేరేజ్ సర్ది... డైనింగ్ టేబుల్ మీద పెట్టాను. "టిఫిన్ చేస్తారేమో కానివ్వండి మరి" అన్నాను.

మా ఆయన లేచి డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చున్నాడు "ఏదీ టిఫిన్? " అన్నాడు కేస్‌రోల్స్ మీద మూతలు తీసి చూస్తూ.

"మళ్లీ ప్రత్యేకించి ఏం చెయ్యనండీ. కాస్త పులిహోరో, బిరియానో పెట్టుకు తినండి. ఇవాళ్టికదే టిఫిన్" అన్నాను.

కాస్త పులిహోర... తనే వడ్డించుకున్నాడు. తింటూ... తింటూ నేను కట్టుకున్న చీరకేసి కళ్లు చిట్లించి చూశాడు.

"ఇదెప్పుడు కొన్నావ్? " అన్నాడు.

నా చీరలన్నీ మా ఆయనకి గుర్తే, బట్టలు కొనాలంటే ఇద్దరం కల్సే షాపింగ్ చేస్తాం. కొందరాడవాళ్లలా భర్తలకు తెలీకుండా చీరలు కొనే అలవాటు నాకెందుకో

గానీ లేదు. ఒకవేళ ఆయన ఆబ్సెన్స్‌లో ఏదైనా కొన్నా వెంటనే చూపిస్తాను.

అదీగాక మా ఆయనకు సిక్స్త్ సెన్స్‌లాగా ఓ ఎక్స్‌ట్రా సెన్స్ వుంది. నాకున్న చీరల రంగులూ, డిజైన్లూ... కళ్లు మూసుకుని చెప్పేస్తాడు. అవి కొన్న డేట్లూ సందర్భాలు ఇంకా క్లాత్ టెక్శ్చర్‌తో సహా. ఫరెగ్జాంపుల్ ఎక్కడికైనా వెళ్లాలనుకున్నప్పుడు "విజ్జీ బాదల్ వర్క్ చేసిన లైట్ బ్లూ షిఫాన్ శారీ లేదూ...



ఫిబ్రవరి ఆరో తారీఖున మీ పిన్ని వాళ్లింటికెళ్లొస్తూ కొన్నామే ఆ చీర... అది కట్టుకో" అంటాడు.

బహుశా ఈ శారీ సెన్సేనేమో మా ఆయన మనసును అదర్ లేడీస్ దోచుకునేలా చేసింది.

నేను మౌనంగా వుండటం చూసి మళ్లీ అడిగాడు "ఎప్పుడు కొన్నావీ శారీ? "

నేనొక్కక్షణం తటపటాయిస్తున్నట్టుగా చూసి "ఇదీ ఇదీ... భా..." అంటున్నానో లేదో భాస్కర్రావు కొత్త బట్టల్లో తళతళలాడుతూ వచ్చాడు సతీసమేతంగా. రావడం రావడం ముందు నా వంకే చూసి "రెడీనా? " అన్నాడు.

"నేను రెడీనే. మీ ఫ్రెండ్ రానంటున్నారు" అన్నాను.

"వ్వాట్... నా పుట్టిన్రోజునాడు నేను పిలుస్తుంటే రానంటావా? " అన్నాడు మా ఆయన వంక చూస్తూ.

"ఆఫీస్‌లో అర్జంట్ ఫైలొకటి చూడాలి" అన్నాడు మా ఆయన నా చీరకేసీ భాస్కర్రావు ఫేసుకేసీ మార్చిమార్చి చూస్తూ.

శ్యామల ముఖం చిన్నబుచ్చుకుంది. "నాకూ హెడేగ్గా వుంది. రాలేనేమో" అంది మా ఆయన్ని అదోలా చూస్తూ.

వాళ్లాయన ముఖం వాడిపోవటం మా ఆయన ముఖంలో పూలు పూయటం ఎట్ ఎ టైమ్ జరిగాయి.

అన్న తర్వాత మా ఆయన్ని అప్పుడే గమనించినట్టు చూస్తూ.

"అరె! అచ్చు మీరేసుకున్న షర్ట్‌లాంటిదే ఎవరి ఒంటిమీదో చూశానే... యస్ కబడ్డీ కబడ్డీలో జగపతిబాబు 'గోరువంకా గోదారివంకా ఈతకెళదాం వస్తావా' అనే పాటలో సేమ్‌టుసేమ్ ఇట్లాంటిదే వేసుకున్నాడు. ఎంత నచ్చిందో నాకీ షర్ట్ ఆ సిన్మాలో..." అంది.

ముందే పూలు పూసిన మా ఆయన ముఖంలో సుగంధాల చిరునవ్వు విరిసింది.

"అర్జంట్ వర్కే... సర్లే... పదండి" అన్నాడు శ్యామల శారీ డిజైన్ని కళ్లతోనే బ్లూప్రింట్ తీస్తూ.

"అరె! హెడేక్ పోయిందే... ఇట్స్‌గాన్" అంది శ్యామల భాస్కర్రావు వంక తిరిగి.

"మరి బయల్దేరదామా? " అన్నాడు భాస్కర్రావు... పళ్లు కొరికితే బాగోదని మా ఆయన చూడకుండా పిడికిళ్లు బిగిస్తూ.

నీళ్లలో దాదాపు రెండు గంటలనుండీ నానుతున్నాం. అలలతో పాటూ...

పడుతూ... లేస్తూ ఆడుతున్నాం. ఫస్ట్ హాఫ్‌లో భాస్కర్రావు షరా మామూలుగా నా దగ్గరగా మసులుతూ నీళ్లలో కావాలని పడిపోయాడు. మా ఆయన చూసేట్టుగా చెయ్యందించి లేపాను.

నాకేసి గుడ్లురుముతూ చూస్తున్న మా ఆయన వెనకొస్తున్న అలలను గమనించ లేదు. ఢామ్మని పడ్డాడు. అవకాశం కోసం కాచుక్కూర్చున్న శ్యామల రెస్క్యూస్క్వాడ్‌లా ముందుకు దూకి మా ఆయనకి చెయ్యందించింది వాళ్లాయన చూసేలా.

భాస్కర్రావు మా ఆయనలాగే గుడ్లురమ బోయి మళ్లీ నీళ్లలో పడ్డాడు. నేను మళ్లీ హేండిచ్చాను. సారీ హేండ్ అందించాను. శ్యామల... నాకు దగ్గరగా వచ్చి "గేమ్ ఇంట్రస్టింగ్‌గా వుంది. కాసేపు కంటిన్యూ చేద్దామా" అంది.

"విత్ ప్లెజర్" అన్నాను.

అయితే వాళ్లాయనా... మా ఆయనా జరిగే ప్రమాదం తెలుసు కనుక గుడ్లురుమటం లాంటివి మానేసి రిలాక్స్‌డ్‌గా కెరటాల్లో కేరింతలు కొడుతున్నారు.

ఇక సెకెండ్ హాఫ్‌లో ఒడ్డుకొచ్చేసి చెట్ల నీడలు వెతుక్కుని చేరగిలపడ్డాం. సముద్రపు గాలికి బట్టలు వాటంతటవే ఆరుతున్నాయి.

నా తడిసిన అందాలు భాస్కర్రావు చూడకుండా మా ఆయనా శ్యామల ఒంపులు మా ఆయన చూడకుండా భాస్కర్రావూ మాకడ్డంగా కూర్చుని రీసెంట్‌గా వస్తున్న సినిమాల గురించి కాసేపు బాతాఖానీ వేశారు.

పది నిమిషాల్లో ఆరిపోయాయి బట్టలు. నేలమీద రెండు బ్లాంకెట్స్ పరిచి మేం తెచ్చిన ఫుడ్ ఐటమ్స్, ప్లాస్టిక్... ప్లేట్సూ... వాటర్ బాటిల్సూ దాని మీద సర్దాం.

శ్యామల గులాబ్ జామూన్లూ, మొన్న చేసిన చేగోడీలు, యాపిల్సు, ఆరెంజెస్ కేకూ తెచ్చింది. కేకు మీద ఓ కాండిల్ వెలిగించాం. సముద్రపు గాలికి నిలవలేదని మొత్తం మీద అందరి చేతులు అడ్డం పెట్టి మళ్లీ వెలిగించాం. భాస్కర్రావు ఆ కేండిల్‌ని ఉఫ్ అంటూ వూదేసి... నా ముఖంలోకి చూసి నవ్వాడు. నేనూ, శ్యామలా చప్పట్లు కొడుతూ హేపీ బర్త్‌డే... టూయూ అంటూ పాడాం. మా ఆయన మాత్రం పాడలేదు. ఇక తిండి మీద పడ్డాం. నేను భాస్కర్రావుకి కొసరికొసరి బిరియానీ వడ్డిస్తుంటే శ్యామల మా ఆయనకి యాపిల్స్ చెక్కుతీసి ముక్కలు చేసి మరీ అందించింది. గులాబ్‌జామూన్లు వద్దంటున్నా ఆఫర్ చేసింది.

నేను పెట్టిన బిరియానీ భాస్కర్రావుకి చవులూరిస్తూ ఓ పక్క శ్యామల మా ఆయనకి పెడుతున్న యాపిల్ ముక్కలు వెక్కిరిస్తూ ఓ పక్క.

సరిగ్గా మా ఆయన పరిస్థితీ అదే. శ్యామల పెట్టిన గులాబ్ జామూన్ల రుచి ఓ వంక అనుభవిస్తూనే భాస్కర్రావుకి బిరియానీ తర్వాత పులిహోర పెడుతున్న నన్ను ఆందోళనగా చూస్తున్నాడు.

ఓ కంట కన్నీరు మరో కంట పన్నీరు అంటే ఇదేనేమో!

మాక్కాస్త దూరంలో ఇంకో పిక్నిక్ పార్టీ కూర్చుని వుంది. వాళ్లు టేప్‌రికార్డర్ కమ్ రేడియో తెచ్చుకున్నారల్లేవుంది. రేడియోలో అనుకుంటా. "ఇంతేరా ఈ జీవితం బతుకే రంగులరాట్నం" అంటూ పాడుతున్నాడు ఘంటసాల.

"బిరియానీ మీ బర్త్‌డేకని స్పెషల్‌గా చేశాను. బాగుందా?" అనడిగాను భాస్కర్రావుని.

"అద్భుతం" అన్నాడు భాస్కర్రావు.

"ఉప్పు తక్కువ" అన్నాడు మా ఆయన.

"చేగోడీలు ఎట్లా వున్నాయ్?" అంది శ్యామల మా ఆయన్తో.

"వెరీ టేస్టీ" అన్నాడు మా ఆయన.

"ఉప్పెక్కువ" అన్నాడు భాస్కర్రావు.

లాస్ట్ ఐటమ్‌గా నాలుగు గాజు గ్లాసుల్లో పాయసం పోశాను.

"ఈ ఐటమ్ మాత్రం రియల్లీ ఫర్ యు... అందరికీ మీ చేత్తో ఇవ్వండి" అన్నాను.

"మాకూ చేతులున్నయ్" అన్నాడు మా ఆయన నాకు మాత్రం వినబడేలా. భాస్కర్రావు తలో గ్లాసూ అందించి... తనూ ఓ గ్లాసు తీసుకున్నాడు. ఓ సిప్ తీసుకుని "ఇదీ పాయసమంటే" అన్నాడు.

"నాకు హెవీగా వుంది. తాగలేను" అంటూ మా ఆయన గ్లాసు పక్కన పెట్టేశాడు.

"ఏంటి మనసా? " అనుకున్నాను.

"ఆరెంజెస్ ఒలిచి పెడతానుండండి. భోజనం తర్వాత తింటే ఒంటికి మంచిది" అంటూ శ్యామల కాయ ఒలిచి తొనలు తీసి అందించడం మొదలెట్టింది మా ఆయనకి.

ఇక భాస్కర్రావు హెవీ అయ్యాడు. సగం గ్లాసు పాయసం వదిలేశాడు.

ఓ గంటాగంటన్నర... చెట్ల నీడలోనే స్పెండ్ చేసి మళ్లీ సముద్రంలోకి వెళ్లాలనుకున్నాం.

కాసేపు కూర్చున్నాక నేనూ, శ్యామలా వాళ్లనక్కడే వదిలేసి తీరం వెంట అట్లా వెళ్లాం. గవ్వలేరుకోవాలంటూ...

"మరీ ఏడ్పిస్తున్నామా? " అంది శ్యామల.

"జస్ట్... పసిబిడ్డను గిల్లినంత" అన్నాను.

"కనీసం చీమకుట్టినట్టు కూడా కాదా? " అందది.

"ఇక చీమలూ... దోమలూ... కుడితే చాలదు. ఏకంగా ఏ తేలో కుట్టాలి" అన్నాను.

"ఏం చేద్దాం? " అంది శ్యామల.

"కీప్ థింకింగ్" అన్నాను.

నేనూ అదీ మొత్తం మీద చాలా గవ్వలే ఏరాం. ఇక చాలనుకుని తిరిగి వస్తున్నప్పుడు స్ట్రయిక్ అయింది ఓ ఐడియా.

మెల్లగా శ్యామలకు చెప్పాను. ఎగిరి గంతేసింది.

ఇద్దరం చెట్ల నీడకు వచ్చాం. మేమొచ్చేసరికి బాక్స్‌లో మిగిలిన చేగోడీలు ఖాళీ చేసేశారు. ఫ్రెండ్లీగా మాట్లాడుకుంటున్నారు. పాపం... మేం దూరంగా వెళ్లేసరికి కాస్త ప్రశాంతత దొరికినట్టుంది.

చెప్పొద్దూ... నాకు కడుపు మండిపోయింది. ఏం చేసి వీళ్ల శాంతిని హరిద్దామా అనుకుంటుండగా మా ఆయన లేచి అట్లా వెళ్లాడు. ఛమక్ మంటూ వెలిగిందో బల్బ్ నా మెదడులో మా ఆయన్ని వెంబడించాను.

"ఈ చీరెప్పుడు కొన్నావ్ అనడిగారుగా ఇంట్లో. నేను కొన్లేదండీ... మరీ భాస్కర్రావు ఆమధ్య నా పుట్టినరోజుకి గిఫ్ట్‌గా ఇచ్చాడు" అన్నాను.

మా ఆయన ముఖంలో ప్రశాంతత ఇట్టే దూరమైపోయింది.

"వాడు కొనివ్వటమేంటీ... నువ్వు కట్టుకోవడమేంటీ" అన్నాడు కోపంగా. భాస్కర్రావుని వాడు అనటంలోనే ఆయనెంత వేడిగా వున్నాడో అర్థమైంది.

"తప్పేముందండీ! మన నైబరేగా మొన్న శ్యామల బర్త్‌డేక్కూడా ఇట్లాగే ఎవరో తెలిసిన వ్యక్తి ఉంగరం కొని పెట్టాట్ట. అది తీసుకోలేదూ" అన్నాను.

గతుక్కుమన్నాడు. "ఎవరిచ్చారో చెప్పిందా? " అన్నాడు బలహీనంగా.

"ఊ... హూ" అన్నాను అమాయకంగా.

"ఎవరో తెలిసినావిడై వుంటుందిలే" అన్నాడు.

"ఆవిడ కాదు మా ఆయనట" అన్నాను సాధ్యమైనంతగా మా అక్షరాన్ని మింగేస్తూ.

ఉలిక్కిపడి "ఏంటీ అన్నావ్? " అన్నాడు.

నేను సమాధానం చెప్పకుండా "భాస్కర్రావ్ పిలుస్తున్నాడు" అన్నాను.

నిజంగానే అతనెందుకో చెయ్యి వూపుతున్నాడు. శ్యామల బాధ భరించలేక అయ్యుంటుందనుకున్నా.

మా ఆయనకు ముందే భాస్కర్రావు మీద మండిపోతోందేమో "నువ్వేరా" అన్నట్టు చెయ్యి వూపాడు.

శ్యామలా, అతనూ మాకేసి వచ్చారు. మళ్లీ నలుగురం అలల్తో ఉయ్యాల లూగడం మొదలెట్టాం. మా ఆయన ఓ పది నిముషాల తర్వాత ఒడ్డుకెళ్లిపోయి కూర్చున్నాడు.

శ్యామల వెళ్లి బతిమాలినా రాలేదు. శ్యామల నీళ్లలోకి వచ్చాక చెప్పాను "మళ్లీ ఇందాక ఓ డోసిచ్చాలే"

సాయంత్రం ఆరవుతుండగా ఇళ్లకు బయ లుదేరాం. నేను మా ఇంట్లోకి వెళ్తూ "చెప్పింది గుర్తుందిగా" అన్నాను మెల్లగా.

"ఏంటీ? " అందది.

"ఇందాక గవ్వలేరుకుంటూ మాట్లాడు కున్న విషయం" అన్నాను.

"అమ్మో అదా! నేను మర్చిపోతానా!" అందది.

★ ★ ★

సామాన్లన్నీ లారీ కెక్కిస్తుంటే దిగాలుగా చూస్తూ నిలబడ్డాను. మా ఆయన భాస్క ర్రావింటికి దూరంగా. ఓ ఇల్లు చూసి నాకు చెప్పకుండానే అడ్వాన్స్ కూడా పే చేసే శాడు.

బీచ్‌కి వెళ్లొచ్చిన రాత్రి నేనూ శ్యామలా వేసుకున్న ప్లాన్ అమలు చేశాం.

సముద్రం నుంచి రాగానే తలస్నానాలు చేసి ఒంటికి పట్టిన ఉప్పంతా వదిలించుకు న్నాక వేడివేడిగా కాఫీలు తాగాం నేనూ మా ఆయనా. "వంటేమైనా చెయ్యాలా" అన్నాను.

"వద్దొద్దు. తిన్నవి చాలు" అన్నాడు.

"నాకు ఆకలిగా వుంది" అన్నాను.

"వండుకు తిను" అన్నాడు.

నిజంగానే అన్నం వండాను. కూరలేం చెయ్యలేదు. ప్లేట్‌లో పొగలు కక్కే అన్నం వడ్డించుకుని ఆవకాయ కలుపుకుంటుంటే అటూ ఇటూ మా ఆయన తచ్చాడ్డం కన్పిం చింది.

"కాస్త తిందురూ" అన్నాను.

అనడమే తడవుగా "సరే పెట్టు" అంటూ వచ్చి కూర్చున్నాడు. ఆకలి బాగానే దంచేస్తు న్నట్టుంది. ఆవకాయా పెరుగుతో సుష్టుగా లాగించాడు.

నా టీజింగ్ వల్ల పిక్నిక్‌లో కూడా సరిగా తిన్లేదాయన. అందుకే జాలేసి ఏ కామెంటూ చెయ్యకుండా సైలెంట్‌గా వుండి పోయాను.

"అయినా తొందరెందుకు రాత్రికుందిగా ముసళ్ల పండుగ అనుకున్నాను.

బాగా అర్ధరాత్రి దాటాక ఒక్క గావుకేక వేశాను. అబ్బే మా ఆయనకి మెలకువొ స్తేగా మొద్దునిద్ర... ఒక్క గావుకేకకు చస్తే లేవడు. అందుకే మళ్లీ కేకేశాను. కొంచెం కదిలాడుగాని లేవలేదు.

మూడో కేకకు చివుక్కున లేచి కూర్చు న్నాడు. నేను మాత్రం కళ్లు తెరవలేదు. ఏడుస్తూ నిస్సహాయంగా అరుస్తున్నట్లు "నో... భాస్కర్... ఆయన్నొదిలి రాలేను. బట్ నువ్వంటే ఇష్టమే. కానీ రాలేను. ఐ లవ్‌యు భాస్కర్.. బట్ రాలేను... ప్లీజ్ చెయ్యి ఒదులు"

మా ఆయన నన్ను కుదిపి పారేస్తు న్నాడు. అయినా ఆపలేదు నేను. "అయ్యో అట్లా కోపంగా చూడకు. సరే వస్తాను. నీకోసం కేవలం నీకోసం వస్తాను. జస్ట్ కొంచెం టైమివ్వు. ఐ లవ్‌యు భాస్కర్ ఐ లవ్..."

మా ఆయన ఈడ్చికొట్టాడు నా చెంప మీద. దిమ్మ తిరిగిపోయింది నాకు. ఎట్లాగో ఓర్చుకుని అప్పుడే మెలకువలోకొచ్చి నట్లు చివుక్కున కళ్లు విప్పాను.

శ్యామల కూడా సరిగ్గా ఇదే టైమ్‌కి ఇట్లాగే కలవరిస్తూ వుండి వుంటుంది. భాస్కర్రావు కూడా దాని చెంప ఇట్లాగే పగ లగొట్టి వుంటాడా!

"ఏంటా కలవరింతలు! లేచి మంచినీళ్లు

తాగు" అన్నాడు. ఆయన దవడ ఎముక ఎప్పట్లా బిగుసుకుంది.

"కలవరింతలా? ఏమని కలవరించాను? " అన్నాను.

"ఏం తెలీదు నంగనాచికి" అన్నాడు.

"బాగుంది. నిద్రలో ఏం కలరించానో నాకెట్లా తెలుస్తుందండీ! అలాగైతే మీరెన్నోసార్లు ఎన్నో విషయాలు కలవరించారు. అవేంటో మీరు చెప్పగలరా? " అన్నాను.

"వితండవాదం వద్దు. మంచి నీళ్లుతాగు" మళ్లీ దవడ ఎముక బిగుసుకుంది.

ఓ గ్లాసు నీళ్లు గటగటా తాగేసి అడిగాను. "ప్లీజ్... ఏం కలవరించానో చెప్పరూ"

"ఏం లేదు పడుకో" కసిరాడు.

ఏమని చెప్తాడు "నువ్వు భాస్కర్రావుని ప్రేమిస్తున్నావు. అతనితో లేచి పోతానంటున్నావ్" అని చెప్పగలడా? ప్చ్.. ఏం చెప్పలేదు. చెప్పడు కూడా. ఎందుకంటే దొంగకదా! తేలుకుట్టినా భరించాలి అనుకు



న్నాను.

కానీ భరించలేకపోయాడు. వారం తిరిగే సరికల్లా ఇక్కడికి దూరంగా ఓ ఇల్లు చూశాడు. ఆ వారం రోజులూ నాతో ముభావంగానే వున్నాడు.

నేనుమాత్రం అప్పుడప్పుడూ "ఆ రాత్రి ఏం కలవరించానండీ? చెప్పరూ!" అంటూ వుడికిస్తూనే వున్నాను.

కానీ ఇట్లాంటి నిర్ణయం తీసుకుంటాడను కోలేదు. నా భర్త... మరొకరి భార్యకు ఉంగరం ఇచ్చినా కడుపులోనే దాచుకున్నా. పరాయి మగాడు వెకిలివేషాలేస్తున్నా మా శ్యామల కిమ్మనకుండా వూరుకుంది. ఎందు కని? కేవలం... మా స్నేహం కోసం.

కానీ ఇవాళ ఇట్లా విడిపోవాల్సి వస్తోంది. బయలుదేరుతుంటే నాకు కన్నీ రాగలేదు. శ్యామల్ని పట్టుకుని ఏడ్చేశాను.

అది పిడుగులాంటి ఇంకోవార్త చెప్పింది. "మా ఆయన కూడా వేరే ఇంటికి అడ్వాన్స్ ఇచ్చార్ట. లారీలో మీ సామాను లోడ్ చెయ్యడం చూశాక ఇప్పుడు చెప్పాడు. మేం కూడా రేపు వెళ్లిపోతున్నామంట"

"అన్ లోడ్ అవగానే సేమ్‌లారీని పంపనా? " అన్నాను.

"సేమ్ లారీనే... మా ఆయన రేపటికి ఆల్రెడీ బుక్ చేశాట్ట" చెప్పిందది.

లారీ స్టార్టయ్యింది.

మా ఆయన బైక్ కిక్‌కొట్టి నన్ను పిల్చాడు. చప్పున కన్నీళ్లు తుడుచుకుని చెప్పాను శ్యామలకి "ఇప్పుడే కథ క్లైమాక్స్ కొచ్చింది. టెంపో తగ్గకూడదు"

శ్యామల అర్థం చేసుకుంది. వెంటనే మా ఆయన బైక్ దగ్గరకు పరిగెత్తి పవిటకొం గుతో కళ్లొత్తుకుంటూ నిలబడింది. మా ఆయనేదో అంటున్నాడు. ఇది బొటనవే లితో నేలను రాస్తూ తలూపుతోంది.

నా దుఃఖం మాయమైంది. 'వారెవా.... ఈ దృశ్యం కదా భాస్కర్రావు చూడాల్సింది' అనుకుని వాళ్ల గుమ్మం దగ్గరకెళ్లి లోపలికి తొంగిచూస్తూ "భాస్కర్‌గారూ" అంటూ పిల్చాను.

అతను బయటకొచ్చాడు "వెళ్లొస్తామండీ! అప్పుడప్పుడూ కనబడతారుగా" అన్నాను. కన్నీళ్లను కష్టపడి కళ్లలోకి రప్పించు కుంటూ.

భాస్కర్రావు తబ్బిబ్బయ్యాడు "తప్ప కుండా" అన్నాడు.

నేను మా ఆయన్తో మాట్లాడ్తున్న శ్యామ లకేసి చూపిస్తూ "దాన్ని కూడా తీసుకు రండీ" అన్నాను.

భాస్కర్రావు గుండె భగ్గుమంది. "ఆఁ అట్లాగే" అన్నాడు పొడిగా అటే చూస్తూ.

ఈలోపు గాలికి ఎగురుతున్న ఓ పేపర్ నా కాలికి తగిలింది. వంగి తీసి చక్కగా మడతపెట్టాను. మా ఆయన నాకేసి చూసి "రా విజ్జీ" అన్నాడు.

చటుక్కున నా చేతిలో వున్న మడతపె ట్టిన కాగితాన్ని "ఇదేదో మీ జేబులోంచి పడ్డట్టుంది. చూడండీ" అంటూ భాస్కర్రావు చేతికి అందించాను. కాస్త దూరం నుండీ చూసేవాళ్లకు నేనేదో లెటర్‌ని అతనికిస్తున్న ట్టుగా అన్పిస్తుంది.

ఇచ్చాక కాస్త తడబడుతున్నట్టూ మా ఆయనకేసి చూసి "వస్తానండీ" అంటూ మళ్లీ మళ్లీ భాస్కర్రావుకి చెప్పి వెళ్లి బైక్ ఎక్కాను.

బైక్ స్టార్టయింది. వీధి మలుపు తిరిగే వరకూ శ్యామల నాకు చెయ్యూపుతూనే వుంది. ఎదురు బొదురు ఇళ్లలో వుండే స్నేహితురాళ్లం అట్లా విడిపోతుంటే చాలా బాధగా వుందిగానీ అంతా మన మంచికే అని మనసు గట్టిగా చెబుతుంటే కళ్లు తుడు చుకున్నాను.

మా ఆయనా, భాస్కర్రావు మాత్రం ఒక్క మాట కూడా మాట్లాడుకోలేదు. కనీసం కర్టెసీ కోసమైనా మా ఆయన "వెళ్లొస్తాం భాస్కర్రావ్" అన్లేదు.

★ ★ ★

మా కొత్తిల్లు ఫస్ట్‌ఫ్లోర్‌లో వుంది. మునుపటి దానికన్నా బాగుంది. అపార్ట్‌మెంట్ టైప్‌లో కట్టారా ఇల్లు. బిల్డింగ్ యు షేపులో వుండి మా వింగ్‌కెదురుగా ఇంకో వింగ్ వచ్చింది.

మా వింగ్ బాల్కనీలో కూర్చుని ఎదురింటి బాల్కనీలో కూర్చున్న వాళ్లతో ఎంచక్కా బాతాఖానీ వెయ్యొచ్చు మా వింగ్‌లో నాలుగు పోర్షన్లూ ఎదుటి వింగ్‌లో నాలుగు పోర్షన్లూ... ఈ టు వింగ్స్‌నీ కలిపే చోట రెండు పోర్షన్లూ వున్నాయి. అయితే అన్ని పోర్షన్స్ వున్నా దేనికి దానికి సెపరేటుగా బాల్కనీ వుంది.

అన్నిట్లోనూ కాపురాలుంటున్నట్టున్నారు గాని మా ఎదుటి వింగ్‌లో సరిగ్గా మా పోర్షన్ ఎదురుగా వున్న మరో పోర్షన్ ఖాళీగా వుంది. ఆ పోర్షన్ ఆల్రెడీ బుక్ అయిపోయిందనీ... ఇవాళో, రేపో టెనెంట్స్ దిగుతారనీ మా పక్క పోర్షన్‌లో ఆవిడ చెప్పింది.

సామానంతా సర్దడానికి పూర్తిగా రోజంతా పట్టింది. ఆరోజు వంట చెయ్యడానిక్కాడా కుదర్లేదు. హోటల్‌నుంచి కేరేజ్ తెచ్చుకున్నాం. మరుసటిరోజు మాత్రం వంట చేశాను. పదిగంటలకంతా ఆయనకి టిఫిన్ పెట్టి కేరేజ్ రెడీ చేశాను. నేను మాత్రం ఇల్లు మారుతున్న సందర్భంగా రెండురోజులు లీవ్ పెట్టాను. ఒక్కరోజుతో పని పూర్తయింది. సెలవు కేన్సిల్ చేసుకుని వెళ్లొచ్చుగానీ, ఎందుకో అలసటగా అన్పించి ఫుల్ రెస్ట్ తీసుకోవాలని నిర్ణయించుకున్నాను. మా ఆయన వెళ్ళిపోయాక టిఫిన్ చేసి తలుపుకు బోల్ట్ పెట్టేసి బెడ్‌మీద వాలిపోయాను. అంతే... ఎటుపోయిందో ప్రాణం. సాయంత్రం నాలుగవుతుండగా మెలకువొచ్చింది.

లేచి కిటికీలోంచి బయటకు చూశాను.

ఎదురు వింగ్‌లోని పోర్షన్‌లోకి టెనెంట్స్ వచ్చేసినట్టున్నారు. కూలీలు ఇంట్లోకి సామాను మొయ్యడం కన్పించింది.

ఒళ్ళంతా బడలిగ్గా చికాగ్గా అనిపిస్తుంటే వెళ్ళి స్నానం చేశాను. బాత్‌రూమ్‌లోంచి బయటకొచ్చేసరికి అయిదయింది. "బాప్‌రే! గంటసేపు చేశానా స్నానం" అనుకుంటూ స్టౌమీద కాఫీ గిన్నె పెట్టాను. కాఫీ కాగుతున్నప్పుడు కాలింగ్‌బెల్ మోగింది. తలుపు తీస్తే మా ఆయన.

"ఓ అరగంట ముందొచ్చినట్టున్నారే" అన్నాను.

"కొత్తప్లేస్. ఒక్కదానివీ ఎలా వున్నావోనని" అన్నాడు.

"ఎంత ఘాటు ప్రేమో" అనుకుంటూ ఎదురు పోర్షన్‌కేసి చూశాను.

సామానంతా దింపడం అయినట్టుంది. ఫ్రంట్ డోర్ మూసేసి ఇల్లు సర్దుకుంటున్నారు.

మళ్ళీ తలుపు బోల్ట్‌పెట్టి కిచెన్‌లోకెళ్ళాను. ఆయనస్నానం కూడా అయ్యాక ఇద్దరికీ చెరో కప్పు కాఫీ పట్టుకొచ్చాను.

"ఆ ఖాళీ పోర్షన్‌లోకి ఎవరో దిగినట్టున్నారు" అన్నాను.

"ఆ...ఆ... గమనించాను" అన్నాడు.

కాఫీ తాగి నిన్న సర్దగా ఇంకా మిగిలిన సామాన్లని సర్దడంలో పడ్డాడాయన. నేనూ కాసేపు హెల్ప్‌చేశాను.

పుస్తకాల గోతాన్ని చూసి, "నా మాట విని ఇవన్నీ రేక్‌లో సర్దు" అన్నారు.

పాతింటికన్నా ఈ ఇంటికి రేక్స్ ఎక్కువగా వున్న విషయం గమనించాన్నేను.

"సరే... సర్దుదాం కానివ్వండి" అన్నాను.

గోతం మూతి విప్పి పుస్తకాలు తీస్తుంటే పరుగులు తీస్తూ కన్పించాయి సిల్వర్‌ఫిష్‌లు.

శ్యామలా నేనూ మా శ్రీవార్లకు పెట్టిన పేరు గుర్తుకొచ్చి నవ్వాను.

"ఎందుకూ నవ్వుతున్నావ్?" అన్నాడు ముఖం చిట్లించి.

పీత కష్టాలు పీతవి అన్నట్టు పాపం మా

ఆయన డౌట్ మా ఆయన్ది. నాకేమైనా భాస్కర్రావ్ గుర్తుకొచ్చి రొమేంటిగ్గా నవ్వుకున్నానేమోనని ఆ మానవుడి బాధ.

"ఏంలేదు. శుభ్రంగా మెదళ్ళు తింటూ ఎలా మల్టిప్లై అయ్యాయో చూడండా సిల్వర్‌ఫిషెస్" అన్నాను.

"మెదళ్ళు తింటూనా? " అన్నాడు.

మా ఆయన స్ట్రెస్ చేసేవరకూ నాకా పదం వాడినట్టే తెలీదు. "ఛ... ఛ. మెదళ్ళు కాదండీ పుస్తకాలు" అన్నాను.

"నువ్వేదో పరధ్యానంగా వున్నావ్" మళ్ళీ ఎక్సరే లుక్స్‌తో చూశాడు 'నా గుండెలో భాస్కర్రావు అస్తిపంజరమేమైనా కనబడుతుందేమోనని!

ఓ రెండు గంటలపాటు సర్ది, మిగతా వర్క్ రేపటికి వాయిదా వేసుకున్నాం. ఆయనా నేనూ మళ్ళీ స్నానం చేసి ఫ్రెషప్ అయ్యాం.

రాత్రి వంటకు ఆలూ వేపుడూ, రసమూ చేసేసరికి ఎనిమిదయ్యింది. మా టీవీకింకా కేబుల్ కనెక్షన్ ఇవ్వలేదు.

నేనింకా కిచెన్‌లో ఆ పనీ ఈ పనీ చేస్తుంటే. ఆయన బాల్కనీలో కూర్చుని ఏదో పుస్తకం తిరగేస్తున్నాడు.

మా పక్క పోర్షనావిడ వాళ్ళ పాపతో మైసూర్‌పాక్ కేక్స్ ఓ నాలుగు పంపించింది.

"మమ్మీ ఇంట్లోచేసింది" అందా పాప.

"మమ్మీకి థాంక్స్ చెప్పు" అన్నాను ఆ పాప బుగ్గ చిదుముతూ.

ఆ పాప వెళ్ళిపోయాక ఆ కేక్స్ రెండు ప్లేట్లలో సర్దుకుని నేనూ బాల్కనీలోకి వెళ్ళాను. ఓ ప్లేట్ మా ఆయనకిచ్చి చెయిర్లో కూర్చున్నాను.

"ఎక్కడివీ? " అన్నాడు.

"పక్కింటావిడ పంపింది" అన్నాను.

ప్లేట్లోని మైసూర్‌పాక్ తుంచి నోట్లో వేసుకోబోతూ ఎదురు పోర్షన్‌వైపు చూశాను.

స్వీట్‌కోసం తెరిచిన నోరు తెరిచినట్టే వుండిపోయింది. సరిగ్గా అప్పుడే ఎదురు పోర్షన్‌లో దిగిన స్త్రీ నాకేసి చూసింది. ఆమె కళ్ళు ఆల్చిప్పలే అయ్యాయి.

"శ్యామలా" అన్నాను. అప్పటి సినిమాల్లో ఎ.ఎన్.ఆర్. వాణిశ్రీని 'రాధా' అని పిల్చినంత గొప్ప మాడ్యులేషన్‌తో.

"విజ్జీ" అంది శ్యామల ఇప్పటిసినిమాల్లోని డిజిటల్ సౌండ్ ఎఫెక్ట్‌తో. ఉలిక్కిపడి తలెత్తిన మా ఆయన చేతిలోని మైసూర్‌పాక్ ప్లేట్ జారి కిందపడింది.

శ్యామల వెనకే బాల్కనీలోకొచ్చిన భాస్కర్రావ్ కూడా ఖంగుతిన్నాడు. గ్రాఫిక్స్ ఉపయోగించి స్పెషల్ ఎఫెక్ట్స్‌తో తీసిన సినిమాలోలా... క్షణాల్లో మా ఆయన ముఖం అమ్రిష్‌పురిలాగా వాళ్ళాయన ముఖం పరేశ్‌రావల్లాగా మారిపోయాయి.

మా ఆయన నా గుండెల్లో గునపాలు గుచ్చుతున్నట్టుగా చూసి "ఆ ఇంటి గుమ్మం తొక్కావో, నీకూ నాకూ చెల్లు" అన్నాడు.

★ ★ ★

సత్యవాణి వాళ్ళ నాన్న ఆపరేషన్‌కు ఒప్పుకున్నాట్ట. ఆయనకై ఆయన ఒప్పుకోలేదట గానీ ఇంట్లో అందరూ కలిసి ఒప్పించారట.

"మీరు గనుక ఆపరేషన్ చేయించుకోకపోయారో... నేనూ, నా బిడ్డలూ కిరోసిన్ పోసుకుని కాల్చుకు చస్తాం" అందట సత్యవాణి అమ్మ.

అనటమేకాదు నిన్నరాత్రి పదిగంటలప్పుడు కిచెన్‌లో దూరి ఒంటిమీద కిరోసిన్ పోసేసుకుని అగ్గిపుల్ల గీసుకుంటానంటూ వీరంగమాడిందట.

"నాన్నా! అమ్మకేమైనా అయితే దానికి నువ్వే కారణమని పోలీస్‌కేస్ పెడతా. నాన్నవని కూడా చూడను" అని బెదిరించిందట సత్యవాణి.

ఇరుగుపొరుగు వాళ్ళు కూడా "ఏం... ఆపరేషన్ చేయించుకుంటే నీ భార్యా పిల్లలూ,

నీ సంసారమేగా బాగుపడేది. ఎందుకంత ఆలోచిస్తావ్" అని గడ్డి పెట్టారట.

అయితే చివరిసారిగా కుమారిని చూసొస్తానని పట్టుపట్టారట. ఆనకెట్లాగూ ఆమె మీద విముఖత కలుగుతుందిగా అందు కని. కుమారంటే ఆయన ఉంచుకున్న మనిషి.

ససేమిరా అని... ఇవాళ ఉదయమే ఆయన్ని పట్టుకెళ్ళి ఆపరేషన్ థియేటర్లోకి గిరాటేశారట. ఇవాళ సత్యవాణి ఆఫీస్‌కు సెలవుపెట్టి హాస్పిటల్లో వుంది.

ఈ విషయాలన్నీ సీత చెప్పింది నాకు.

"పోన్లే. నయానో భయానో ఆయన్ని ఒప్పించారు. ఇక సత్యవాణి వాళ్ళు బాగుపడ్డట్లే" అన్నాను.

"కాదూ మరి. నెల్నెలా సగం జీతం పట్టుకెళ్ళి ఆ కుమారి ముఖాన కొడతాడట. ఇప్పుడంతా మిగులే" అంది సీత.

మరి నేనూ, శ్యామలా ఇన్ని కష్టాలు పడే బదులు చస్తామని బెదిరిస్తే మా ఆయనా, వాళ్ళాయనా ఆపరేషన్లకు ఒప్పుకుంటారా?

"ఏంటాలోచిస్తున్నావ్" అంది సీత.

"ఏంలేదు. సాయంత్రం ఆఫీసయ్యాక వాణి వాళ్ళ నాన్నగార్ని చూసెల్దాం" అన్నాను.

క్రిష్ణప్రియ కూడా వస్తానంది. ఆ సాయంత్రం మా ఆయన నన్ను పికప్ చేసుకోవడానికి వచ్చినప్పుడు సత్యవాణి వాళ్ళ నాన్న విషయం చెప్పి "నేను వీళ్ళతో హాస్పిటల్‌కి వెళ్ళి ఆయన్ని చూసొస్తా, మీరింటికెళ్ళండి" అన్నాను.

మా ఆయన వెళ్ళిపోయాక నేనూ, సీతా, క్రిష్ణప్రియా ఆటో చేసుకుని హై టెక్నాలజీ క్లినిక్కి వెళ్లాం. రిసెప్షన్లో అడిగి రూమ్ నంబర్ తెలుసుకున్నాం. పదో నంబర్ రూమ్ ఆయనకు అలాట్ చేసింది.

మేం వెళ్ళేసరికి ఆయన బెడ్‌మీద కళ్ళు మూసుకుని పడుకొని వున్నారు. సత్యవాణీ, వాళ్ళమ్మా మమ్మల్ని మర్యాదగా రిసీవ్ చేసుకున్నారు. సత్యవాణి హేపీగా వాళ్ళనాన్నని ఆపరేషన్‌కి ఎలా ఒప్పించిందీ వర్ణించి, వర్ణించి చెప్పింది. వాళ్ళమ్మ ఇంత కాలం ఆయన్తో తను పడ్డ కష్టాలన్నీ ఏకరువు పెట్టింది.

ఓ అరగంట అక్కడ స్పెండ్ చేశాక డాక్టర్‌గార్ని చూద్దామనుకున్నాగానీ కన్సల్టేషన్ కోసం వచ్చిన పేషెంట్స్ సంఖ్య చూసి ఆ ఆలోచన విరమించుకున్నాను.

ముగ్గురం ఆటోలో బయల్దేరాం. వెళ్ళేదార్లోనే మా హనుమాయమ్మ పిన్నిల్లు. ఓసారెళ్ళి పలకరిద్దామన్పించింది. "సీతా! నేనిక్కడ దిగిపోతాను మీరెళ్ళిపోండి" అన్నాను.

నన్ను చూసి మా హనుమాయమ్మ పిన్ని చాలా సంతోషించింది. "ఇల్లు మారారట గా. నిన్న అబ్బాయొచ్చి చెప్పాడు" అంది.

"అవునా... ఆయన మీ ఇంటికొచ్చినట్లు నాతో అన్లేదే" అన్నాను.

పిన్ని నన్ను కాళ్ళూచేతులూ కడుక్కోమని చెప్పింది. ఇంటికి ఫోన్‌చేసి "నేను పిన్నీ వాళ్లింట్లో వున్నాననీ, ఓ గంటలో వస్తాననీ" మా ఆయనకు చెప్పాను.

మాధవి స్టీల్ ప్లేట్‌నిండా కారప్పూస పోసి స్టూలుమీద పెట్టింది. వాళ్ళ పెరట్లో పూసిన సన్నజాజుల్ని మాలకట్టి నా తలలో తురిమింది.

"జుట్టు పెంచక్కా. పెద్ద జడ వేసుకుంటే బోలెడు పూలు పెట్టుకోవచ్చు"

నా 'యు' షేప్ హెయిర్‌స్టైల్ దానికి నచ్చలేదులా వుంది.

"వర్కింగ్ ఉమెన్‌కి ఇదే సుఖం తల్లీ. ఆఫీస్‌కి టైం అయిందనుకో. వెళ్తూ వెళ్తూ దార్లో కూడా ఓ రబ్బర్ బేండ్ తగిలించుకో వచ్చు తెల్సా" అన్నాను.

మాధవి ఒక్కసారి తన పొడవాటి వాలు జడను ముందుకేసుకుని "నా వాలుజడ చూడు. కరినాగులా లేదూ" అంది గొప్పగా.

"పోవే... పాతకాలపు హీరోయిన్లా.

ఇప్పటి అల్ట్రామోడర్న్ హీరోయిన్స్‌ని చూడు. ఒక్కరైనా ఈ టైపు జడ వేస్తున్నారా" అన్నాను దాన్ని ఉడికిస్తూ.

"చూడమ్మా అక్కయ్యా" అని గారాలు పోయింది. అంతలోనే...

"మీరు మాట్లాడుతూ వుండండి. ఈలోపు సేమ్యాహల్వా చేసిస్తా. బావగారికి పట్టుకెళుదువుగాని" అని నేను వద్దంటున్నా వినకుండా కిచెన్‌లోకెళ్ళింది. చుట్టుపక్కల ఎవరూ లేకుండా చూసి...

"పిన్నీ! నీక్కొన్ని విషయాలు చెప్పాలి నేను" అన్నాను.

నేనూ, శ్యామలా ఆడే డ్రామాలో ఆమెను కూడా పాత్రధారిని చెయ్యాలన్న ఆలోచనలో వున్నాను. అదీగాక ఇటువంటి డెలికేట్ విషయాలకి ఒకరి సాక్ష్యం అవసరం.

"చెప్పు విజ్జీ" అంది.

"మేడపైన కూర్చుందాం" అన్నాను.

ఇద్దరం మేడపైకి వెళ్ళాం. నేనూ, శ్యామలా... మాఆయన్నీ, వాళ్ళాయన్నీ ఎలా టీజ్ చేస్తున్నదీ, ఇల్లెందుకు మారిందీ అన్నీ పూసగుచ్చినట్లు చెప్పాను. దానివల్ల మేం సాధించబోయేదేమిటో అడిగింది పిన్ని.

"మెంటల్ టార్చర్" కసిగా అన్నాను.

"భర్త పరాయి స్త్రీని ఆరాధిస్తున్నాడని తెలిసినప్పుడు భార్య పడే వేదన... మానసిక హింస వీళ్ళకు అనుభవంలోకి రావాలి. ప్రేమించే వ్యక్తిని నిర్లక్ష్యం చేసే మగాడి బతుకు ఏమౌతుందో వాళ్ళకు తెలియచెప్పాలి. దాంతో వాళ్ళలో ఆత్మపరిశీలన మొదలవుతుంది. మానసిక పరివర్తన వస్తుంది. ఇదీ మా ఆశ" అన్నాను.

"వినడానికి బాగానే వుందే అమ్మాయ్. వాళ్ళు మగాళ్ళు. మానసిక హింసే పడతారో... మీ ఇద్దర్నీ వదిలేవేస్తారో ఎలా చెప్పగలం" అంది.

నాకు ఉక్రోషం ముంచుకొచ్చింది.

"అలా జరగదనే మా నమ్మకం. ఒకవేళ ఆ పరిస్థితి వస్తే అలాంటివాళ్ళతో కాపురం చేయడంకన్నా ఇండివిడ్యువల్‌గా బతకడం మేలనుకుంటాను" అన్నాను.

"అదీ నిజమేలే. మనసులేని వాడితో నన్నా కాపురం చేయొచ్చుగానీ, మనసులో ఇంకొకర్ని వుంచుకున్నవాడితో కాపురం నరకమే మరి. సరే ఇంతకీ నన్నేవిధంగా సాయపడమంటావ్? " అంది.

"ఏంలేదు పిన్నీ. నీకు వీలయినప్పుడల్లా వచ్చి డాక్టర్ పురుషోత్తంగారి ఆపరేషన్ గురించీ, దానివల్ల బాగుపడ్డ కుటుంబాల గురించీ సుత్తేస్తూ వుండు. ఏదో ఒకనాడు మేం పెట్టే హింస భరించలేక వాళ్ళ తప్పు వాళ్ళు తెలుసుకుని వాళ్ళకైవాళ్ళే ఆపరేషన్ చేయించుకుంటారు" అన్నాను.

"వాళ్ళు మారతారని నువ్వూ, నీ ఫ్రెండూ చాలా నమ్మకంగా వున్నారన్నమాట. గాడ్ బ్లెస్ యూ" అంది.

మాధవి స్టీల్ బాక్స్‌నిండా సేమ్యాహల్వా పెట్టుకొని మేడమీదకొచ్చి "నువ్విక్కడున్నావా అక్కయ్యా" అంది.

భోంచెయ్యమని బలవంతం చేసినా నేనుండలేదు. సత్యనారాయణ బాబాయ్ నేనొద్దంటున్నా వినకుండా ఇంటివరకూ వచ్చి వదిలాడు. ఆయన్ని లోపలికి పిల్చి మర్యాదలు చేసి పంపాను. అప్పటికి రాత్రి తొమ్మిదైంది.

"మరీ ఇంత లేటా? " అని మా ఆయన ఒకటే సణుగుడు. ఆ సణుగుడు ఓవంక భరిస్తూనే వంట పూర్తిచేశాను.

"భోజనం రెడీ" అన్నమాట విన్నాకగానీ ఆయన సణుగుడు ఆపలేదు.

సణుగుతూ తినడం కష్టంకదా.

★ ★ ★

మా ఆయనిప్పుడు పాతింట్లోలా బాల్కనీలో కూర్చుని రంధ్రాన్వేషణ చెయ్యడం దాదాపుగా మానేశాడు. దానిక్కారణం మా ఆయన బాల్కనీలో పొరపాటున సెటిలైనా ఆయన పక్కన నేనూ తయారైపోతున్నాను.

ఆయన మనసాగక శ్యామల్ని చూస్తుంటే నేను పోటీగా భాస్కర్రావుని చూస్తూ కూర్చుంటున్నాను. నా బాధ భరించలేక ఆయన బాల్కనీలోకే అడుగుపెట్టడం మానేశాడు.

నిన్న ఆఫీసుకు ఫోన్‌చేసి శ్యామల అంది, "ఈ కొత్తింట్లో చేరాక మన డ్రామాలో టెంపో తగ్గిందే. వియ్ మస్ట్ డు సమ్‌థింగ్" అంది.

మేమేదైనా పర్సనల్‌గా మాట్లాడుకోవాలనుకున్నప్పుడు అదిట్లా ఆఫీసుకి చేస్తుంది. నేనూ ఆఫీసునుండి దానింటికి చేస్తాను. అది హౌస్ వైఫ్ కాబట్టి ఉదయం పది తర్వాతా, సాయంత్రం అయిదు లోపల ఎప్పుడు ఫోన్ చేసినా నో ప్రాబ్లమ్.

"కమాన్ సజెస్ట్" అన్నాను.

శ్యామల ఫోన్లో కూడా చెవిలో చెబుతున్నట్లు చెప్పింది విషయం. నేను ఎగిరి గంతేశాను. "ఈరోజే ఇంప్లిమెంట్ చెయ్యాలి" అన్నాను.

తర్వాత నేను మా పిన్నిని కలిసిన విషయమంతా చెప్పాను. "ఆవిడ లీక్ చెయ్యదు కదా". ఆ భయమే అక్కర్లేదని చెప్పాను. ఆవిడ సాయం మాకెట్లా అవసరపడుతుందో విడమర్చి చెప్పాక శ్యామల కుదుటపడింది. ఇంకాసేపు అదీ ఇదీ మాట్లాడుకున్నాక ఫోన్ పెట్టేశాను.

సాయంత్రం ఇంటికెళ్ళాక నేనూ మా ఆయనా తీరుబడిగా కూర్చుని కాఫీ సిప్ చేస్తున్నప్పుడు ఫోన్ రింగయ్యింది. మా ఆయన వెళ్ళి కాల్ రిసీవ్ చేసుకుని హెలో అన్నాడు. అవతల టక్కున రిసీవర్ క్రెడిల్ చేసిన చప్పుడు.

మళ్ళీ ఓ పదినిమిషాల అనంతరం రింగయింది ఫోన్. మా ఆయనే రిసీవర్ తీశాడు. 'హలో' అనగానే మళ్ళీ కట్టయింది.

ఈసారి అరగంట తర్వాత రింగయింది. మళ్ళీ ఆయనే తీసుకోవడం, ఫోన్‌కట్టవడం మామూలుగానే జరిగింది.

మా ఆయన విసిగిపోయాడు.

ఇడియట్, ఫూల్, రాస్కెల్‌లాంటి తిట్లన్నీ అయ్యాక అలా టెర్రస్‌మీదకి వెళ్ళాడు.

వంటచెయ్యడం కూడా వాయిదావేసి టెర్రస్‌మీంచి ఎప్పుడు దిగుతాడా అని ఎదురు చూస్తూ కూర్చున్నా. వెళ్ళిన పదిహేన్నిమిషాలకు మెట్లు దిగుతూ కన్పించాడు. నాకు తెలుసు ఎక్కువసేపు వుండడని. ఇక్కడ నేనూ, భాస్కర్రావూ మన్మథబాణాలేసుకుంటామేమోనన్న ఆలోచన మా ఆయన్ని నిలవనివ్వలేదక్కడ.

మా ఆయన్ని చివరి మెట్టువరకూ రానిచ్చి నేను చప్పున ఫోన్ దగ్గరకు పరుగెత్తాను. సెల్ఫ్ డయల్ చేశాను. ఫోన్ రింగయ్యింది. కాసేపట్లాగే రింగవనిచ్చి మా ఆయన అది విని వుంటాడన్న నమ్మకం కలిగాక రిసీవర్ని తీసుకున్నాను. మా ఆయన లోపలకు వస్తున్నాడు. చూడనట్టు అటుతిరిగి "హలో ఎవరూ?" అన్నాను.

అవతల మాట విన్నట్టుగా "అరె మీరా?" అన్నాను.

నాకు తెలుసు మా ఆయన ఓ అడుగు వెనక్కేసి గోడచాటుగా నక్కి చెవులు రిక్కించి వింటాడని.

"అయితే ఇంతక్రితం మూడుసార్లు రింగ్ చేసింది మీరేనా?" అన్నాను. అతనేదో అంటుంటే విన్నట్టు నటించి "ఏం చెయ్యమంటారు? మూడుసార్లు ఆయనే తీశారు. అక్కడే వున్నారు మరి" అన్నాను.

"ఆ... ఆ... అలాగే" అన్నాను.

"ష్యూర్" అన్నాను.

"ఏయ్ డోంట్ బి సిల్లీ... ఓకె అన్నాగా" అనేసి, "బై... సీయూ" అంటూ ఫోన్ పెట్టేశాను.

నేను ఫోన్ పెట్టేసిన రెండు నిమిషాలకు లోపలకొచ్చాడు మా ఆయన.

"ఫోనెక్కడ్నించీ" అంటాడేమో "ఫోనా రాలేదే" అని ఓవర్ యాక్టింగ్ చేద్దామనుకుంటున్న నా ఆశ అడియాశే అయింది.

గరళం మింగేసిన శివుడిలా, ఫోన్‌కాల్‌ని మింగేసి ఊరుకున్నాడు. అయితే ఆ మింగ డంలోనే వుంది అసలు కిటుకంతా. ఫోన్ రింగయితే చాలు అమాంతం దానిమీద పడ్డం, ఆ కాల్ తనకు అయితే నిరుత్సా హంగా మాట్లాడ్డం, ఒకవేళ ఫోన్ కట్టయితే నాకేసి నర్మగర్భంగా చూడ్డం, ఓ సారోపుల్ హాబీగా మారిపోయింది మా ఆయనకి.

రోజుకి కనీసం అయిదారుసార్లు ఫోన్ రింగవడం, కట్టవడం మామూలైపోయింది. ఒక్కోసారి నేను రిసీవ్ చేసుకుని,

"హాయ్... హౌ ఆర్ యూ? " అంటూ సీక్రెట్‌గా మాట్లాడ్డం కూడా మామూలైపో యింది.

నిజం చెప్పొద్దూ. ఈమధ్య మా ఆయన చాలా చిక్కిపోయారు. దిగులుతో కృశించి నట్టుగా అయిపోయారు.

ఓరోజు ఆఫీసునుంచి శ్యామలకి ఫోన్‌చేసి "కాల్స్ కాస్త తగ్గించరాదూ. మా ఆయనకు ఫోన్ ఫోబియా ఎక్కువవుతోంది" అన్నాను.

"ఏం జాలిపడుతున్నావా? " అందది.

"జాలికాదు. ఈర్ష్య. మీ ఆయనైతే హేపీగా వుండాలా? " అన్నాను.

"అదా నీ బాధ. డోంట్ వర్రీ. ఇంకో నాల్రోజుల్లో మా ఆయన మీ ఆయన కంటే చిక్కిపోయేలా చేస్తాను. అయితే ఒక చిన్న హెల్ప్ కావాలి" అంది.

"ఆల్వేస్ ఐ యామ్ ఎట్ యువర్ సర్వీస్" అన్నాను.

"మీ ఆయనిది ఓ బస్ట్‌సైజ్ కలర్ ఫొటో వుంటే సప్లయ్ చెయ్" అంది.

"ఓకే..." ఉత్సాహంగా అని, "ఏం చెయ్య బోతున్నావ్ దాంతో? " అన్నాను.

"వెయిట్ అండ్ సీ. అన్నట్టు మంచి రొమాంటిక్ ఫోజ్‌లో వున్న ఫొటో అయితే మరీ మంచిది" అంది.

ఆ సాయంత్రం ఇంటికొచ్చాక ఆల్బమ్ తిరగేశాను. ఓ ఫొటోలో మా ఆయన గాగుల్స్ పెట్టుకుని షర్ట్ బటన్స్ రెండు విప్పేసి రెండుచేతుల్నీ ప్యాంట్ జేబుల్లో దూర్చి చిలిపిగా నవ్వుతున్నాడు.

శ్యామలకివ్వడానికి ఆ ఫొటోనే సెలెక్ట్ చేశాన్నేను. ఆల్బమ్‌లోంచి తీసి ఓ కవర్లో పెట్టి పక్కింటి పాపను పిల్చి ఆ కవర్ శ్యామలకిచ్చి రమ్మన్నాను. ఆ అమ్మాయి రెండు నిమిషాల్లో ఆ పనిచేసేసి ఉత్సా హంగా వచ్చింది, "ఐ హేవ్ డన్నిట్" అంటూ.

ఇంట్లో సున్నుండలుంటే రెమ్యూనరేషన్ ఇచ్చాను.

రెండురోజులు ఆగి మూడోరోజునుండి అబ్జర్వ్ చెయ్యసాగాను భాస్కర్రావుని చిక్కి పోతున్నాడా లేదా అని. వారమైనా దుక్క లానే వున్నాడు. నేను మీ బాల్కనీలో నిల బడి, "ఏంటి మీ ఆయనింకా చిక్కిపోలేదు" అని సైగ చేశాను.

"కాస్త ఓపిక పట్టు" అంటూ అది కూడా సైగ చేసింది.

మా పక్కపోర్షన్‌కి, పక్కపోర్షన్‌లో వున్న ఓ ముసలాయన బాల్కనీలో ఈజీ ఛెయిర్లో కూర్చుని భగవద్గీత చదువుకుంటున్నాడు. దాదాపుగా ప్రతిరోజూ అక్కడే కూర్చుని గీత చదువుకుంటూ వుంటాడాయన. ఇవాళ గీత చదవడం ఆపి, నన్నూ, శ్యామల్నీ మార్చి మార్చి చూడసాగాడు.

ఒకవేళ ఈ ముసలాడు మా ఆయన అరేంజ్ చేసిన 'స్పై' కాదుకదా అనుకున్నా. నేననుకున్నంతా అయింది.

ఆరాత్రి మా ఆయన భోంచేస్తూ, "ఏంటీ కూరిట్లా తగలెట్టావ్" అన్నాడు.

"తగలెట్టలేదే గ్యాస్ స్టౌమీద మామూలు గానే వండాను" అన్నాను.

"ఎదురిళ్ళకీ, పక్కిళ్ళకీ సైగలు చేస్తూ బతికే ఆడాళ్ళు కూరలు వండరు. తగలే స్తారు" అన్నాడు.

షుగర్ పేషెంట్స్‌కి దొంగచాటుగా స్వీట్స్ ఇవ్వడం ఓ రకంగా పాపమే"

అన్నాను.

"పెరుగు వెయ్" అన్నాడు అసహ్యంగా.

నేను మా ఆయన చూడకుండా నాలుగు సున్నుండలు పొట్లం కట్టుకెళ్లి గీత చదువుతున్న ముసలాయన దగ్గరగా వెళ్లి నిలబడ్డాను.

"అంత దీక్షగా చదువుతున్నారు. కళ్లు బాగా కనబడతాయా? " అనడిగాను.

"బ్రహ్మాండంగా" అన్నాడు.

"వినికిడి శక్తి? " అన్నాను.

"చీమ చిటుక్కుమన్నా వినగలను" అన్నాడు.

పొట్లం విప్పి సున్నుండలు చూపిస్తూ చెప్పాను "నేతి సున్నుండలు తాతయ్యా. నాకిష్టమని మా పిన్ని చేసి పంపింది"

ఆ ముసలాయన కళ్లు సోడాబుడ్డీ అద్దాల వెనకనుంచీ ఆబగా చూశాయి సున్నుండల్ని. చటుక్కున పొట్లం లాక్కుని పంచె కట్టులో దాచుకుంటూ "చూపు సరిగా ఆనదు. వినికిడి శక్తి కూడా అంతంత మాత్రమేనమ్మాయ్" అన్నాడు.

"ఇక బజార్లో కొనే స్వీట్లకి ఆశ పడకండి" అన్నాను.

"వీటి రుచి ముందు అవి బలాదూర్. మీ పిన్ని పంపినప్పుడల్లా..." అంటూ ఆపాడు.

"తప్పకుండా ఇస్తుంటాను. మీ కోసం చెయ్యించి మరీ తెప్పిస్తాను" అన్నాను.

"ఓం నమఃశివాయ... ఓం నమఃశివాయ" అంటూ అటూ ఇటూ చూసి తాత ఓ సున్నుండ ఒక్కసారిగా నోట్లో వేసుకున్నాడు.

ఇక ఆ తర్వాత నాకూ శ్యామలకీ సైగలే కాదు మాటలు కూడా మొదలైనయ్. మరీ అవసరమైతే ఒకరి పోర్షన్‌లోకి మరొకరం దూరే ఛాన్స్‌కూడా ఇచ్చాడు తాతయ్య.

నేను మా ఆయన ఫొటోగ్రాఫిచ్చిన పదో రోజనుకుంటా. ఏదో పనిమీద బాల్కనీలో కొచ్చా. శ్యామల కనబడుతుందేమోనని యథాలాపంగా వాళ్ల పోర్షన్‌కేసి చూసి ఆనందంతో కెవ్వుమనబోయి తమాయించుకున్నాను. మీటరు లోతున లాక్కుపోయిన కళ్లూ... కళ్లకింద నల్లటి వలయాలూ... రెండు మీటర్ల లోతున పీక్కుపోయిన దవడలూ... నుదుటి మీద ముడతలూ... చెదిరిన క్రాపూ... మాసీన గడ్డం... బొత్తాములూడిన చొక్కా... మాసిపోయిన ప్యాంటూ...

జీవచ్ఛవంలా బాల్కనీలో కూర్చుని వున్నది భాస్కర్రావే కదూ! ఇంత అద్భుతంగా అతనికి మేకప్ చేసిన ఆర్టిస్ట్ ఎవరై వుంటారు? భాస్కర్రావుకి టీవీ సీరియల్స్‌లో ఛాన్సేదైనా వచ్చిందా!

అట్లా అనుకుంటున్న నా కళ్లముందు చటుక్కున మెరిసింది.

"నాల్రోజులాగు మా ఆయన మీ ఆయన కంటే చిక్కిపోయేలా చేస్తాను" అన్న శ్యామల.

జీవచ్ఛవం... సారీ భాస్కర్రావు వెనక నిలబడి నాకేసి నవ్వుతూ చూసి విక్టరీకి చిహ్నంగా చూపుడు వేలినీ నడిమి వేలినీ వి షేపులో పెట్టి చూపించింది శ్యామల.

★ ★ ★

"భాస్కర్రావు ఎవరి మీదో బెంగెట్టుకున్నట్టున్నాడు పాపం. పూచిక పుల్లలా అయిపోయాడు" అన్నాడు మా ఆయన నా వంక అదోలా చూస్తూ. నేనేదో అనబోతున్నంతలో ఫోన్ రింగయింది. మా ఆయన అమాంతం లేచి వెళ్లబోయి మోకాలికి స్టూల్ పొడుచుకోవడంతో అంతే స్పీడ్‌తో ఆగిపోయి 'అమ్మా' అన్నాడు.

నేను కాల్ రిసీవ్ చేసుకుని "అబ్బా" అన్నాను. అవతల చెప్పేది విన్నట్టుగా ఫోజిచ్చి "మరీ అంత దిగులుపడితే ఎట్లా? మరీ ఎముకలు బయటపడుతున్నాయ్" అన్నాను.

మా ఆయన మోకాలినొప్పి ఎగిరిపో

యింది. చెవులు నిక్కబొడుచుకున్నాయి.

"ఆ గడ్డం కాస్త షేవ్ చేసుకోకూడదూ" అన్నాను.

మా ఆయన కళ్లు మిటకరించాడు. చెవుల్తోనేకాక కళ్లతో కూడా వింటున్నాడల్లే వుంది.

"ఇంకేం చెప్పకు. హేవ్ ఎ హెయిర్ కట్" అన్నాను... గొంతు తగ్గించి మాట్లాడుతున్నట్టుగా.

ఈసారి మా ఆయన కళ్లూ చెవులే కాదు. ముక్కూ నోరు కూడా వింటున్నట్టు అన్పించాయి.

"డోంట్ సే నో... రేపీపాటికి నీట్‌గా కొత్త పెళ్లి కొడుకులా అన్పించాలి. ఓకే బై" అన్నాను.

రిసీవర్ క్రెడిల్ చేసి మా ఆయన వంక తిరిగాను.

ఆశ్చర్యం... మా ఆయన కళ్లు కూడా అచ్చు భాస్కర్రావు కళ్లు లాగే మీటరు లోతుకు లాక్కుపోయాయి.

ఒక్క ఫోన్ కాల్ మనిషిలో ఇంత మార్పు తెస్తుందా! అన్‌బిలీవబుల్ అనుకున్నాను.

మా వారికేసి జాలిగా చూసి "మీరూ చాలా వీక్‌గా కనబడుతున్నారీ మధ్య. ఓ రెండు సెలైన్ బాటిల్సు ఎక్కించుకోగూడదూ. తక్షణ శక్తి వస్తుంది" అన్నాను.

మా ఆయన దవడ **ఎముక** మామూలుగా బిగుసుకుంది.

**నే**ను ఆఫీసునుంచి ఫోన్ చేసి "ఏమిటి చేశావేమిటి? " అన్నాను.

"వెరీ సింపుల్. నీ దగ్గర తీసుకున్న మీ ఆయన ఫొటోగ్రాఫ్ చీరల మధ్య పెట్టాను. మొన్నోరోజు బాత్‌రూమ్‌లోకి చీర మర్చిపోయినట్టుగా వెళ్లిపోయి "ఏమండీ బీరువాలో చందనం కలర్ చీరుంది. కాస్తిలా ఇవ్వండి" అన్నాను.

ఇప్పుడాయన అల్మయిరా కలబెడతారు. చందనం చీరె బయటకు లాగుతారు. ఆ చీరె పై మడతలోనే వుంది మధుకర్ ఫొటో. అది చూస్తారు. అనుకుంటూ నేను బాత్‌రూమ్‌లోనే వుండి వూపిరి బిగబట్టి చూస్తున్నాను.

ఎంతసేపటికీ ఆయన చీరె ఇచ్చే సూచనలు కనబడకపోవడంతో...

"ఏమండీ చీరె" అని కేకేశాను. మౌనంగా తెచ్చి అందించాడు.

చీర మడతలు విప్పి చూశాను. ఫొటోగ్రాఫ్ లేదు. ఆనందాన్ని మనసులోనే అణుచుకుంటూ అల్మయిరా పరిసరాల్లో వెదికి



చూశాను. ఒకవేళ చీరె తీసేటప్పుడేమైనా జారి పడిందేమోనని. ఎక్కడాలేదు. అది మా ఆయన చేతికి డెఫినెట్‌గా వెళ్లిందని తెలిపోయింది. అంతే మా ఆయన... రేడియం జేబులో పెట్టుకున్న మనిషిలా కృశించిపోతున్నాడు" శ్యామల ఆగింది.

"అయితే ఆ ఫొటోగ్రాఫ్ మీ ఆయన

అండర్‌లోనే వుందంటావ్" అన్నాను.

"అండర్‌లోనే వుందో అండర్‌వేర్‌లో వుందో నాకేం తెల్సు?" అందది.

నేను ఫక్కున నవ్వేసి "ఓ చిన్న మాట" అన్నాను.

"ఏంటీ?" అంది.

"రేపీపాటికంతా మీ ఆయన నీట్ షేవ్‌తో విలాన్ బనియన్‌తో మా ఆయన కళ్లకు కనబడాలి" అన్నాను.

"వాట్స్ ద మేటర్?" అంది.

నేను ఫోన్‌లో మాట్లాడిన ఫాల్స్ కాన్వర్జేషన్ గురించి చెప్పాను.

"ఓకే డన్" అందది.

★ ★ ★

మరుసటి రోజు మా ఆయన దీర్ఘంగా శ్యామల వాళ్ల పోర్షన్‌కేసి చూస్తుంటే శ్యామలకేమైనా నైలాన్ వల వేస్తున్నాడేమో అనుకుంటూ అట్లా యథాలాపంగా చూశాను. నేననుకొన్నట్టూ అక్కడ శ్యామల లేదు.

నీట్ షేవ్‌తో తళతళలాడుతున్న గడ్డంతో కాంతులీనుతూ నిలబడి వున్నాడు భాస్కర్రావు.

"హేట్సాఫ్ టు యు శ్యామలా" అనుకున్నాను నా తల మీద హేట్ లేకపోయినా! మా ఆయన నాకేసీ భాస్కర్రావుకేసీ మార్చి మార్చి చూశాడు. అట్లా అయిదు నిమిషాల పాటు చూశాక అతి నిశ్శబ్దంగా ఇంట్లోకి వెళ్లాడు. నేనూ ఆయన్ని నిశ్శబ్దంగా అనుసరించాను. కప్‌బోర్డ్‌లో వెతికి సైలెంట్‌గా కటింగ్ ప్లేయర్ చేతికి తీసుకున్నాడు.

మరీ మర్డర్లు చేసేంత క్రూయల్టీ వుందా మా ఆయన్లో! ఇంతకీ చంపబోయేది నన్నా భాస్కర్రావునా.

మా ఆయన నా వంక అదోలా చూశాడు. డ్రాకులా గుర్తొచ్చింది నాకు. ఓ అడుగు ముందుకేశాడు.

అంతా అయిపోయింది శ్యామలా. మనం మొదలెట్టిన గేమ్‌కి నా డెత్ ఎండింగవుతుందనుకోలేదు మౌనంగా అనుకున్నాను.

మా ఆయనింకో రెండడుగులు వేశాడు నా వైపు.

డాక్టర్ పురుషోత్తమ్ గుర్తుకొచ్చారు "సారీ డాక్టర్. మీ వైద్య సేవలందుకొనే భాగ్యం మా ఫ్యామిలీకి లేదు"

ఇంకో నాలుగడుగులు వేశాడు.

"పిన్నీ నా మర్డర్ గురించి మా అమ్మా నాన్నలకు నువ్వే ఇన్‌ఫాం చెయ్యాలి"

ఇక నాకూ ఆయనకీ ఒక్కడుగే వుంది దూరం.

"సారీ భాస్కర్రావ్... మా శ్యామల అమాయకురాలు. దాన్ని సుఖపెట్టు"

నాకు ఆయనకీ మధ్య ఇప్పుడు దూరమే లేదు.

గట్టిగా కళ్లు మూసుకున్నాను. "భగవంతుడా! నన్ను స్వర్గానికే తీసుకుపో" కటింగ్ ప్లేయర్‌తో కత్తిరించిన సౌండ్ వినబడి చివుక్కున కళ్లు తెరిచాను. పొదల్లో మాటేసిన చీటా కళ్లలా మెరుస్తున్నాయి మా ఆయన కళ్లు. ఫోన్ వైర్‌ను ముక్కలు ముక్కలు చేస్తూ నాకేసి విజయగర్వంగా చూశాడు. ఫోన్ కాల్‌కీ భాస్కర్రావ్ నీట్ షేవ్‌కీ వున్న అవినాభావ సంబంధాన్ని కసిగా కత్తిరిస్తున్నాడు.

"భాస్కర్రావునీ నన్నూ మీరూ కటింగ్ ప్లేయరూ వేరు చెయ్యలేరు. టెలిఫోన్ లేకుంటేనేం... పోస్టల్ డిపార్ట్‌మెంట్ వుందిగా" కసిగా అనుకున్నాను. అట్లా అనుకుంటున్నప్పుడు వెలిగింది థౌజండ్ క్యాండిల్ బల్బ్ నా బ్రెయిన్‌లో. నెక్స్ట్ వాట్? అన్న ప్రశ్నకు సమాధానం దొరికింది. వితిన్ ఒన్‌డే శ్యామలకు ఇన్‌ఫర్మేషన్ కూడా వెళ్లిపోయింది.

★ ★ ★

ఆ సాయంత్రం "ఎన్నిసార్లు ఫోన్ చేసినా కాల్ దొరకటం లేదేంటబ్బాయ్" అంటూ దిగారు మా పిన్ని బాబాయ్‌లు.

"ఏంటో పిన్నీ ఉన్నట్టుండీ ఆయన ఫోన్ వైర్ కట్ చేశారు. ఏం పనండీ ఇదీ అంటే

పిచ్చి చూపులు చూస్తారు" అన్నాను దిగులుగా.

"పురుషోత్తమ్‌గార్ని కలువు నాయనా. చిన్న చిప్ మన బంగాళాదుంపంతది కూడా వుండదనుకో. మెదళ్లో పెట్టేస్తాడు. ఇక ఇట్లాంటి పిచ్చి పనులెవరైనా చెయ్యమన్నా చెయ్యవ్" అందామె నేను చేసిన పూరీ కుర్మా తింటూ.

"పాపం... అక్కడ వరండాలో కూర్చుని వున్నాడే గీత చదువుకుంటూ ఓ ముసలాయన. ఆయనకి షుగరట. ఈయనగారు ఆయనకి స్వీట్లు కొనిపెడుతూ వుంటారు. చక్కెరవ్యాధి వాళ్లకి స్వీట్లివ్వడాన్ని ఏమంటారు? " అన్నాను.

మా పిన్ని తల పంకించి మా ఆయన్తో అంది "అబ్బాయ్... నేచెప్పేది కాస్త చెవినేసుకో. ఈ వెర్రి పనులు ఆనోటా ఈనోటా పాకి మన బంధువులకీ విషయం తెలీక ముందే ఆ కేరెట్ చిప్పేదో..."

"మైక్రోచిప్ పిన్నీ"

"ఆ మైక్రోచిప్పు పెట్టించుకో నాయనా. ఏమంటావ్? " అంది.

మా ఆయన నా వంక కొరకొర చూశాడు.

"అసలబ్బాయ్. చిప్ పెట్టాక జీవితానికీ, పెట్టక ముందు జీవితానికీ ఎంత వ్యత్యాస ముందో ముందు మీ చిన మామయ్యగార్న డిగి తెలుసుకో. ఆనక నువ్వే ఒప్పుకుంటావ్ ఆపరేషన్‌కి" అంది మా పిన్ని మరో రెండు పూరీలు వెయ్యించుకుంటూ.

మా బాబాయ్ గొంతు సవరించుకుని మొదలెట్టాడు "అబ్బాయ్ అసలే జీవితమంటే ఎంతో చిన్నది. దాంతో పోలిస్తే మెదడు మరీ చిన్నది. మెదడుతో పోలిస్తే మైక్రోచిప్ మరీ చిన్నది. అయినా అది అందించే జీవన మాధుర్యం వుంది చూశావ్..."

అట్లా క్లాసు తీసుకుంటూ పోయిన మా బాబాయ్ నేను భోజనానికి పిల్చే వరకూ దాన్నాపలేదు.

భోజనాలు చేశాక బయల్దేరబోతూ అడిగింది మా పిన్ని "ఏం నాయినా మధూ... టొమేటో చిప్ విషయం"

"అబ్బా పిన్నీ మైక్రోచిప్" అన్నాన్నేను.

"ఆ మైక్రోచిప్ విషయం ఏం నిర్ణయించుకున్నావ్? "

"ఓసారెల్లి కన్సల్టవుతాలే"

ఈ మాటలన్నది అక్షరాలా మా ఆయన. నా చెవుల్ని నేనే నమ్మలేకపోయాను.

ఇక తిరుగులేదు. మేము ఈసారిచ్చే బూస్టర్ డోస్‌తో తంతే గారెల బుట్టలో పడ్డట్టు ఎగిరెల్లి పురుషోత్తంగారి కన్సల్టింగ్ రూమ్‌లో పడతాడు అనుకున్నాను తృప్తిగా.

★ ★ ★

మై హాట్ హార్ట్ విజ్జీ!

స్వీట్ బదులు 'హాట్' ఎందుకు రాశానో తెలుసా! నాకు స్వీటంటే పడదు. హాట్ అంటే నాకు అతి ప్రియం. అందుకే నాకిష్టమైన టేస్ట్‌తో నాకు ప్రియాతిప్రియమైన నిన్ను పోల్చాను.

ఇక విషయానికొస్తే...

విజ్జీ!

మామూలుగా ప్రేమికుల మధ్య అడ్డుగోడలా నిలబడేది కులమో, మతమో, ధనమో, బలమో అయివుంటుంది కానీ మన ప్రేమకు అడ్డుగోడగా నిల్చింది ఏంటో తెల్సా? పెళ్లి. చాలా వెరైటీ అడ్డుగోడ. ఇంతవరకూ ఏ సినిమాలో... ఏ రైటరూ చూపించని లేటెస్ట్ కోణం.

అయితే ఒక్కటి ప్రేమకి ఓల్డ్‌టైప్ అడ్డుగోడలెలా ఆనకట్ట వేయలేవో అచ్చు అట్లాగే మన ఈ లేటెస్ట్ అడ్డుగోడ కూడా ఆనకట్ట కాలేదు. కాబోదు.

నీ కోసం నీ ప్రేమకోసం ఏం చెయ్యమన్నా చేస్తాను. నా ప్రాణాలు కావాలంటే ఇచ్చేస్తాను.

మీ ఆయన్ని హత్య చెయ్యమంటావా. చేసేస్తాను. అయితే ఒక్కటి. డాక్టర్ పురు

షోత్తమ్‌గారి సోఫిస్టికేటెడ్ కంప్యూటరైజ్డ్ ఆపరేషన్లు అందుబాటులో వుండగా పాత కాలపు ప్రేమ కథల్లోలా సూసైడ్సూ మర్డర్సూ ఎందుకు?

మన లేటెస్ట్ ప్రేమకు అడ్డు వచ్చేది ఆఫ్టరాల్ పెళ్ళేగా! ఆ పెళ్ళినే కేన్సిల్ చేయిద్దాం. అదీ స్వయంగా మీ ఆయన చేతుల్తోనే. మీ ఆయనే మన ప్రేమను చూసి ముచ్చటపడి మన పెళ్లి దగ్గరుండి మరీ జరిపించి తను మాత్రం ఎక్కడికో దూరంగా వెళ్లిపోయేలా ప్రోగ్రాం సెట్ చేయించిన మైక్రోచిప్ మీ ఆయన బ్రెయిన్‌లో ఇన్‌సర్ట్ చేయించామనుకో ఇక మన ప్రేమకు అడ్డేముంటుంది ప్రియా?

అల్పమైన ఆపరేషన్‌తో అనంతమైన ప్రేమను గెలిపించుకున్న లవర్స్‌గా చరిత్రలో పేరు పడిపోతాం. ప్రపంచ ప్రేమికులందరికీ ఆదర్శంగా నిలబడతాం. అయితే ఒక్కటి...

మీ ఆయన్ని హాస్పిటల్‌కి తీసుకెళ్లడమెలా అనేదే మన ప్రాబ్లమ్. ఆలోచించగా నాకొకటి తోచింది. మీ హనుమాయమ్మ పిన్ని నడిచిన బాటలోనే మనమూ నడవాలని.

సో కూల్‌డ్రింక్‌లోనో, కాఫీలోనో, పాయసంలోనో, రసంలోనో ఎందులో కలుపుతావో నీ ఇష్టం. ఆపరేషన్ థియేటర్‌లో అనస్థీషియా అవసరం లేనంత స్ట్రాంగ్‌గా మత్తివ్వాలి మీ ఆయనకు నువ్వు. ఐ విల్ బి వెయిటింగ్ ఫర్ దట్‌డే విత్ థౌజండ్ ఐస్.

నీ డబ్ల్యూ.సి. హెచ్. భాస్కర్రావ్

ఆ ప్రేమలేఖను ఆసాంతం చదివిన మా ఆయన నన్ను మొట్టమొదట అడిగిన ప్రశ్న.

"డబ్ల్యూసిహెచ్ అంటే ఏంటి? "

అంతవరకూ పైటకొంగు నలుపుకుంటూ బొటన వేలితో నేలను రాస్తూ తలవంచుకుని నిలబడ్డ నేను ఉత్సాహంగా ఆయనకేసి చూశాను.

పెళ్లాం పరాయి మగాడ్ని ప్రేమిస్తుందని తెలిశాక్కూడా ఒక అర్థం కాని విషయాన్ని తెలుసుకోవాలనుకుంటున్నాడంటే రియల్లీ హి ఈజ్ గ్రేట్. ఆయనలోని జీల్‌కి మురిసిపోతూ అన్నాను. డబ్ల్యూ ఫర్ ఉడ్‌బీ, సి ఫర్ కంప్యూటర్, హెచ్ ఫర్ హజ్బెండ్, ఉడ్‌బీ కంప్యూటర్ హజ్బెండ్"

విషయం తెలుసుకున్నాక మా ఆయన దవడ ఎముక బిగుసుకుంది. నన్నో పురుగును చూసినట్టు చూసి "ఇప్పుడు భాస్కర్రావుకి నిన్నిచ్చి నేను పెళ్లి చెయ్యాలా? " కర్కశంగా అన్నాడు.

"అబ్బే... ఇప్పుడు కాదండీ. మీ బ్రెయిన్‌లో చిప్ ఇన్‌సర్ట్ చేశాక" భయంగా చూశాను.

"దేన్లో కలుపుతావ్ మత్తుమందు? " ఇంకా కర్కశంగా అన్నాడు.

"ఇంకా డిసైడ్ కాలేదండీ" ఇంకా భయంగా చూశాను.

"మీ ప్రేమకు పెళ్లి అడ్డుగోడా? ఇద్దరూ గోడ దూకుతారా? " మరీ కర్కశంగా అన్నాడు.

"అమ్మో గోడెక్కితే కళ్లు తిరుగుతాయి నాకు. ఇంక దూకడమే" మరీ భయంగా చూశాను.

"మీ ఆయన్ని హత్య చెయ్యమన్నా చేస్తానంటున్నాడు నీ ప్రియుడు. ఏదీ చెయ్యించు చూద్దాం? " హేళనగా అన్నాడు.

"మీరు ఉత్తరం సరిగ్గా చదవలేదు. ఆపరేషన్ వుండగా... హత్య దండగా అని రాశాడతను. ప్లీజ్ అభాండాలు వెయ్యకండి" మెల్లగా నసిగాను.

"మీ పెళ్లి జరిపించి నేనెక్కడికో వెళ్లిపోవాలా? " ఇంకా హేళనగా అన్నాడు.

"మా పెళ్లయ్యాక మీరిక్కడే వుంటే బాగోదని" ఇంకా మెల్లగా నసిగాను.

ఎప్పుడూ ఒక దవడ ఎముకే బిగుసుకునే ఆయన ముఖంలో ఇప్పుడు రెండు దవడల ఎముకలూ ఒకేసారి బిగుసుకున్నాయ్. చరచరా లోపలికి వెళ్లిపోయి రెండు నిము

షాల్లో సూట్‌కేస్‌తో తిరిగొచ్చాడు. నేచూస్తుండగానే నా సూట్‌కేస్ బయట విసిరి కొట్టి నా వైపు వికృతంగా చూశాడు. అనూహ్యంగా నా జుట్టు పట్టుకుని ఒక్కటే తోపు తోశాడు. బాల్కనీలో వెళ్లిపడ్డాను.

ఎట్ ద సేమ్ టైమ్.. ఎదురు పోర్షన్‌లో శ్యామల కూడా ఓ సూట్‌కేస్‌తోపాటూ ఒక్క వూపులో వచ్చి వాళ్ల బాల్కనీలో పడింది.

ఎవరి బాల్కనీలో వాళ్లం లేచి నిలబడి జుట్టూ, చీరా సర్దుకున్నాం.

ఆసరికే అన్ని పోర్షన్స్‌లో వాళ్లూ బయట కొచ్చారు. గీత ముసలాయనైతే "ఏమైందమ్మా" అంటూ నా దగ్గరకు దూసుకొచ్చాడు. సున్నుండలు తిన్న విశ్వాసం అది.

"వెళ్లి పొమ్మంటున్నారు" ఏడుపు గొంతుతో చెప్పాను.

"ఎక్కడికి పోతుందీ ఆడపిల్ల ఉన్నఫళంగా పొమ్మంటే" అంటూ మా ఆయన మీదికొచ్చారు కొందరు.

"అసలేంటి గొడవ? " అంటూ భాస్కర్రావుని పట్టుకొన్నారు ఇంకొందరు.

వాళ్లకే సమాధానమూ ఇవ్వకుండా మా ఆయన మా ఇంట్లోకీ... శ్యామల వాళ్లాయన వాళ్లింట్లోకీ వెళ్లి ఒకేసారి ధడేల్మంటూ తలుపులు మూసేశారు.

నేను శ్యామలకేసి చూసి "శ్యామలా" అంటూ బావురుమన్నాను.

అది నాకేసి చూసి విజ్జీ అంటూ బోరుమంది.

ఆ వింగ్ నుంచి అదీ ఈ వింగ్ నుంచి నేనూ స్లో మోషన్‌లో నడుచుకెళ్లి ఒకర్నొకరం వాటేసుకుని మళ్లీ బావురుమని ఓసారీ భోరుమని ఓసారి ఏడ్చేశాం.

"ఇద్దరాడపిల్లలకీ ఒకేసారి ఈ కష్టం రావడమేంటో చోద్యం కాకపోతేనూ" అంది మా పక్క పోర్షనావిడ.

ఆమెకేం తెల్సు ఒకే ఉత్తరం జిరాక్స్ కాపీల్ని మా ఆయనా, వాళ్లాయనా ఒకేసారి చదివారనీ...

"ఇప్పటికిప్పుడు పుట్టింటికంటే కష్టమేమో! ఇవాళ్టికి మా ఇంట్లో వుండండి. ఉదయాన్నే వెళుదురుగాని" అంది శ్యామల పక్క పోర్షనావిడ.

"లేదండీ... ఈ వూళ్లోనే మా పిన్నీ బాబాయ్ వున్నారు. అక్కడికెళ్తాం ఇద్దరం" అన్నాను.

వాళ్లలో ఒకరు విషాద వదనంతో వెళ్లి ఆటో పిల్చుకొచ్చారు. విచార వదనాలతో వీడ్కోలు చెప్పారు.

ఆటో మలుపు తిరుగుతుండగా అడిగాను శ్యామల్ని "అవునూ... ఆరోజు ఫోన్ చేసి తెల్లారేసరికి మీ ఆయన నీట్ షేవ్‌లో కనబడాలని చెప్పాను. అలాగే కనబడ్డారు. ఏం చేశావేమిటి? "

"గడ్డాలూ, మీసాలూ అలా పెంచుకుంటే మా విజ్జీకి ఎలర్జీ అన్నానంతే" నవ్విందది.

ఓ ఇరవై నిమిషాల్లో ఆటో మా పిన్ని ఇంటి ముందాగింది.

★ ★ ★

తెల్లారీ పాటికల్లా దిగారు మా అమ్మానాన్నా, శ్యామల అమ్మానాన్నా.

ఉదయాన్నే స్నానం అదీ చేసి ఫ్రెషప్ అయ్యి వరండాలో కూర్చుని కాఫీ తాగుతూ న్యూస్ పేపర్ చెరో పేజీ చదువుతున్నాం.

శ్యామల అమ్మ రావడం... రావడం "సిగ్గూ శరమూ లేవటే నీకు? వెకిలివేషాలూ నువ్వూనూ. అయినింటి ఆడపిల్లవేనా నువ్వు" అంటూ దానిమీద పడిపోయింది.

మా అమ్మేమో... "ఉద్యోగం వెలగబెడుతోందిగా. ఒళ్ళు కొవ్వెక్కింది. ఊరు ఊరంతా ఏల్తోంది" అంటూ నామీద పడింది.

నాకర్థమైపోయింది ఇది మా డబ్ల్యూ.సి. హెచ్. డాట్‌కామ్ ఇచ్చిన ఇ.మెయిల్ దెబ్బ అని. దాంతో వీళ్ళిట్లా ఆఘమేఘాలమీద వచ్చారని.

# ఏరిన ముత్యాలు

* ఇతరులలో భయాన్ని ప్రవేశపెట్టేవాడు నిత్య భయస్థుడు.

– గ్లాడియన్

* వివాదంలో ఒక మూర్ఖుడితో వాదించి గెలవడం అసాధ్యం.

– విలియం జి.మెకాలే

* నేను ఆశ్రమానికి వెళ్లటానికి, ముక్కు మూసుకొని ధ్యానించడానికిగానీ ఇష్టపడను. కష్టించి పని చేయడమే నాకు ప్రీతిపాత్రము.

– జె.ఆర్.డి.బాబా

* ఖచ్చితమైన రోగనిర్ధారణ ముప్పాతిక చికిత్సతో సమానం.

– మహాత్మాగాంధీ

* క్షీణించని, ప్రతిఫలాలనిచ్చే ఉత్పత్తి సాధన విజ్ఞానం ఒక్కటే.

– జె.ఎమ్.క్లార్క్

* జగత్తున పరువు ప్రతిష్టలు నిలుపుకోవడమే మనిషి జీవితాదర్శము.

– రామకృష్ణ పరమహంస

* మనిషి దేహం ఒక జ్వాల. అది ప్రసరించే కాంతి అతని తెలివి.

– డి. హెచ్.లారెన్స్

* ప్రపంచంలో ఒంటరిగా పోరాడే వాడే అత్యంత బలమైన వ్యక్తి.

– హెన్రిక్ ఇబ్సన్

* లెక్కింపలేని జీవితాల యొక్క సారాంశమే చరిత్ర.

– థామస్‌కార్లీ

* సంపాదనలో క్లేశాన్ని, సంరక్షణలో భయాన్ని, కష్టంలో సంతాపాన్ని చేకూరుస్తుంది ధనం.

– ఎమ్. హెన్రీ

* బాధ అంతటి తీవ్రం కాదు మరణం.

– ఆండీమార్‌రాక్స్

* ఒక మతాన్ని ద్వేషించడంకన్నా ఏ మతాన్ని నమ్మకపోవడం మిన్న.

– యు. పెన్

* కష్టాలను చాలామంది ఎదుర్కొనగలరు. కానీ ద్వేషాన్ని ఎక్కువమంది తట్టుకోలేరు.

– ఫుల్లర్

సేకరణ: ఎ.ఎస్.జైకిరన్

"ముందు మీరెళ్ళి స్నానం పానం కానివ్వండి. అంతదూరంనుండి అలసిపోయి వచ్చారు" అంది మా పిన్ని ఆ రెండు మిడిల్ ఏజ్డ్ జంటలతో.

"ఆడదానికి భర్త తర్వాతేనే ఎవరైనా. భర్తను కాదనుకుంటే కళ్ళుపోతాయ్" అంది శ్యామల అమ్మ దానితో.

"కనీసం సైటు కూడా రాలేదమ్మా నాకు. నువ్వు కంగారుపడకు" అంది శ్యామల.

"ఎంత చదువు చదివినా, ఎన్ని డిగ్రీలు తెచ్చుకున్నా భర్త దగ్గర వున్నప్పుడేనే ఆడదానికి గౌరవం" అంది మా అమ్మ నాతో.

"ఇప్పుడేమైంది నా గౌరవానికి. భర్త దగ్గర వున్నప్పుడు ఏ కప్పులో కాఫీ ఇచ్చేదో ఇప్పుడూ అదే కప్పులో ఇచ్చింది పిన్ని. ఇట్ మేక్స్ నో డిఫరెన్స్" అన్నాన్నేను.

"ముందు మీరెళ్ళి స్నానం, పానం కానివ్వండి. అంత దూరంనుండి అలసిపోయి వచ్చారు" అంది మా పిన్ని ఇంకోసారి.

"అసలేం జరిగిందమ్మా" అన్నాడు శ్యామల నాన్న శ్యామలతో.

"నథింగ్ నాన్నా... జస్ట్ విజ్జీ వాళ్ళాయనకి నేను సైటేశా" అందది.

"మతి భ్రమించలేదు కదా" అన్నాడాయన తాటాకు మంటలా గుప్పుమంటూ.

"ముందు మీరు స్నానం పానం..." మా పిన్ని మాటల్ని మధ్యలోనే అడ్డుకుంటూ, "అసలేం జరిగిందమ్మా" అన్నాడు మా నాన్న నాతో.

"నథింగ్ నాన్నా... జస్ట్ శ్యామా వాళ్ళాయనకి నేను లైనేశా" అన్నాను.

"దీనికేదో దయ్యం పట్టింది" అన్నాడు మా నాన్న తారాజువ్వలా సర్రుమంటూ.

"వాళ్ళాయనకు నువ్వు సైటు కొట్టడమేంటీ... మీ ఆయనకు ఆ పిల్ల లైను వెయ్యడమేంటీ. ఓర్నాయినో... ఇదేదో గాలి చేష్టే" అంటూ శ్యామల వాళ్ళమ్మ ఏడుపందుకుంది.

మా అమ్మ కూడా సేమ్ డైలాగ్ కొట్టి తనూ కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

"ముందు మీరెళ్ళి స్నానం"

"అల్లుడిగారికి ముఖమెట్లా చూపాలండీ" అంది వాళ్ళమ్మ వెక్కుతూ.

"పిన్ని చెప్పినట్టు స్నానం చేసి ఫ్రెషప్ అయ్యాక చూపండి" అంది శ్యామల.

"అల్లుడిగారి ముఖమెట్లా చూడాలండీ?" అంది మా అమ్మ.

"ఆయన ముఖానికేమమ్మా. రెండు పూట్లా స్నానం, నీట్ షేవూ ఏ ప్రాబ్లమ్ వుండదు మీకు" అన్నాను.

"ముందు మీరు..."

"ఒళ్ళు బలిసిందండీ" అంది శ్యామల వాళ్ళమ్మ.

"కొవ్వెక్కి చస్తోంది" అంది మా అమ్మ.

ఇక మా పిన్నికి చిర్రెత్తుకొచ్చినట్టుంది.

"ముందు మీరు స్నానం పానం కానివ్వండి. ఆనక అన్నీ సావధానంగా మాట్లాడుకోవచ్చు" అంటూ ఒక్కపెట్టున అరిచేసరికి గప్‌చిప్‌గా అయిపోయి పిల్లుల్లా వెళ్ళిపోయారు లోపలికి.

"డర్టీ క్రీచర్స్... అనవసరంగా అమ్మానాన్నాలకు ఇన్‌ఫాం చేశారు" కోపంగా అన్నాను.

"వీళ్ళవల్ల కథ అడ్డం తిరగదుకదా" అంది శ్యామల.

"ఖచ్చితంగా తిరుగుతుంది వివరాలు తెలిస్తే. సో... డోంట్ లీక్ ద మేటర్" అంది వాళ్ళను మాధవికి అప్పగించి బయటకు వచ్చిన మా పిన్ని.

"కంగ్రాట్యులేషన్స్ పిన్నీ. అప్పుడే ఇంగ్లిష్ మాట్లాడేస్తున్నావ్" అన్నాను ఆనందంగా.

"థాంక్యూ" అంది మా పిన్ని మురిసి ముక్కలవుతూ.

"ఇప్పుడు వీళ్ళు స్నానాలవీ చేసి అల్లుళ్ళని విజిట్ చేయడానికి వెళ్తారు కాబోలు" అంది శ్యామల.

"లెట్ దెమ్ గో... వాటీజ్ దేర్" అంది

మా పిన్ని.

స్నానాలయ్యాక టిఫిన్లు మొదలయ్యాయి. వాళ్ళతోపాటూ నేనూ, శ్యామలా కూడా కూర్చున్నాం.

"నాచారం గ్రామంలోనటండీ... వంట బాగా చెయ్యడంలేదని విసుగెత్తిపోయి భార్యను స్టౌమీదకి తోసి చంపాట్ట ఓ దరిద్రుడు" అంది మా అమ్మ శ్యామల వాళ్ళమ్మతో.

"వాడి టేస్టు వాడిది" అన్నాన్నేను.

మా అమ్మ నన్నేదో అనబోయిందిలా వుంది. పొలమారింది. నేను మంచినీళ్ళం దిస్తే తీసుకోకుండా వేరే గ్లాసు తీసుకుంది.

శ్యామల వాళ్ళమ్మగారు నావైపో చూపు చూసి, "అదేం చెప్తారూ. ఇది వినండి పూసలపాడులో ఓ భార్య మల్లెపూలు తేవడంలేదని అలిగి, భర్తను కత్తిపీటతో మెడ నరికి చంపేసిందట. ఎలాగుందో చూడండి కాలం" అంది.

"ఆవిడ టేస్టు ఆవిడది" అంది శ్యామల.

శ్యామల వాళ్ళమ్మక్కూడా పొలమారింది అచ్చు మా అమ్మలాగే. శ్యామల అందించిన నీళ్ళు తాక్కుండా వేరే గ్లాసు అందుకుంది.

మా హనుమాయమ్మ పిన్ని ఇంత పొడవు నిట్టూర్పు విడిచి, "జనరేషన్ గ్యాప్... వి కాన్ట్ డు ఎనీథింగ్" అంది.

ఓ అరగంట తర్వాత గాలివాన వెలిసింది. వాళ్ళు అల్లుళ్ళను మీటవడానికి వెళ్ళిపోయారు. వాళ్ళు వెళ్ళిపోయాక చెప్పింది మా పిన్ని "నువ్వివాళ ఆఫీస్‌కెళ్ళి ఓ వారం రోజు లీవ్ పడేసి రావే"

★ ★ ★

ఉదయం తొమ్మిదనగా వెళ్ళినవాళ్ళు సాయంత్రం నాలుగవుతుండగా వచ్చారు. రావడం రావడమే కాళ్ళయినా కడుక్కోకుండా "నిజంగా ఆ అబ్బాయి మనిషికాదే. దేవుడు" అంది మా అమ్మ.

మా అమ్మ "ఆ అబ్బాయి మనిషి కాదే" అంటున్నప్పుడు ఇంకేంటో అంటుందని ఆశ పడ్డ నేను 'దేవుడు' అనడం విని నిరుత్సాహపడ్డాను.

"ముందు కాళ్ళూచేతులూ కడుక్కుని కాస్త తెరిపిన పడండి" అంది మా పిన్ని.

"మా అల్లుడు మాత్రం ఈ కాలంలో వుండాల్సినవాడు కాదు. సత్తెకాలపు సత్తెయ్య" అంది శ్యామల వాళ్ళమ్మ.

"ఏయ్... మీ ఆయనపేరు భాస్కరరావు కదూ" డౌట్‌ఫుల్‌గా చూశాను.

"ముందు కాళ్ళూచేతులూ... " మా పిన్ని కంటిన్యూ చేసింది.

మా పిన్ని మాటలు పట్టించుకోకుండా "నేను వంట చేస్తా బాబూ అన్నా వినకుండా అప్పటికప్పుడు పరుగెత్తి కేరేజ్ తెచ్చాడా అబ్బాయి" ఎదుటి మనిషి ఫేషియల్ ఎఫెక్ట్ కోసమన్నట్టు ఆగింది మా అమ్మ.

"పరుగెత్తడమెందుకు. మీ ఆయనకు బైక్ వుందిగా" అంది శ్యామల నొసలు ముడేసి.

"ముందు కాళ్లూ... చేతులూ"

"నేనెంత వద్దన్నా వినకుండా తనే స్వయంగా వండి వడ్డించాడు" అంది శ్యామల వాళ్ళమ్మ.

'శ్యామలా... ఎప్పుడైనా నీ మొగుడు నీకు కూరగాయలన్నా తరిగిచ్చాడే" అన్నాను ముక్కున వేలేసుకుని.

"ముందు కాళ్ళూచేతులూ..."

"సరే ఇంతకీ అబ్బాయి లేమన్నారమ్మా" అన్నాడు మా బాబాయ్.

ఆయన ప్రశ్నకు సూటిగా సమాధానం ఇవ్వకుండా మొదలెట్టింది మా అమ్మ "విషయమంతా చెప్పాడు. సిగ్గుతో చితికిపోయామనుకో" అంటూనే, "మీ అల్లుడికిదేం రోగం... మా అమ్మాయివెంట పడ్డాడు" అంది.

శ్యామల వాళ్ళకు సూటిగా తగిలిందా మాట.

"మీ అల్లుడికిదేం రోగం మరి. మా శ్యామలమీద కన్నేశాడు" అనేసిందావిడ.

ఇక మాటామాటా పెరిగింది. మగవాళ్ళ నోళ్ళు కూడా లేచాయి.

"మా అల్లుడు అమాయకుడు మీ అమ్మాయే నంగనాచి"

"మా అల్లుడు నోట్లో వేలుపెట్టినా కొరకలేడు. మీ పిల్లే మాయలాడి"

"మా అమ్మాయికి అభంశుభం తెలీదు. వల్లో వేసింది మీ అల్లుడే"

"మా అమ్మాయికి అన్నెంపున్నెం తెలీదు. ముగ్గులోకి దింపింది మీ అల్లుడే"

"మాటలు తిన్నగా రానివ్వండి"

"ఒళ్ళుదగ్గర పెట్టుకోండి"

"ముందు మీ అల్లుడి రోగం కుదర్చండి. ఆనక మా గురించి మాట్లాడొచ్చు"

"అంతకంటే ముందు మీ అల్లుడురోగం కుదుర్చుకోండి అట్టే వాక్కుండా"

"మా మొగుళ్ళిద్దరికీ ఎయిడ్సూ, సార్సూ లాంటి రోగాలేం లేవు. మీరెవరి రోగమూ కుదర్చాల్సిన అవసరంలేదు" అంటూ నేనూ, శ్యామలా కోరస్‌గా గొంతు చించుకున్నాక అందరూ సర్దుమణిగారు.

"ఇప్పటికైనా కాళ్ళూచేతులూ..." అంటూ అందుకుంది మా పిన్ని.

ఒళ్ళు మండిపోతోందేమో... ఈసారి ఆమె మాట తీసెయ్యకుండా వెళ్ళి కాళ్ళూచేతులూ కడుక్కొచ్చారు. అందరికీ మాధవి కాఫీలు సప్లయ్ చేసింది.

తగవుకు ముందడిగిన ప్రశ్నను అప్పుడడిగాడు మా బాబాయ్ మళ్ళీ "ఇంతకీ అబ్బాయిలేమన్నారమ్మా"

"మా అల్లుడు అమ్మాయిని తీసుకెళ్ళడానికి రేపొస్తానన్నారు, వాళ్ళ అల్లుడి సంగతి మాకు తెలీదు" అన్నాడు నాన్న.

"మా అల్లుడూ అదే చెప్పాడు. అమ్మాయి దగ్గరకు రేపొస్తాట్ట" అన్నాడు శ్యామల వాళ్ళ నాన్న.

ఆ రాత్రి అందరం మేడమీద పక్కలేసుకున్నాం. పెద్దవాళ్ళింకా కింద అల్లుళ్ళ మేటర్లో తర్జనభర్జనలు పడుతున్నారు ఎవరికివారే ఎడముఖం పెడముఖంగా కూర్చుని.

మా అమ్మానాన్నకూ, శ్యామల అమ్మానాన్నకూ సంధానకర్తలుగా వ్యవహరిస్తూ మా పిన్నీబాబాయ్ కూడా కిందే వున్నారు. మాధవి వంటగది సర్దుకుంటోంది.

నేనూ, శ్యామలా అందరికంటే ముందే మేడెక్కేసి పరిచి వున్న పక్కలమీద అలా దొర్లిపోయి కబుర్లు చెప్పుకుంటున్నాం. చల్లగాలికి ప్రాణం ఎటో పోతోంది.

"అవును శ్యామూ... సూట్‌కేస్‌లతోసహా మెడబట్టి బయటకు గెంటిన మన ప్రబుద్ధులు అత్తామామలు కనబడగానే ఐసయిపోయి అమ్మాయిల్ని ఏలుకోవడానికి వస్తాననటం ఏంటి? ఇందులో ఏదో చిదంబర రహస్యముంది" అన్నాన్నేను.

"నాకూ అలాగే అన్పిస్తోందే. మా ఆయనైతే ఆ వుత్తరం చదివి అగ్గిమీద గుగ్గిలమయ్యాడనుకో. జన్మజన్మలకు నీ ముఖం నాకు చూపించొద్దూ... అన్నాడు. మరి తెల్లారేపాటికే ఈ ముఖాన్నెందుకు చూడబోతున్నట్టో" అంది శ్యామల.

నేనేదో అనబోతున్నంతలో మెట్లమీద అడుగుల చప్పుడైంది.

ఒక్కొక్కరుగా మొదలెట్టి పది నిమిషాలకంతా అందరూ పైకి చేరుకున్నారు.

మా సత్యానారాయణ బాబాయ్ మాధవి మాత్రం కిందే పడుకుంటామన్నారట. పైకి రాలేదు.

ఓ జంట ఉత్తరధృవంలో, మరోజంట దక్షిణ ధృవంలో సెటిలయ్యారు. మా పిన్ని నా పక్కన సర్దుకుంది. శ్యామల నామీద ఓ చెయ్యి వేసి పడుకుంది. చల్లగాలి మమ్మల్ని జోకొట్టి జోలపాడి కళ్ళమీదకు కమ్మని నిద్ర తెరలు తెస్తున్న టైంలో...

"అమ్మాయ్ హనుమాయమ్మా... అక్కడ చూస్తే మన అల్లుడికీ భాస్కర్రావుకీ మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటోంది. మరిక్కడ వీళ్ళేమిటీ ప్రాణస్నేహితుల్లా ప్రవర్తిస్తు

న్నారు" అంటూ వినబడింది మా అమ్మ స్వరం.

వెనువెంటనే "అదే నాకూ అర్థంకావడం లేదు" అంటూ లేచి కూర్చుంది శ్యామల వాళ్ళమ్మ.

ఉలిక్కిపడి లేచాం నేనూ, శ్యామలా.

మా హనుమాయమ్మ పిన్ని నాలుక్కరుచుకోవడం మేడమీదకు ప్రసరిస్తున్న స్ట్రీట్ లైట్ వెలుగులో స్పష్టంగా కన్పించింది నాకు.

వెంటనే రియాక్టయిపోయి "ఛీ... చెయ్యి తియ్. సిగ్గులేదూ నా మొగుణ్ని వల్లో వేసుకుని నాతో పూసుకోవడానికీ" అన్నాను.

శ్యామల కాల్తున్న పెనంమీంచి చెయ్యిని తీసినట్టు నా నుంచి చటుక్కున చెయ్యితీసి, "ఛూ... బుద్ధిలేదూ. నా మొగుణ్ని కొంగున కట్టేసుకుని నాతో రాసుకోవడానికీ" అంది.

హనుమాయమ్మ పిన్ని తృప్తిగా నిట్టూర్చి మా అమ్మతో అంది. "చూశావుటే అక్కయ్యా. వీళ్ళా ప్రాణ స్నేహితులు. హవ్వ... నిన్నటినుంచీ సయోధ్య చేస్తే ఈ మాత్రంలో వున్నారు వీళ్ళు. నిన్న వచ్చినప్పుడు నువ్వు చూడలేదుగానీ ఒకళ్లనొకళ్ళు రక్కేసుకున్నారనుకో. మీరు ఉదయం వచ్చినప్పుడు చూసుంటారు. వరండాలో... ఆ మూలొకరూ, ఈ మూలొకరూ కదా కూర్చుని వున్నారు" అంది.

ఆ తర్వాత మా ఇద్దరిమధ్యా తను దూరిపోయి మమ్మల్ని సెపరేట్ చేసి "కొట్టుకున్నారో ఐ విల్ కిల్ యు" అంది.

మా అమ్మా... శ్యామలా వాళ్ళమ్మా డౌట్ క్లియర్ కావడంతో చల్లగాలికి శరీరాలప్పచెప్పి కళ్ళు మూసుకున్నారు.

★ ★ ★

కొంచెం శనగపప్పూ, రెండుగిన్నెల కొబ్బరి రోట్లో వేసి రుబ్బుతూ అడిగింది వాళ్ళక్కయ్యను... అదే మా అమ్మను మా హనుమాయమ్మ పిన్ని, "అక్కయ్యా! అబ్బాయిలొచ్చేది ఈ పూటేనా" అని.

"మనబ్బాయి మాత్రం సాయంత్రం ఆరు గంటలకొస్తానన్నాడు. వాళ్ళబ్బాయి సంగతి నాకేం తెల్సు" అంటూ మూతి విరిచింది మా అమ్మ.

"మా అబ్బాయి గురించి మాకు తెలుస్తుందికానీ ఊళ్లో వాళ్ళకేం తెలుస్తుందీ" అని ముక్కువిరిచి "సాయంత్రం ఆరుకొస్తానన్నారు హనుమాయమ్మా" అంది మా పిన్నితో శ్యామల వాళ్ళమ్మ.

అంటే మా డబ్ల్యూ.సి. హెచ్.ల మీటింగ్ టైం ఒక్కటేనన్నమాట.

"శ్యామలా లాస్ట్ బర్త్‌లో మనది ఒకే ప్రాణం అయ్యుంటుందే. ఏవో పాలిటిక్స్ వల్ల ఈజన్మలో ఇలా వేరువేరుగా పుట్టాం" అన్నాను.

మా అమ్మ నాకేసి అనుమానంగా చూసింది. వెంటనే రియాక్ట్ అయ్యాను. "చేతనైతే నీ మొగుణ్ని నువ్వే కాపాడుకోపో" అన్నాను.

"చూస్తావుగా... నేనేం చేతులు ముడుచుక్కూర్చోను" అంది శ్యామల.

"స్టాప్ క్వారలింగ్" అంది ఇడ్లీ చట్నీ గిన్నెలోకి తోడుతున్న మా పిన్ని.

"ఈవిడ ఇంగ్లిష్ ప్రాక్టీసంతా మనమీదే చేస్తోందేంటే" అన్నాను శ్యామలవంక చూడకుండా ఎటో చూస్తూ.

ఈసారి శ్యామల వాళ్ళమ్మ మాకేసి కళ్ళు చిట్లించి చూడ్డంతో ఇక అక్కడుండడం క్షేమంకాదని బావిపక్కనే వున్న చెట్టునుంచి పూజకు ముద్దమందారాలు కోస్తున్న మాధవికేసి వెళ్ళిపోయాను. నేనూ మందారాలు కొయ్యబోతుంటే... "నువ్వు నందివర్ధనాలు కొయ్యక్కయా. త్వరగా పనవుతుంది. నాన్నక్కడ పూజగదిలో సెటిలైవుంటారీపాటికి" అంది మాధవి.

ఇడ్లీలూ, చట్నీ అదిరిపోయాయి. ఇడ్లీల పైన కమ్మటి నెయ్యి పోసిందేమో నోట్లో వేసుకుంటే కరిగిపోతున్నాయ్.

వాటి రుచి దెబ్బకు ఇటు మా అమ్మా నాన్నా అటు శ్యామల వాళ్ళ అమ్మానాన్నా వాదోపవాదాలు మర్చిపోయి కాసేపు లోకాభిరామాయణం చెప్పుకున్నారు. చేతులు కడిగిన వెంటనే మళ్ళీ ఎప్పట్లా ముఖాలు తిప్పేసుకున్నారు.

సాయంత్రం ఆరెప్పుడవుతుందా వీళ్ళు ఏ ముఖాలు పెట్టుకువస్తారా అని నేనూ, శ్యామలా ఎదుర్చూస్తున్నాం. వాళ్ళేం అడుగుతారో, మేమెట్లా సమాధానాలివ్వాలో కూడా ఊహించుకుంటున్నాం.

సరిగ్గా ఆరవుతుండగా వీధి గుమ్మానికటువేపు బుల్లెట్, ఇటువేపు హోండా పోటాపోటీల మీద ఆగాయి.

నేనూ, శ్యామలా తొంగి చూశాం. తల మీద హెల్మెట్లతో మా డబ్ల్యూ.సి.హెచ్.లిద్దరూ అంతరిక్షంనుండీ ఊడిపడ్డ వ్యోమగాముల్లా వున్నారు.

ఇద్దరూ ఒకేసారి హెల్మెట్లు తీసి ఎడం చేత్తో పట్టుకుని ఒకర్నొకరు కొరకొర చూసుకున్నారు. ఆ తర్వాత ఒకేసారి ఇద్దరూ కుడి పాదం మెట్టుమీద పెట్టి చకచకా లోపలికొచ్చారు.

"రా బాబూ... ఆఫీస్‌నుంచా" అడిగాడు మా నాన్న మా ఆయన్ని ఆప్యాయంగా ఆహ్వానిస్తూ.

"నేరుగా ఆఫీసునుంచేనా నాయనా" అంటూ భాస్కర్రావుని సాదరంగా ఆహ్వానించాడు శ్యామల వాళ్ళ నాన్న.

"అమ్మాయ్, శ్యామలా! అబ్బాయొచ్చాడే" ఆనందాతిరేకంతో అరిచింది శ్యామల వాళ్ళమ్మ.

"విజ్జీ... మీ ఆయనే" అంది మా అమ్మ సంబరంగా.

నేను మా ఆయనకేసి చూశాను.

భాస్కరరావు శ్యామలకేసి చూశాడు. ఇంతలో మా పిన్ని హడావుడిగా వచ్చింది.

"ముందు ముఖాలు కడుక్కోండి నాయనా" అంది.

"పద ఇంటికెళ్దాం" అన్నాడు మా ఆయన గొంతు కరుగ్గా పెట్టి.

"మేల్ ఈగోనా?" అన్నాను. మా ఆయన పిలిచిన తీరు నచ్చలేదు నాకు.

"త్వరగా బయల్దేరు" అన్నాడు భాస్కర్రావు శ్యామలతో.

"మేల్ ఈగోనా?" అంది అది కూడా.

"ముందు ముఖాలు..." అంటోంది మా పిన్ని.

"ఏంటి నీ ఉద్దేశ్యం" అన్నాడు మా ఆయన నాతో.

"అలాగేనా పిల్చేది" అన్నాను.

"ఏంటి నీ ఉద్దేశ్యం" అన్నాడు భాస్కర్రావు శ్యామలతో.

"అలాగేనా పిల్చేది" అంది శ్యామల.

"ముందు ముఖాలు..." మళ్ళీ పాటందుకుంది మా పిన్ని.

"ఇంకెలా పిలవాలో" అన్నాడు శ్యామా వాళ్ళాయన.

"ప్రేమతో" అంది.

"ఇంకెట్లా పిలవాలో" అన్నాడు మా ఆయన.

"ప్రేమతో" అన్నాను.

"ఆ సినిమా పోయి చాన్నాళ్లయింది నాయనా. ఇప్పుడెక్కడా ఆడుతున్నట్టు లేదే" అంది దూరంనుండి మా సంభాషణ వింటున్న మా పిన్ని.

"నువ్వూరుకో. వాళ్ళను మాట్లాడుకోనివ్వు" అంది మాధవి.

"ఇంతకీ వస్తావా రావా" అన్నాడాయన అసహనంగా.

"ప్రేమతో రా... అంటే కదా వస్తాను" అన్నాను.

"ఇంతకీ వస్తావా... రావా" అన్నాడు భాస్కర్రావు అసహనంగా.

"ప్రేమతో రా... అంటేకదా వస్తాను" అంది శ్యామల.

"నేచెప్పలేదుటే. వాళ్ళు మాట్లాడుకొంటున్నది వెంకటేష్ సినిమా గురించే" మాధ

వితో అని గబగబ మా దగ్గరకొచ్చింది మా పిన్ని.

"ఆ సినిమా ఎక్కడాడుతోందో నేకనిపెడ తాగా. అలకలు తీరాయిగా. ఎంచక్కా చూద్దురుగాని... ముందు ముఖాలు కడుక్కొని సేదతీరండి" అంది.

మా ఆయనకీ... శ్యామల వాళ్ళాయనకీ కూడా అదే మంచిదన్పించిందేమో... మారుమాట్లాడకుండా వెళ్ళి ముఖాలే కాదు ఏకంగా స్నానాలే కానిచ్చి వచ్చారు.

మా అమ్మ నన్నూ... శ్యామల వాళ్ళమ్మ శ్యామలనూ బెదిరించి, బుజ్జగించి మేమే మా మొగుళ్ళకు కాఫీ ఫలహారాలందించేట్టుగా ఒప్పించారు.

మా పిన్ని కూడా "వాటీజ్ దేర్... ఇవ్వండమ్మా" అంది.

ఇద్దరూ అటొక చెయిరూ ఇటొక చెయిరూ... ఒకరివీపు ఇంకొకరికి చూపిస్తూన్నట్టు వేసుక్కూర్చున్నారు.

మాధవి చేసిన రెడీమేడ్ టిఫిన్ జీడిపప్పు ఉప్మా ప్లేట్లు తీసుకుని ఉత్తర ధ్రువంలో కూర్చున్న మా ఆయనకేసి నేనూ... దక్షిణ ధ్రువంలో కూర్చున్న వాళ్ళాయనకేసి శ్యామలా వెళ్ళాం. నావంకో సారీ... ఉప్మావంకోసారీ... మార్చి మార్చి చూసి ప్లేటందుకున్నాడు.

ఉప్మామీద కనబడుతున్న జీడిపప్పు పలుకు నోట్లో వేసుకోబోతూ ఉలిక్కిపడ్డట్టు ఆగిపోయాడు. నా కళ్ళలోకి క్రూయల్‌గా చూసి "మత్తు కలిపావ్ కదూ ఇందులో" అన్నాడు.

దక్షిణ ధ్రువంలోని భాస్కర్రావు కూడా శ్యామలని సేమ్ టైప్‌లో సేమ్ క్వశ్చెన్ అడిగి వుంటాడేమో- మరి వాళ్ళ మాటలేవీ నాకు విన్పించడంలేదు.

మత్తుమందు కలపాలనుకున్నది... కూల్‌డ్రింక్‌లో కానీ... కాఫీలో కానీ... పాయసంలో కానీ... రసంలోకానీ... కదండీ... ఉప్మాలో కాదుగా" అన్నాను.

"ఓఁ... కరెక్ట్... అయితే నో ప్రాబ్లమ్ విత్ ఉప్మా" అంటూ ఉప్మా లాగించటం మొదలెట్టాడు. భాస్కర్రావుకీ శ్యామల ఆ ఫోర్ ఐటమ్స్ గుర్తు చేసిందేమో మారుమాట్లాడకుండా ఉప్మా తింటున్నాడు.

అమాంతం నా అరచేతులు పట్టుకుని తన చెంపలకేసి రాసుకున్నాడు మా ఆయన.

"విజ్జీ! నిన్నట్లా కోపంలో ఇంట్లోంచి గెంటేశానేగానీ... నువ్వెళ్ళిపోయాక ఇల్లంతా శూన్యమైపోయింది. అసలా రోజంతా పచ్చి మంచినీళ్ళు కూడా తాగలేదంటే నమ్ము" అంటున్న ఆయన కళ్ళలో కన్నీళ్ళు.

కలా... నిజమా అని నన్ను నేనే గిల్లి చూసుకున్నాను.

"నో డౌట్ విజ్జీ... ఇది కలకాదు నిజం. నేనూ గిల్లనా? " అన్నాడు నా బుగ్గమీద చిలిపిగా గిల్లుతూ.

ఆ రాత్రి భోజనాలయ్యాక నాకూ మా ఆయనకూ మేడమీదా... శ్యామలకీ వాళ్ళాయనకీ కింది గదీ అలాట్ చేశారు, మన సారా మాట్లాడుకొని ఓ నిర్ణయానికి రమ్మని.

★ ★ ★

మాటకు మాటా సమాధానం చెప్పాలని చాలా పవర్‌ఫుల్ డెసిషన్ తీసుకుని వచ్చిన నేను మా ఆయన కళ్ళలో కన్నీళ్ళు చూసి మంచులా కరిగిపోయాను.

"మోసపోతున్నావ్" అంది నా మనసు.

"విజ్జీ! మన పెళ్ళయిన కొత్తలో మనం ఎన్నెన్ని అనుకున్నామో గుర్తుందా! ఏడేడు జన్మలకీ మన బంధం విడిపోకూడదు. చావైనా బతుకైనా కలిసే అనుభవించాలనీ... ఓ వేసవి సాయంకాలం నీ ఒళ్ళో పడుకుని... చందమామమీద ఒట్టేసి చెప్పాను గుర్తుందా? " అన్నాడు నా ముఖాన్ని దోసిట్లోకి తీసుకుని.

నేను పరవశనైపోయాను.

"మీకు గుర్తుందా! ఒక హేమంత

 

రాత్రిలో ఆరుబయట చలిమంట వేసుకుని ఒకరి కళ్ళలోకి ఒకరం చూసుకుంటూ... ఒకర్ని విడిచి ఒకరం... క్షణం కూడా వుండకూడదని అగ్నిసాక్షిగా అనుకున్నాం" అన్నాను మా ఆయన కళ్ళలోకి తమకంగా చూస్తూ.

"మరి రెండు రోజులుగా నన్ను విడిచి ఎట్లా వున్నావమ్మా?" అన్నాడు నా కనురెప్పల్ని చుంబిస్తూ.

"ఇది మోసం కాదు" అంది నా మనసు.

అంతే... ఇక కబుర్లలో దొర్లిపోయింది కాలం. అసలు మేం నిద్రేపోలేదు. తూర్పు తెల్లబడుతుంటే అర్థమైంది, తెల్లవారిందని.

మా ఆయన వెనకే సిగ్గులొలుకుతూ కొత్త పెళ్లికూతురిలా దిగుతున్న నన్ను చూసి మా అమ్మ ముఖం వెలిగిపోయింది. ఈ వార్త మా నాన్న చెవిని వెయ్యడానికేమో హడావుడిపడుతూ వెళ్ళింది.

నా కళ్లు శ్యామలకోసం వెదికాయి.

"వాళ్ళ గది తలుపులింకా తెరుచుకోలేదక్కయ్యా. అసలివాళ్టికి తెరుస్తారో లేదో" అంది మాధవి.

"పెళ్లికాని పిల్లవి. ఏంటా మాటలు?" అన్నాను సిగ్గుని కోపం మాటున అదిమిపెడుతూ.

నేను పెరట్లో బ్రష్ చేసుకుంటున్నప్పుడు... కళ్ళు నులుముకుంటూ వచ్చింది శ్యామల.

"అమ్మాయి కళ్లల్లో ఎర్రగులాబీలూ... చెంపల్లో ముద్దామందారాలూ విరబూశాయే" అన్నాను.

శ్యామల అందంగా సిగ్గుపడింది.

అంటే... రాత్రి సీన్ సేమ్ టు సేమ్ అన్నమాట. ఇదేం విచిత్రం. అన్నీ ఇద్దరికీ ఒక్కలాగే. 'ప్రాణస్నేహం' అంటే ఇదేనేమో.

మా ఇద్దరి వాలకం చూసి మా హనుమాయమ్మ పిన్ని కాస్త కంగారుపడింది. చాటుగా పిల్చి "నమ్మొచ్చటే"అంది.

"కన్నీళ్లు పెట్టుకున్నాడు పిన్నీ. హృదయం ఎంతగా కదిలితేనో కదా కళ్ల లోంచి కన్నీరు జారేది?" అన్నాను.

"ఆయన కూడా అంతే పిన్నీ... రాత్రంతా ఒకటే ఏడుపు. ఆ కన్నీళ్లకు నా కొంగంతా ముద్దయిపోయిందనుకో" అంది శ్యామల.

"ఏడ్చే మగాడ్ని నమ్మకూడదంటారే" అంది పిన్ని ఆందోళనగా.

"అవన్నీ మూఢనమ్మకాలు పిన్నీ" అంటూ కొట్టిపారేశాను.

ఆ సాయంత్రం మా అమ్మా నాన్నా... శ్యామల వాళ్ళమ్మా నాన్నా... రాలుస్తున్న ఆనందభాష్పాల్లో తడుస్తూ అందరికీ బైచెప్పి బుల్లెట్ మీద నేనూ, హోండామీదా శ్యామలా ఎక్కాం.

మా సత్యనారాయణ బాబాయ్ కళ్ళతోనే ఆశీర్వదించాడు చల్లగా వుండమని.

మా పిన్ని మాత్రం "బి కేర్‌ఫుల్... విజ్జీ... బి కేర్‌ఫుల్ శ్యామలా" అంటూ లోగొంతుకలో కాషన్ ఇచ్చింది.

"డోంట్ వర్రీ" పిన్నీ అన్నాను నేనూ లొగొంతుకతో. బుల్లెట్, హోండా డిఫరెంట్ డైరెక్షన్స్‌లో బయలుదేరాయి. దారులు వేరయినా గమ్యమొక్కటేగా అని నవ్వుకున్నాన్నేను.

★ ★ ★

దార్లో ఓ ఖరీదైన రెస్టారెంట్ ముందు బైక్ ఆపాడు మా ఆయన. ఓ కార్నర్ టేబుల్ సెలక్ట్ చేసుకుని కూర్చున్నాం. "ఏం తీసుకుంటావ్?" అన్నాడు.

జస్ట్ బయలుదేరేముందు... మా పిన్ని పెసరట్లు పోసింది. ఆమె చేత్తో ఏది చేసినా ఆటోమేట్టిగ్గా దాని రుచి పెరుగుతుంది.

ఆటోమేటిగ్గా... ఓవర్‌గా తినాల్సివస్తుంది.

"హెవీగా వుందండీ... ఏమీ వద్దు" అన్నాను.

"షల్ వి హేవ్ ఎ కూల్‌డ్రింక్?" అన్నాడు.

"సరే" అన్నాను.

"పెప్సీ" అన్నాడు.

"ఊహుc... మాజా" అన్నాను.

రెండు మాజా ఆర్డర్ చేసి... ఓసారి అరచేతులకేసి చూసుకుని "ఒక్క నిముషం వాష్ చేసుకొస్తాను" అంటూ వెళ్ళాడు.

ఏంతోచక నేను హోటలంతా కలయజూస్తూ కూర్చు న్నాను. ఉన్నట్టుండి నా కళ్లను కట్టిపడేసిందో జంట.

వాళ్ళెవరో కాదు. శ్యామలా భాస్కర్రావు.

నన్నింకా ఆశ్చర్యంలో ముంచిన విషయం ఏంటంటే బేరర్ వాళ్ళకి మాజా సప్లయ్ చేస్తున్నాడు. చప్పున 'హలో బ్రదర్' సినిమాలో నాగార్జున గుర్తుకొచ్చాడు.

"స్నేహబంధమూ... ఎంత మధురమూ" అన్న పాత పాటను నా మనసు కమ్మగా హమ్ చేసింది.



ఇంతలో చేతులు వాష్ చేసుకోడానికని వెళ్ళిన మా ఆయన వచ్చాడు.

ఒకరి కళ్ళలోకి ఒకరం చూసుకుంటూ చెరో మాజా తాగేశాం. హోటల్ బయట కొస్తూ వెనక్కి చూశాను.

శ్యామలింకా వాళ్ళాయన కళ్లలోకి చూస్తూనే వుంది, బాటిల్ ఖాళీ అయిం దన్న సెన్స్ లేకుండా.

నవ్వుకుంటూ బైక్ ఎక్కి మా ఆయన నడుంచుట్టూ చేతులేశాను. అట్లా వేస్తున్న ప్పుడు ఒక్కసారి తల జర్క్ ఇచ్చినట్టు అన్పించింది.

ఇంకాస్త దూరం పోగానే కనురెప్పలు వాలిపోతున్నట్టుగా అన్పించింది. కళ్ళ ముందు చీకటి వలయాలు. బైక్‌మీంచి పడిపోతానేమోనని భయమేసింది.

"ఏమండీ... నాకదోలా వుంది" అన్నాను అతికష్టంమీద.

ఆ తర్వాతేమైందో నాకు గుర్తేలేదు.

★ ★ ★

నేను స్పృహలోకొచ్చేసరికి నేనూ, శ్యామలా డాక్టర్ పురుషోత్తమ్ క్లినిక్‌పై వున్న ఆయన రెసిడెన్స్‌లో కూర్చుని వున్నాం. ఇద్దరం చెప్పలేనంత నిస్త్రాణగా వున్నాం. మాకు చెరోపక్కా మా హనుమా యమ్మ పిన్నీ, మా బాబాయ్ కూర్చుని వున్నారు.

కుక్ ట్రేలో కాఫీ తెచ్చి మా అందరికీ ఇచ్చాడు. వేడిగా గొంతులోంచి కాఫీ కడు పులో పడుతూంటే మగతలాంటి స్టేట్ లోంచి బయటపడుతున్నట్టుగా వుంది.

మా పిన్ని "ఇంకో కప్పు తాగుతారా?" అనడిగింది నన్ను.

"ఊఁ" అన్నాను.

శ్యామల్ని కూడా అడిగితే అది వద్దన్నది. కుక్ నాకు మరో కప్పు కాఫీ ఇచ్చాడు. ఆ కప్పు కూడా ఖాళీ చేశాక నా నరాల్లోకి శక్తి వచ్చింది.

అప్పుడడిగాను మా పిన్నిని "నాకేమైంది పిన్నీ?" అని.

మా పిన్ని కళ్లొత్తుకుంది. "చెప్పానుకదే. ఏడ్చే మగాడ్ని నమ్మకూడదని. అనుకు న్నంతా అయ్యింది" అంది.

నాకు ఒక్కోటీ గుర్తుకొస్తోంది. మా ఆయన్తో నేనూ... భాస్కర్రావుతో శ్యామలా. సంతోషంగా బయలుదేరాం.

ఆ తర్వాత మా ఆయన నన్ను రెస్టారెం ట్‌కి తీసుకెళ్ళాడు. మాజా ఆర్డర్ ఇచ్చాం. అదే హోటల్లో మాజానే తాగుతూ కనబ డ్డారు భాస్కర్రావూ, శ్యామలా.

కూల్‌డ్రింక్ తాగాక నేనూ మా ఆయనా బైక్‌మీద బయలుదేరాం. దార్లో నాకు తల తిరుగుతున్నట్టుగా అన్పించింది. కళ్ళ ముందు చీకటివలయాలు కన్పించాయి. ఆ తర్వాత... ఆ తర్వాత.

"ఆ తర్వాతేమైంది పిన్నీ" అన్నాను.

"ఆ తర్వాతేమైందో నేను చెప్తాను" అన్నాడు డాక్టర్ పురుషోత్తమ్.

ఆయనవంక ఆసక్తిగా చూశాను.

"కూల్‌డ్రింక్‌లో మత్తుమందు కలిపి నీకు స్పృహ తప్పించిన మీ ఆయన నిన్ను నేరుగా నా దగ్గరకు తీసుకొచ్చాడు. నిన్నాస్థి తిలో చూసి నేను గాభరాపడ్డాను. విషయ మేంటని అడిగాను. నువ్వు మీ ఎదురింట్లో వ్యక్తిని అందునా స్వయానా నీ ఫ్రెండ్ హజ్బెండ్‌ని ప్రేమిస్తున్నావని చెప్పాడు మీ ఆయన.

'అన్ బిలీవబుల్' అన్నాను.

"ప్లీజ్ నన్ను నమ్మండి డాక్టర్" అంటూ ఏవేవో సంఘటనలు ఏకరువు పెట్టాడు. చివరికి జేబులోంచి ఓ లెటర్ తీసి నాకి చ్చాడు. ఆ లెటర్ చదివి షాకయ్యాను. అది భాస్కర్రావు పేరుమీద నీకొచ్చిన ప్రేమలేఖ.

పూర్తిగా నమ్మేశాను నువ్వు ఫ్రాడ్‌వని. "చెప్పు నన్నేం చెయ్యమంటావ్?" అన్నాను మీ ఆయన్తో.

"నా భార్య నా ప్రాణం డాక్టర్. విజ్జీ

నాకు లేనిరోజు నేనున్నా ఒకటే. చచ్చినా ఒకటే. విజ్జీ నాక్కావాలి. ఆమె మనసూ, తనువూ అన్నీ నాకే కావాలి. పరాయిమ గాడ్ని ఆమె కల్లో కూడా తలవడానికి వీల్లేదు. నా విజ్జీ నన్ను మాత్రమే కేవలం నన్ను మాత్రమే ప్రేమించేలా ప్రోగ్రామ్ చేసిన మైక్రోచిప్‌ని ఆమె బ్రెయిన్‌లో ఇన్ సర్ట్ చెయ్యండి. నా ఫ్యామిలీని సిలికాన్ ఫ్యామిలీగా మార్చండి. ఆమెలోని సహజ మైన ప్రేమ నాకు దక్కకపోయినా ఫర్వా లేదు. ఈ ఆర్టిఫిషియల్ ప్రేమతోనైనా నేను ఆనందంగా బతికేలా చెయ్యండి" అంటూ నా చేతులు పట్టుకుని ఏడ్చాడు.

నేన్నీకు ఆపరేషన్ చెయ్యాలని పూర్తిగా డిసైడ్ అయిపోయాను. నిన్ను థియేటర్ లోకి కూడా పంపాను. నువ్వు అనస్థీస్ట్ టెస్టింగ్‌లో వున్నప్పుడు నేనింకా నా కన్స ల్టింగ్ రూమ్‌లోనే వున్నాను.

అప్పుడొచ్చాడు భాస్కర్రావు శ్యామల్ని తీసుకుని.

అచ్చు నువ్వున్న పరిస్థితిలోనే వుందీ అమ్మాయి. మీ ఆయన చెప్పినట్టే శ్యామల ఎదురింట్లో వున్న ఓ వ్యక్తిని, దట్టూ ఫ్రెండ్ భర్తని ప్రేమిస్తోందని చెప్పాడు. నేను వండరయ్యాను. నమ్మలేకున్నానని చెప్పాను.

ఇక చూడు. మీ ఆయనలాగే అచ్చు అవే కాకపోయినా దాదాపుగా ఆ టైపు సంఘట నలెన్నో చెప్పాడు. చివరగా ఓ లెటర్‌ని నా చేతిలో పెట్టాడు.

ఆ లెటర్ చదివిన నేను నివ్వెరపో యాను. మీ ఆయనిచ్చిన లెటర్‌కి జిరాక్స్ కాపీలా వుందది. జిరాక్స్ తియ్యించలేదు గాని. మక్కికి మక్కి కాపీ చేశారు. ఆ రెండు లెటర్స్‌లో వున్న తేడాలు రెండే రెండు. హేండ్ రైటింగ్ ప్లస్... సంతకం.

ఒకదాన్లో నీ డబ్ల్యూ.సి. హెచ్. భాస్క ర్రావ్ అనీ, మరోదాన్లో నీ డబ్ల్యూ. సి. హెచ్. మధుకర్ అనీ వుంది.

ఇదేదో సివియర్‌గా తీసుకోవాల్సిన టీజింగ్ ప్రోగ్రామ్‌లా వుందనిపించింది. నా అనుమానం మీ హజ్బెండ్స్‌మీదనే పోయింది.

భాస్కర్రావుని నా కన్సల్టింగ్ రూమ్‌లో వుంచి నీకు ఆపరేషన్ జరగబోతోందన్న ఆనందంతో నిశ్చింతగా పేషంట్స్ వెయి టింగ్ హాల్లో కూర్చుని వున్న మీ ఆయన్ని లోపలికి పిలిపించాను.

ఇద్దరి ముందూ రెండు లెటర్స్‌నీ ఎగ్జి బిట్ చేశాను. ఇద్దరి ముఖాల్లో ఆశ్చర్యం కత్తివాటుకి నెత్తురు చుక్క లేనట్టు పాలిపో యాయి వాళ్ళ ముఖాలు.

"మిష్టర్! మీ ఇద్దరి మీదా చీటింగ్ కేస్ పెట్టబోతున్నాను" అన్నాను మీ ఆయన్తో. వాళ్ళ దగ్గర్నుంచి లెటర్స్ కలెక్ట్ చేసుకుని నా టేబుల్ సొరుగులో వేసుకుంటూ.

"డాక్టర్!" అన్నాడు భయపడిపోతూ.

"మాకే పాపం తెలీదు" అన్నాడు భాస్క ర్రావు.

"నో... ఏదో దురుద్దేశంతో మీరీ పనిచే శారు" అన్నాను రెట్టిస్తూ.

"నా భార్యమీద ఒట్టు డాక్టర్. నాకేం తెలీదు" అన్నాడు మీ ఆయన.

"భగవంతుడి సాక్షిగా నేనీపనిచెయ్యలేదు" అన్నాడు శ్యామల వాళ్ళాయన.

"వరహాల మూటల్రా మీ భార్యలు. వాళ్ళ బ్రెయిన్స్‌లో లవ్ ఓరియంటెడ్ మైక్రో చిప్స్ పెడితే నేను ప్రేమనే అవమానించిన వాడినవుతాను. ఐ కాన్ట్ లీవ్‌యు... ఐ విల్ రింగప్ టు ద పోలీస్" అన్నాను.

మీ ఆయనా... శ్యామలా వాళ్ళాయనా అమాంతం నా కాళ్ళమీదపడిపోయారు. "అసలు ఆ ఉత్తరాల గొడవేంటో మాకు తెలీనే తెలీదన్నారు" అయినా క్షమించేవాడ్ని కాదుగాని... మీ ఇద్దరి ముఖాలు గుర్తొచ్చి క్షమించేశాను. మీ భార్యలకు స్పృహ తెలి సేలోగా వాళ్ళ కంటికి కనబడకుండా వెళ్ళి పొమ్మని చెప్పాను.

దట్సాల్... దె హేవ్ డిస్పర్స్‌డ్. నేను వెంటనే హనుమాయమ్మకి ఫోన్‌చేసి రప్పించాను.

డాక్టర్ పురుషోత్తం చెప్పడం ముగించి అడిగాడు "ఇంతకీ ఆ లెటర్స్ గురించి మీకేమైనా ఐడియా వుందా? " అన్నాడు.

"ఆ లెటర్స్ రాసింది మేమే డాక్టర్" అన్నాను.

డాక్టర్ పురుషోత్తం ఆశ్చర్యంతో నోరు తెరిచినంతపని చేశాడు.



"థేంక్ గాడ్ వాళ్ళని పోలీసులకి పట్టివ్వలేదు" అనుకున్నాడాయన.

"పట్టించినా పాపం లేదులెండి" అంటూ మా పిన్ని మా ఆయనా, శ్యామల వాళ్ళాయనా ఎట్లాంటివాళ్ళు, మేమెందుకా లైటర్స్ రాసుకోవాల్సి వచ్చిందో పూసగుచ్చినట్టు చెప్పింది.

"రియల్లీ... ఫెంటాస్టిక్ ట్రీట్‌మెంట్. సైకలాజికల్‌గా ఐ హోప్ ఏ మైక్రోచిప్ అవసరం లేకుండానే మీ హజ్బెండ్స్‌లో మార్పు రావచ్చని నాకన్పిస్తోంది" అన్నాడాయన.

డాక్టర్‌గార్నడిగి... మా లెటర్స్ తీసుకుని పిన్నితో బాబాయ్‌తో కల్సి వాళ్లింటికి బయలుదేరాం నేనూ, శ్యామలా.

వరసగా మూడురోజులు ఎదుర్చూశాం నేనూ, శ్యామలా వాళ్లిద్దరి కోసం.

అంతులేరు. ఇద్దరి ఆఫీసులకూ ఫోన్లు చేశాడు మా బాబాయ్. ఇద్దరూ అక్కడిక్కూడా మూడు రోజులుగా అటెండ్ కావటంలేదని తెలిసింది.

మనసులో ఎక్కడో కలుక్కుమన్నా నేను కేర్‌నాట్‌గా కనపడ్డానికి ప్రయత్నిస్తున్నాగానీ... శ్యామల కాస్త దిగులుపడింది.

నాలుగోరోజు సాయంత్రం అందరం వరండాలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నాం.

"వెధవాయిలకు ముఖం చెల్లటం లేదు. నమ్మబలికి తీసుకెళ్ళి బిడ్డలకు మత్తుమందు పెట్టారుగా! అమ్మో! గుండెలు తీసిన బంట్లు" అంది మా పిన్ని.

"నువ్వు ఇవ్వలేదూ కూల్‌డ్రింక్‌లో మత్తుమందు నాకు. మరి నువ్వు కూడా గుండెలు తీసిన బంటువా? " అన్నాడు మా బాబాయ్.

"అది వేరూ... ఇది వేరూ" అంది మా పిన్ని.

"ఇట్ మేక్స్ నో డిఫరెన్స్" అన్నారు మా బాబాయ్.

"ఇట్ మేక్స్ డిఫరెన్స్" అంది మా పిన్ని.

దూరం నుండీ బుల్లెట్ సౌండ్ వినబడింది.

"మా ఆయనేమో" అన్పించింది మనసుకు.

బుల్లెట్ ఆగీ ఆగగానే... హోండా సౌండ్ వినబడింది.

"మా ఆయనేమో" అంది శ్యామల.

మా ఇద్దరి వూహల్నీ నిజంచేస్తూ...

ఇద్దరూ ఒకేసారి దిగారు. అయితే లోపలికి రాకుండా గేటుకు చెరోవైపూ ఆనుకుని వుండిపోయారు. కనబడనంతవరకూ... ఒకలాంటి ఆరాటంతో మనసు కొట్టుకుంది కాని ఇప్పుడు ఇద్దరూ ఇట్లా ప్రత్యక్షమయ్యే సరికి మనసులోని గ్రేస్ చచ్చిపోయింది.

అందుకే వాళ్ళని చూసి కూడా పట్టనట్టు వూరుకున్నాం. ఇక బాగుండదని కాబోలు మాధవి వెళ్ళి ఇద్దర్నీ లోపలకు ఆహ్వానించింది.

ఓ క్షణం తటపటాయించినా మెల్లగా లోపలికొచ్చారు. మా ఆయన భాస్కర్రావు ముఖంలోకి చూసి సైగ చేశాడు. భాస్కర్రావు మా ఆయన ముఖంలోకి 'కమాన్ డు ఇట్' అన్నట్టు చూశాడు. 'సో ఇద్దరి మధ్యా హవా బాగుందన్నమాట' అనుకున్నాను.

మా ఆయన అమాంతం నా చేతులు పట్టుకుని "స్సారీ" అన్నాడు.

శ్యామల వాళ్లాయన కూడా హఠాత్తుగా శ్యామల చేతుల్ని పట్టుకుని "స్సారీ" అన్నాడు.

"గుండెల్లో పొడిచి, పొరపాటైంది సారీ అంటే ఏంటి యూజ్? " అన్నాడు మా బాబాయ్.

"వెరీ బేడ్... వెరీ బేడ్" అంది మా పిన్ని.

మా ఆయన సీరియస్‌గా గేటు దగ్గరున్న వేపచెట్టు కొమ్మలకేసి చూస్తున్నాడు. భాస్కర్రావు అంతకంటే సీరియస్‌గా వేప చెట్టు మొదలుకేసి చూస్తున్నాడు.

"అట్లా చెయ్యడానికి మీకు చేతులెలా వచ్చాయ్? " అంది మా పిన్ని.

"కాళ్లతో చెయ్యడం కుదరదు గనుక" అన్నాడు మా బాబాయ్.

"కొంచెమైనా బుద్ధీ, జ్ఞానం వుండక్కర్లా" అంది మా పిన్ని.

"అక్కర్లేదనే అనుకున్నారేమో" అన్నాడు మా బాబాయ్.

మా ఆయన దవడ ఎముక బిగుసుకోవడం నాకు స్పష్టంగా కనబడింది.

ఇంత జరిగినా సిగ్గులేకుండా అదట్లా ఎట్లా బిగుసుకుందో నాకైతే అర్థం కాలేదు.

"ఇన్నాళ్లు కాపురం చేసిన భార్యల్ని ఇట్లా అవమానిస్తారా" అంది మా పిన్ని.

"సిగ్గూ, శరమూ వున్నవాళ్లకైతే అవమానమంటే ఏంటో తెలుస్తుంది" అన్నాడు మా బాబాయ్.

భాస్కర్రావు వేపచెట్టు కాండం మీది బెరడును ఆపకుండా గిల్లుతున్నాడు.

"మా అమ్మాయి నీతో రాదు. ఏం చేసుకుంటావో చేసుకోపో" అంది మా పిన్ని.

"దాంతోపాటు దాని ఫ్రెండూ ఇక్కడే వుంటుంది" అన్నాడు మా బాబాయ్.

మరీ వ్యవహారం శృతిమించి పోతోందని గమనించి "అమ్మా! ఇక వదిలెయ్యండి" అంటూ కసురుకుంది మాధవి.

★ ★ ★

"భాస్కర్రావుని నేను ప్రేమిస్తున్నానని తెలిసినప్పుడు మీరెట్లా ఫీలయ్యారు? " అన్నాను.

మేమిద్దరం మేడమీద ఓ చివరనున్నాం. అటు చివర... శ్యామలా, భాస్కర్రావూ వున్నారు.

అది కూడా వాళ్లాయన్ని నేనడిగిన ప్రశ్నే అడిగుంటుంది.

"మధుకర్‌ని నేను ప్రేమిస్తున్నానని తెలిసినపుడు మీరెట్లా ఫీలయ్యారు? " అంటూ.

"ఇప్పుడవన్నీ ఎందుకు విజ్జీ? " అన్నాడు.

"ఐ వాంట్ యువర్ ఫీలింగ్స్" అన్నాను.

"ప్లీజ్ విజ్జీ" అన్నాడు.

"మీ ఫీలింగ్స్ నాక్కావాలి" అన్నాను.

అవతల భాస్కర్రావు గొంతు సవరించుకోవడం విన్పించింది. మా ఆయన కూడా గొంతు సవరించుకున్నాడు.

"అప్పుడు చాలా బాధేసింది. ఎంత బాధంటే గుండెల్లో ఇనపమేకులు గుచ్చుకొన్నంత బాధ. రాత్రుళ్లు నిద్రపట్టేది కాదు. ఆఫీస్‌లో వర్క్ మీద కాన్‌సన్‌ట్రేషన్ పోయింది. ఎప్పుడూ నీ ధ్యాసే. నువ్వు

భాస్కర్రావుతో కల్సి ఐస్క్రీమ్ తింటున్నట్టూ, ఒకే కప్పులోని కాఫీని చెరిసగం పంచుకుంటున్నట్టూ... ఒకరి కళ్లలోకి ఒకరు చూసుకుంటూ మైమరచిపోతున్నట్టూ... ఏవేవో దృశ్యాలు కళ్లముందు కదిలిపోతుండేవి. విజ్జీ! నిజంగా నరకం అనుభవించాననుకో. ఒక్కోసారయితే మరీ టెంప్టేషన్ ఎక్కువైపోయి నిన్ను చంపి, నేనూ చావాలనుకునేవాడ్ని.

ఇక భాస్కర్రావునైతే ఎట్లా శపించేవాడినో. ప్రతిరోజూ అతన్ని చూసినప్పుడల్లా వీడికేవేళ ఏదైనా యాక్సిడెంటయి చస్తే ఎంత బాగుంటుందో అనుకునే వాడిని. ఎట్ టైమ్స్... వాడ్ని నేనే యాక్సిడెంట్ చెయ్యించి చంపితే అన్న ఆలోచన వచ్చేది. ఎందుకడుగుతావ్లే భయంకరమైన హేంగోవర్. ఆ హేంగోవర్ నా పగవాడిక్కూడా వద్దు" ఉద్వేగంగా చూశాడు మా ఆయన.

నేనాయనకేసి డీప్గా చూశాను "పగవాడిక్కూడా రాకూడని ఆ హేంగోవర్ భార్య మాత్రం పడొచ్చా? " అన్నాను.

నా చూపు మా ఆయన గుండెల్ని వూపేసింది. వెన్నుమీద చరిచినట్టయి ఉలిక్కిపడి చూశాడు.

"యస్... మీరనుభవించిన హేంగోవర్ని నేనూ అనుభవించాను. ఎప్పుడో తెల్సా? " అన్నాను.

"ఎప్పుడు? " అని అడగలేదుగాని నా జవాబుకోసం ఆయన అణువణువూ తహతహలాడిపోతోందని నాకు తెలుసు.

"మీరు శ్యామల బర్త్డేకి ఉంగరం ప్రెజంట్ చేశారని తెలిసినప్పుడు." నా కళ్లలో చివ్వున నీళ్లూరాయి.

మా ఆయన నవనాడులూ కృంగిపోయాయి. నా కళ్లలోకి చూడలేక తలదించుకున్నాడు.

"నా భార్య నాకే సొంతం కావాలని ఒక భర్త ఎట్లా కోరుకుంటాడో... నా భర్త నాకే సొంతమవ్వాలని భార్య కూడా కోరుకుంటుందండీ. నేను పక్కన నిలబడ్డా పట్టించుకోకుండా మీరు శ్యామల్ని తినేసేలా చూస్తుంటే నేను ఏమీ ఎరగనిదానిలా సర్దుకుపోవాలి. న్యూస్పేపర్లకి రంధ్రాలేసి మరీ శ్యామల ఒంపుసొంపుల్ని జుర్రుకుంటుంటే నేనది కామెడీగా తీసుకుని నవ్వుకోవాలి. మీరు శ్యామలకి ఉంగరం ప్రెజెంట్ చేసిన విషయం తెలిసిన రోజు నా మనసు నిశ్శబ్దంగా ఎంత కన్నీరు కార్చిందో మీకేం తెలుసండీ! గుండెలో ఒక అగ్నిపర్వతాన్నే దాచుకున్నాను. శ్యామల మీ వెకిలివేషాల్ని నాకు చెప్పకపోయుంటే అది నా ఫ్రెండ్ కాక మరింకెవరైనా అయ్యుంటే నా జీవితం ఏమైవుండేది! మగాడికి ఈ సమాజం హక్కుల్ని కాస్త ఎక్కువే ఇచ్చి వుండొచ్చు మగాడ్ని నాకేం వందమందితో తిరుగుతాను అని మీరనొచ్చు బట్ భార్య మనసు వాటిని ఖాతరు చెయ్యనంత కాలమే మీకా స్వేచ్ఛ. ఒక్కసారి ఆమె మనసు ఎదురు తిరిగిందో మీరు పడ్డానంటున్నారే, భయంకరమైన హేంగోవర్ అది తప్పదు. పక్కింటివాడి పెళ్లాన్ని మీరు ఆరాధిస్తున్నారు కనుక పక్కింటిదాని మొగుడ్ని నేనూ ఆరాధిస్తాను అని భార్యభర్తతో పోటీ పడ్డరోజున భర్తకు మిగిలేది మానసిక క్షోభే. యామైరైట్? " ఆగాను.

మా ఆయన తల మరీ వంచుకున్నారు.

"మా పిన్ని మా బాబాయ్కి చేసినట్టు మైక్రోచిప్తో మిమ్మల్ని ఒక్క గంటలో మార్చుకోవచ్చు బట్... ఆ కృత్రిమ ప్రేమ ఎంత సర్దిచెప్పుకున్నా సహజప్రేమ కాబోదు. మీరు మారాలి. మనసా, వాచా, కర్మణా మిమ్మల్నే నమ్ముకుని, మీతో ఏడడుగులు నడిచి, నూరేళ్ళూ మీ కష్టసుఖాల్ని పంచుకుంటానని ప్రమాణం చేసిన భార్యని, మీకోసం తన రక్తసంబంధాలను తృణప్రాయంగా వదిలేసి మీ ఇంట్లో దీపం పెడుతున్న భార్యను చూస్తున్నప్పుడు కలగని

థ్రిల్, పరాయి ఆడదాన్ని చూసినప్పుడు మగాడికెందుకు కలుగుతుంది? అన్న ప్రశ్న నాలో ఉదయించిన రోజున కేవలం భార్య చేతకానితనంవల్ల అని నా మనసు చెప్పింది.

అందుకే ఆలోచించాను. టిట్ ఫర్ టాట్ ఈజ్ ద ఓన్లీ వే అనుకున్నాను. నాకు లాంటి నరకాన్నే అనుభవిస్తున్న నా ఫ్రెండ్ శ్యామలా, నేనూ పరస్పరం సహకరించు కున్నాం.

పని లేక దెయ్యాలకార్ఖానాగా మారిన మీ మనసుకు పని కల్పించాం. శ్రమ ఇచ్చాం. ఆనందించడం పక్కన పెట్టి ఆలోచించేలా చేశాం. ఈలవేసి గోలచేసే మనసును, మూగవోయి కన్నీరు కార్చేలా చేశాం అని నేననుకుంటున్నాను. కానీ ఇప్పటికీ మీ మానసికస్థితి ఎట్లా వుందో మీరు చెబితే కాని తెలుసుకోలేని అయోమయస్థితిలో వున్నాం" అన్నాను.

అప్పటికీ మా ఆయన తల మరింతగా దించుకున్నాడేగానీ నోరు విప్పలేదు.

నేను దీర్ఘంగా నిట్టూర్చి అన్నాను. "ఇప్ప టికీ మీరు చేసింది తప్పని మీకన్పించక పోతే కమాన్ గో అహెడ్ శ్యామల కాక పోతే శారద దొరుకుతుంది"

అనూహ్యంగా నా నోటికి తన చేతిని అడ్డుగా పెట్టాడు మా ఆయన.

"విజ్జీ... చచ్చిన పాముని ఇంకా చంపకు. ఇప్పటికే సిగ్గుతో కుళ్ళిపోతున్నాను. ఇంకా ఇంకా కుళ్లబొడవకు"

ఆయన నిష్టూరంలోని ఆవేదన సూటిగా నా గుండెల్ని తాకింది. నాకు తెలీకుండానే మా ఆయనకు దగ్గరకు జరిగాను. ఆయన నన్ను తన బాహుబంధాల్లో చుట్టేసి హృద యానికి హత్తుకున్నాడు.

చప్పున గుర్తుకొచ్చింది శ్యామలా, భాస్క ర్రావ్ ఆ చివర వున్న విషయం.

'ఛ... చూస్తే ఏమనుకుంటారో' అను కుంటూ మా ఆయన భుజంమీద తలపెట్టు కుని మైమరచి వున్న నేను కనురెప్పలెత్తి వాళ్లకేసి చూశాను.

'ఏమో అనుకునే' స్థితిలో వాళ్లు లేరు. అచ్చు నాలాగే వాళ్లాయన గుండెల్లో ఒదిగి పోయి వుంది శ్యామల.

కాసేపటికి మా ఆయన వాళ్లాయనా తేరుకున్నారు.

"అద్సరే. భాస్కర్రావుకి ఏ పాపం తెలీ కుండానే నా దృష్టిలో అతన్ని నిన్ను లేపు కుపొయ్యేంత బేడ్ విలన్‌గా ఎట్లా చిత్రీకరిం చావ్? " అన్నాడు.

"చేతికి మట్టి అంటకుండా పనులు చెయ్య డమంటే ఇదే... భాస్కర్రావూ, నేనూ ప్రేమించుకుంటామని మిమ్మల్ని నమ్మించ డానికి నేన్నిజంగానే భాస్కర్రావుని వెంటే సుకు తిరగక్కర్లేదు. దొంగ ఫోన్‌కాల్సూ, దొంగ ప్రేమ లేఖలూ ఆ పని ఈజీగా చెయ్యగలవ్. అన్నట్టూ విలన్స్‌లో గుడ్ విలన్స్ వుంటారా? " అన్నాను.

"నేను నీ పాలిట విలన్నే. బట్, నౌ... అయామ్ గుడ్, యు నో"

"ఏమో... మా శ్యామల్నడిగి చెప్తాను" అని శ్యామల్ని కేకేశాను.

భాస్కర్రావ్, శ్యామలా ఇద్దరూ వచ్చి మాతో జాయిన్ అయ్యారు.

"ఆ ప్రేమలేఖ చాలా వెరైటీగా వుంది. అది రాసింది నువ్వా, విజయా" అనడుగు తున్నారు మావారు అంది శ్యామల.

"ఇప్పుడా నిజం ఎందుకట? " అన్నాను.

"కంగ్రాచ్యులేట్ చేద్దామని" అన్నాడు భాస్కర్రావ్.

"అయితే మీ కంగ్రాచ్యులేషన్స్ నాకే. థేంక్యూ" అన్నాను.

"మా మొద్దుకంత తెలివి లేదని, నేన ప్పుడే అనుకున్నా. ఎప్పుడైనా వూరికెళ్లి లెటర్ రాయాల్సివచ్చినా పూజ్యనీయులైన శ్రీవారి పాదపద్మములకు అని రాసే మా శ్యామలకు స్వీట్ హార్ట్, హాట్‌హార్ట్ లాంటి పదప్రయోగాలు ఏం తెలుసులే అని"

అన్నాడు.

మాధవి పైకొచ్చి భోజనాలకు పిల్చింది.

భోజనాలయ్యాక. మళ్ళీ నలుగురం మేడ మీద కొచ్చేశాం. ఈ ఎండ్‌లో మేమూ, ఆ ఎండ్‌లో వాళ్ళూ పక్కలేసుకుని పడుకున్నాం.

"ఓ చిన్న డౌట్" అన్నాను నేను వున్నట్టుండి.

"సెలవియ్యండి" అన్నాడు మా ఆయన.

"నేను మీ దృష్టిలో నమ్మకద్రోహం చేసిన భార్యగా ముద్రపడినప్పుడు, నన్ను ఇంట్లోంచి గెంటేశారు. నా ముఖం చూపొద్దంటూ అసహ్యించుకున్నారు. మరి అంతటితో నన్ను వదిలెయ్యకుండా మైక్రోచిప్ ఆపరేషన్ చెయ్యించాలని ఎందుకనుకున్నారు"

"ఇది థౌజండ్ డాలర్ క్వెశ్చన్" అన్నాడు మా ఆయన. "ఎందుకంటే నీ మీద నాకు అంతులేని ప్రేముందని నిన్ను గెంటేశాకే అర్థమైంది కనుక" నా మీద చెయ్యేసి దగ్గరగా లాక్కున్నాడు.

"నిజం విజ్జీ. నీమీదొట్టు. నువ్వెళ్ళిపోయాక నీ విలువ తెలిసింది. నువ్వెందాకన్నట్టు శ్యామల కాకుంటే... శారదో, శారద కాకుంటే నీరజో దొరకచ్చు కానీ నా హృదయం దొరకదుగా. అందుకే నీ మనసు నాది కాదని తెలిసినా దాన్ని మార్చి మరీ నాకోసం కేవలం నాకోసమే దాన్ని అట్టిపెట్టుకోవాలనుకున్నా"

మా ఆయన నిజంగా మారాడా లేదా అని ఏ మూలో కొట్టుమిట్టాడుతున్న సందేహం అంతటితో పటాపంచలైపోయింది.

ఆకాశంలో చందమామను చూస్తూ హాయిగా కళ్ళు మూసుకున్నాను. ఇన్నాళ్ళుగా ఇన్‌సెక్యూరిటీ ఫీలింగ్‌వల్ల సరిగ్గా పట్టని నిద్ర, ఇవాళ నన్ను పూర్తిగా ఆవహించేసింది.

నా భర్త నాతో వున్నాడన్న భద్రతా భావం కలతలేని, కలలురాని కమ్మని నిద్రను నాకు కానుకగా ఇచ్చింది.

ఎప్పుడో తెల్లవారుఝామున కోడి కూసినప్పుడు మెలకువొచ్చింది. నిద్రలో అటు తిరిగానేమో! మా ఆయన వంక తిరుగుదామని ఇటు పొర్లాను.

గుండె ఝల్లుమంది. మా ఆయన నా పక్కన లేడు.

బాత్‌రూమ్ కెళ్ళాడేమోనని పదినిముషాలు వెయిట్ చేసి ఇక ఆగలేక మేడకు ఆ చివర పడుకుని వున్న శ్యామలకేసి వెళ్ళాను. భాస్కర్రావుని లేచి కాస్త చూడమని రిక్వెస్ట్ చేద్దామని.

శ్యామల్ని తట్టడానికి ముందుకు వంగిన నేను ఉలిక్కిపడ్డాను. శ్యామల పక్కన భాస్కర్రావు లేడు.

★ ★ ★

మోకాళ్ళలో తలదూర్చి వెక్కివెక్కి ఏడుస్తున్నాం నేనూ, శ్యామలా. ఇంతగట్టి ఎదురు దెబ్బ తగలడం ఇదే తొలిసారి. మా ఆయన శ్యామలకి ఉంగరం బహూకరించిననాడు గానీ చివరకు మాయమాటలు చెప్పి మత్తుమందిచ్చి హాస్పిటల్లో పడేసిన రోజుగానీ, ఇంత బాధ కలగలేదు. ఆ ఎదురుదెబ్బలన్నీ దీనిముందు బలాదూర్ అన్పించింది.

"ఒక్కసారి మోసపోయే వాళ్ళమీద జాలి పడొచ్చు వూరికూరికే మోసపోయే వాళ్ళ మీద జాలికాదు కలిగేది కోపం" అంది మా పిన్ని.

"మమ్మల్నేం చెయ్యమంటావ్ పిన్నీ. పశ్చాత్తాపంతో రగిలిపోతున్నట్టే ఇద్దరికిద్దరూ ఫోజులిచ్చారు. రాస్కెల్స్, ఈసారి కనబడితే ఒకేఒక్క దెబ్బకి తల పగలగొట్టేస్తాం" అన్నాను.

"ఒక్కదెబ్బకే తలపగలగొట్టేస్తారా. నిజంగా నిజమే! ముఖాలు చూడండి ఎట్లా వున్నాయో. ఏడ్చి నిద్రపోయినట్టు" ఎగతాళి చేసింది పిన్ని.

ఉక్రోషంతో నా పెదవి అదిరింది. కనీసం పిన్ని చేసిన హేళనకు సమాధానం చెప్పటానికైనా నేను మా ఆయన తల పగ లగొట్టాలన్న నిర్ణయానికొచ్చాను. "పిన్నీ! తక్కువ అంచనా వెయ్యకు నన్ను. మధు కర్ కనబడితే నా చేతిలో బతకడు. నాది ఐరన్ డిటర్మినేషన్" అన్నాను.

"నేనూ అంతే. సేమ్ టూ సేమ్" అంది శ్యామల నిప్పులు చెరుగుతూ.

"అక్కయ్యా... ఒక్క దెబ్బకే తల పగలా లంటే మాంచి స్ట్రాంగ్ కర్రలు కావాలి. 'రాణి' అనీ నాకో ఫ్రెండుంది. వాళ్లన్నయ్య టూ టవున్ సబ్ ఇన్‌స్పెక్టర్. అతని దగ్గర అట్లాంటి కర్రలు చాలా వుంటాయ్. చెరోటీ తెప్పించనా" ఉత్సాహంగా అన్నది మాధవి.

"మంచి తెలివే పోలీసువాడ్ని కర్రలడిగి మర్డర్లు చేస్తారా! చెయ్యండి చెయ్యండి. ఆనక జైల్లో కూర్చుని వూచలు లెక్కబెడుదురుగాని" అంది మా పిన్ని మాధవి తెలివితక్కువ తనానికి ఆశ్చర్యపోతూ.

"నీ తెలివింకా తెల్లారినట్టే వుంది. నిజం గానే వాళ్లేదో మర్డర్ చేసి జైలు కెళ్లబోతున్నంత బిల్డప్ ఇస్తున్నావ్" అన్నాడు మా సత్యనారాయణ బాబాయ్.

"మా కడుపు మండిపోతుంటే. మీకు నవ్వులాటగా వుందా? " కయ్యిమన్నాను.

"కూల్ డ్రింక్ తెచ్చివ్వనా అక్కయ్యా" అంది మాధవి.

"ఆ తెచ్చివ్వు. నీ దరిద్రగొట్టు బావ కలిపినట్టు మత్తుమందు కలపక కాస్త విషం కలిపి ఇవ్వు" అన్నాను కసిగా.

"ఆ విషయం తరువాత ఆలోచిద్దాంగానీ, లేచి స్నానాలవీ కానిచ్చి టిఫిన్లు మింగండి. ఆ వెధవలిద్దరూ ఈ పాటికి ఏ అరడజను మసాలా దోశలో లాగించుంటారు.

"మా ఆయనకు మసాలా పడదు పిన్నీ" చటుక్కున గుర్తొచ్చి అన్నాను.

"పడుతుందక్కయ్యా. బావ జెమినీలో మిడ్‌నైట్ మసాలా చూడ్డం నా కళ్లారా చూశానోసారి" అంది మాధవి.

శ్యామలా నేను స్నానాలు కానిచ్చాం.

అంత బాధలో కూడా పిన్నేం టిఫిన్ చేసిందోనని ఆరాగా చూశాను. ఆమె చేతి వాటం అట్లాంటిది. దిగులుతో ముద్దమింగుడు పడని వాళ్లు కూడా మా పిన్ని చేతి వంట రుచి చూస్తే చాలు ముందు సుష్టుగా తిని ఆనక తీరిగ్గా దిగులుపడతారు.

ఇవాళ టిఫిన్ దోశలు. అదీ కమ్మని నెయ్యితో కాల్చిన దోసెలు. పచ్చిమిర్చి, అల్లం చట్నీ అదిరిపోయింది.

దోశలు తిన్నంతసేపూ మా ఆయన్ని నేనూ, శ్యామల వాళ్లాయన్ని శ్యామలా తాత్కాలికంగా మర్చిపోయాం. కాఫీలు తాగాక మళ్లీ కళ్లముందు కొచ్చాయి వాళ్ల మూర్తులు.

మా ఆయన్లు మారారన్న విజయగర్వంతో నిన్న విర్రవీగిపోయిన నేనూ శ్యామలా ఇవాళ ఖిన్నులమైపోయాం.

మా శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరని తెలిసిపోవడంతో ఒంట్లోని శక్తంతా ఆవిరైపోతున్నట్టు అన్పించింది.

"ఒకవేళ అర్జంటు పనుండి, హడావుడిగా వెళ్లారేమో!" అన్న ఆశ మాత్రం గుండెల్లో ఏమూలో రెపరెపలాడుతోంది. అయితే అది నాలుగురోజులైనా వాళ్లు తిరిగి రాకపోవడంతో ఆవిరైపోయింది.

ఓ వారం తర్వాత "పిన్నీ ఇవాళ ఆఫీసుకు వెళ్తాను" అన్నాను.

"వై డోంట్ యూ ఎక్స్‌టెండ్ యువర్ లీవ్" అంది.

"నేను దిగులుగా వున్నప్పుడు నువ్వు నీ లాంగ్వేజ్ ప్రాక్టీస్ చెయ్యకు" అందామనుకున్నాగానీ ఆవిడేమైనా అనుకుంటుందని వూరుకున్నా.

"ఆ పని చెయ్యరా... ఇంకాస్త కోలుకున్నాక వెళ్లొచ్చు" అన్నాడు మా బాబాయ్ చిక్కిశల్యమైన నన్ను చూస్తూ.

శ్యామల కూడా "ఒంటరిగా వుంటే నా

మనసు బాగుండదే" అనడంతో, ఇంకో వారం రోజులు లీవ్ ఎక్స్‌టెండ్ చేసుకోవడానికి నిర్ణయించుకున్నాను.

★ ★ ★

లీవ్ ఎక్స్‌టెండ్ చెయ్యడానికని ఆఫీసుకు వెళ్లిన నన్ను చుట్టుముట్టేశారు సీతా, సత్యవాణీ, క్రిష్ణప్రియ. ఈ వారం రోజులూ ఎక్కడికెళ్ళావంటూ. లంచ్ టైమ్ సెలెక్ట్ చేసుకుని మరీ వెళ్లాను. కాసేపు వాళ్లతో మాట్లాడుకోవచ్చని.

నేనెప్పుడూ నా కొలీగ్స్ బాధలు వినేదాన్నేగాని నా గురించి మంచీ చెడూ నేనెవరికీ చెప్పేదాన్ని కాదు. శ్యామల ముందు తప్ప ఎప్పుడూ ఎవరిముందూ నా మనసు విప్పే అలవాటులేదు.

కానీ ఆరోజు నా అలవాటుకు విరుద్ధంగా జరిగిందంతా నా కొలీగ్స్‌కీ చెప్పుకున్నాను. చెప్పాక నా కర్థమైంది. మా ఆయన నాకిచ్చిన షాక్ నన్ను శారీరకంగానే కాదు, మానసికంగా కూడా బలహీనురాలిని చేసిందని.

నేను చెప్పింది విని అవాక్కయ్యారు వాళ్లు.

"అన్ని కష్టాలెందుకు పడ్డావే. మన డాక్టర్ వున్నారుగా" అంది సీత.

"ఏ కొండ కోనల్లోనో... సహజసిద్ధంగా పుట్టే తియ్యటి ఊటజలంలా మా ఆయన గుండెల్లో కూడా ప్రేమ పుట్టి ప్రవహించి నన్ను ముంచెత్తుతుందని అనుకున్నాను" అని వీళ్ళకు చెప్పినా అర్థంకాదని నాకు తెలుసు.

అందుకే మౌనంగా ఊరుకున్నా.

"మా కుటుంబాల్లో ఆనందాన్ని నింపిన నువ్వు నీ కుటుంబంలో విషాదాన్నెందుకు పోగొట్టుకోలేకపోయావ్" అంది జాలిగా క్రిష్ణప్రియ.

"ఇప్పుడేమైందిట. ఎన్నాళ్ళు దాక్కుంటారు? ఇవాళో రేపో రాకపోతాడా" రాగానే... వలేసి పట్టుకుని పురుషోత్తమ్ గారి దగ్గరకు ఈడ్చుకెళదాం" అంది సత్యవాణి కోపంగా.

"సాయం వస్తావా?" అని నవ్వి, "ఆఫీస్ విశేషాలేంటి సీతా" అన్నాను.

"పెద్ద విశేషమే వుంది" అంది సీత. ఆసక్తిగా చూశాను.

"మన ప్రకాష్‌రాజ్ లేడూ..." అంది సీత.

మేం మా బాస్‌ని ప్రకాష్‌రాజ్ అని పిల్చుకుంటాం.

"మమ్మల్ని ముగ్గుర్నీ మొన్న ఛాంబర్‌లోకి పిల్చాడు. టోకుగా అక్షింతలు వెయ్యడానికేమోలే అనుకున్నాం. అదికాదు విషయం... మా ఆయన్ల బుర్రల్లో మైక్రో చిప్స్ గురించి ఆరా తీశాడు. మేం ఉత్సాహంగా వున్న విషయం చెప్పాం. మేం చిప్ అమర్చకముందు ఎంత అధ్వాన్నంగా బతికిందీ, చిప్ అమర్చిన తర్వాత ఎంత ఆనందంగా బతుకుతున్నదీ కథలుకథలుగా చెప్పాం. డాక్టర్ పురుషోత్తమ్ మనిషిరూపంలో దేవుడు అన్నాం. అంతా విని అప్పుడు బయటపెట్టాడు అసలు విషయం 'కీపిట్ సీక్రెట్' అంటూ.

మన సత్యవాణి ముందు సీక్రెట్టా అనుకున్నాం గానీ, అంటే బాగోదని ఊరుకున్నాం. ఇంతకీ ఆయన చెప్పింది ఏంటంటే, ఆయన భార్యకూ మా ఆయనకులాగా అనుమానపు రోగం వుందట. అయితే అది మరీ మోతాదు మించి అనుమానమట. మన ప్రకాష్‌రాజ్ ఆఫీసయ్యాక ఇంటికెళ్తాడా... గుమ్మంలోనే నిలబెట్టి ఒంటిమీద బట్టలు వాసన చూస్తుందట.

చెమట వాసన తప్పించి మరో వాసన వచ్చిందో ఇక మన రాజ్ పని అయిపోయినట్టే. ఎవరితో తిరిగొచ్చావో చెప్పమంటుందట. ఎంతకాదని చెప్పినా నమ్మదట. పోలీసులు దొరికిన మనిషిని చితకబొడిచి,వాడు దొంగ కాకపోయినా దొంగ అని ఒప్పుకునేలా చేసినట్టు మాటలతో కుళ్ళబొడిచి,

అవునే... నేను పలానా 'రోజా'తో తిరిగి వస్తున్నాను అని చెప్పేవరకూ వదలదట. అలా చెప్పాక, "చూశారా నా తడాఖా. నిజం కక్కించాను" అంటూ ఆనందంగా ఇంట్లోకి రానిస్తుందట.

సరే ఎలాగో ఇంటికొచ్చిపడతాడా మాన వుడు. ఇక తిండిదగ్గర మరో యుద్ధం.

ఒకవేళ ఆకల్లేక తక్కువ తిన్నాడా "ఎక్క డెక్కడ ఏమేం గడ్డి మేసొచ్చారు చెప్పండి" అంటూ గురుడ్ని మజిల్స్ ఫ్రై చేసుకుని, బోన్స్‌ని సూప్ పెట్టుకుని, మెదడు రోస్ట్ చేసుకుని తింటుందట.

ఆ బాధనుంచి విముక్తికోసం ఎప్పుడూ 'డైజిన్' టాబ్లెట్స్ జేబులో పెట్టుకుని తిరు గుతుంటాడట.

"అయితే ఎప్పుడైనా తిన్నది అరక్కపోతే. మన ప్రకాష్‌రాజ్ నడిగితే డైజిన్ దొరుకు తుందన్నమాట" అంది సత్యవాణి రిలాక్స్ డ్‌గా ఫీలవుతూ.

పాపం వాణికి గేస్ట్రిక్ ట్రబుల్. అదీ దాని ఆనందం.

"ఇక బెడ్‌మీద..." అంటున్న సీతను క్రిష్ణప్రియ అడ్డుకుని, "అదెప్పుడు చెప్పాడు సీతా. నేను విన్లేదే" అంది.

"ఇక చాలు నాకు మేటర్ అర్థమైంది. ఇంతకీ ఏమంటాడాయన? " అన్నాను.

"వైఫ్ మెదడులో మైక్రోచిప్ ఇనసర్ట్ చేయించాలని ఆయన ఉబలాటం కానీ ఆవి డ్నెలా హాస్పిటల్‌కి తీసుకెళ్లాలన్నదే సమ స్యట" అంది క్రిష్ణప్రియ.

"సమస్యేముంది. ఆత్మపరిశీలన చేసుకో లేనివాళ్ళను బై హుక్ ఆర్ క్రూక్ తీసుకె ళ్ళాల్సిందే" అన్నాను.

లంచ్ బ్రేక్ తర్వాత బాస్ ఛాంబర్‌లోకి వెళ్ళి నా లీవ్ మరో వారంరోజులు పొడిగిం చాల్సిందిగా రిక్వెస్ట్ చేశాను. ఆయనేం పేచీ పెట్టకుండా లీవ్ శాంక్షన్ చేసేశాడు.

ఆ పనయ్యాక నావంక చూసి మిసెస్ విజయామధుకర్! డాక్టర్ పురుషోత్తంగారి హాస్పిటల్లో దంపతుల అవగాహనా సద స్సుకు నేను కూడా అటెండయ్యాను. ఆరోజు నువ్విచ్చిన స్పీచ్... రియల్లీ మెమొ రబుల్" అన్నారు.

అయిపోయిన పెళ్ళికి మేళం... దొంగలు పడిన ఆర్నెల్లకి కుక్కలు మొరగడంలాంటి సామెతలు నా బుర్రలో గిర్రున తిరిగాయి. మెచ్చుకుంటే ఆ వెరీ మినిట్‌లోనో, లేదా కనీసం మరుసటిరోజో మెచ్చుకోవాలి. ఎంతయినా రాజ్ వెరైటీ మనిషి" అను కున్నా.

"ఓ చిన్న రిక్వెస్ట్" అన్నాడు.

"చెప్పండి సర్" అన్నాను వినయంగా.

వాళ్ళావిడ గురించి మొదలెట్టి ఇందాక సీత చెప్పిందంతా మళ్ళీ ఏకరువు పెట్టాడు. మధ్యమధ్యలో 'ఐ నో సర్', 'సీత చెప్పింది సర్' అంటున్నా ఆ మహానుభావుడు మాన లేదు.

చెత్త సినిమాని రెండుసార్లు చూస్తున్న ఫీలింగ్‌తో తల వాచిపోయింది. చెప్పడం పూర్తయ్యాక అసలు విషయం బయటపె ట్టాడు. "నువ్వోసారి మా ఇంటికొచ్చి ఆమె వీక్‌నెస్ ఆమెకు తెలిసేలా చెప్పాలమ్మా... అయితే ఆమెను చాలా స్మూత్‌గా డీల్ చెయ్యాలి సుమా"

గుండె జారిపోయింది నాకు.

నా క్లాస్ విని ఆవిడకు చిర్రెత్తిపోయి, 'అసలు నీకూ మా ఆయనకూ ఏమిటే సంబంధం' అంటే నేనేం చెయ్యాల్రా దేవుడా అనుకున్నా.

"ఏమంటావ్? " అన్నాడు.

బాస్ ఆర్డరేశాక ఏమంటాను?

"ఓ.కే. సర్. ఎప్పుడు రమ్మంటారు సర్" అన్నాను అతి వినయాన్ని ఒలకబోస్తూ.

"వెన్ యువర్ టైమ్ పర్మిట్స్" అన్నాడు.

పోనీలే ఆమాత్రం ఛాయిస్ అయినా ఇచ్చాడని సంతోషిస్తూ,

"టుమారో ఈవెనింగ్ సర్" అన్నాను.

"దట్స్ గుడ్. రేపు ఆదివారం కూడా"

అన్నాడు.

"అవునా సర్" అన్నాను. నా దిగుల్లో నేనుండిపోవడంతో వారాలు కూడా గుర్తు లేవు నాకు.

"యస్... టుమారో ఈజ్ సన్‌డే"

"సింహం గుహలోకి అడుగుపెట్టబో తున్నా కదా సార్ సో... ఇటీజ్ డెన్ డే..."

ఒకవేళ అయితేగియితే 'నా డెత్ డే' అందామనుకున్నాగానీ బాస్‌కదా అన్లేకపో యాను.

"రేపొస్తున్నావ్" అన్నాడు నేను లేస్తుంటే.

"ష్యూర్ సర్" అన్నాను.

★ ★ ★

ఆ ఆదివారానికి తొమ్మిదిరోజులు మా ఆయన్లు కనబడక. ప్రస్తుతం ఇంట్లో అంద రికీ వాళ్ళమీద కోపం పోయి బెంగ పట్టు కుంది. "రాత్రికి రాత్రే మాయమైన వాళ్ళు ఏమైనట్టు? " అంటూ ఒకటే తర్జనభర్జ నలూ, ఊహాగానాలూ...

మా పిన్నీబాబాయ్ పేపర్లో ప్రకటనో, టీవీలో యాడో ఇద్దామన్నారుగానీ మేం ససేమిరా ఒప్పుకోలేదు. అలా ఇవ్వడంవల్ల రెండు సమస్యలున్నాయని చెప్పాం.

ఒకటి కూతుర్ల కాపురాలు చక్కబడ్డా యన్న ఆనందంతో ఊళ్లకి వెళ్ళిపోయిన మా అమ్మానాన్నల్ని అనవసరంగా డిస్టర్బ్ చేసినట్టవుతుంది.

రెండు... ఇది అతి ముఖ్యమైంది. అన్ని మాటలూ చెప్పి నమ్మించి మోసం చేసినవా ళ్ళకోసం 'మీరెక్కడున్నా వెంటనే రావ ల్సింది. మీకోసం మీ పెళ్ళాలు బెంగ పెట్టు కున్నారు' అంటూ ప్రకటన ఇవ్వడమంటే మమ్మల్ని మేం కించపరచుకోవడమే.

మేల్. ఈగో వుందిగానీ ఫిమేల్ ఈగో వుండకూడదా!

మా ఆర్గ్యుమెంట్‌తో మా పిన్నీబాబాయ్ సైలెంటయిపోయారు. ఉదయం లేవగానే ఆ ఆదివారం ప్రోగ్రాం గుర్తు చేసుకు న్నాను. ఇంతక్రితమే శ్యామలకు చెప్పి తననూ రమ్మన్నాను. కాస్త ఛేంజ్‌గా వుంటుంది కదా అని వస్తానంటూ ఉత్సాహం చూపించింది.

దాదాపు ఎనిమిదన్నరా తొమ్మిది ప్రాంతంలో బయల్దేరాం ఇద్దరం. మా బాస్ ఇంటిముందు ఆటో దిగి ఆటో ఫేర్ ఇచ్చి పంపాం. గేట్ దాటుకుని వరండా మెట్లెక్కి కాలింగ్ బెల్ స్విచ్ నొక్కాను.

వెంటనే తలుపు తెరుచుకోలేదు.

నేనూ, శ్యామలా ఆ ఇంటి ఆవరణలో ఆర్టిస్టిక్‌గా పెంచబడిన పూలమొక్కల్ని చూస్తూ నిలబడ్డాం. మధ్యలో కాలిబాటగా వదిలి బాటకటూ ఇటూ పచ్చటి లాన్ ఉద యపు ఎండకు ఎమరాల్డ్ స్టోన్స్ రాసిపోసి నట్టు మెరిసిపోతోంది. పచ్చిక అంచుల వెంబడి విరగబూసి వున్నాయి ఎర్రటి కన కాంబరాలు.

గులాబీలూ, చేమంతులూ, బంతులూ, మల్లెలూ, జాజులూలాంటివేకాక పేరు తెలి యని ఎన్నో ఇంగ్లిష్ పూలమొక్కలు వున్నా యక్కడ. పూలమొక్కలకు వెనకవైపు జామ, సపోటాలాంటి పళ్ళచెట్లూ చాలా వున్నాయి. మొత్తంమీద మా బాస్ ఇల్లు అందమైన అడవిలో వున్నట్టుంది.

ఇంత అందమైన ఇంట్లో శాకినీ, ఢాకినీలాంటి భార్య! ప్చ్... 'ఐ పిటీ యూ బాస్' అనుకున్నాను.

"ఆవిడ పేరేంటో తెల్సా" అంది శ్యామల.

చటుక్కున గుర్తుకొచ్చింది, "ఆండాళ్ళు" అన్నాను.

'బాప్‌రే చచ్చాం' అంది ఆ పేరు వినగానే ఓ లావుపాటి పర్సనాల్టీ కళ్ళముందు మెది లిందేమో.

నేను కూడా ఆమె పేరు విన్నానుగానీ ఎప్పుడూ చూళ్ళేదు.

బహుశా శ్యామల ఊహించినట్టుగానే

వుంటుందనుకున్నా.

కానీ మా అంచనాల్ని తలకిందులు చేస్తూ సన్నగా, నాజూగ్గా వున్న ఓ స్త్రీ తలుపుతీసింది.

"మా బాస్‌కీ ఈవిడకీ చాలా ఏజ్ డిఫరెన్స్ వున్నట్టుందే" అన్నాను శ్యామలతో రహస్యంగా.

"ఎవరు కావాలి" అందామె.

"బాస్ కావాలి" అన్నాను.

"వాయిస్ కూడా స్వీట్‌గా వుంది" అంది శ్యామల మెల్లగా.

"స్టాఫా? " అంది భృకుటి ముడిచి.

"ఆ..." అన్నాను.

"ప్లీజ్ రండి" అంది కర్టియస్‌గా.

"ఇంత మర్యాద తెలిసిన మనిషి బాస్‌నెందుకూ అలా చంపుకు తింటోంది" అనుకున్నాను.

బాస్ లుంగీ, బనియన్‌తో తీరుబడిగా కూర్చుని న్యూస్‌పేపర్ చదువుకుంటున్నాడు.

ఎదురుగా వెళ్ళి నిలబడి "నమస్తే సర్" అన్నాం.

మమ్మల్ని చూడగానే "నమస్తే రండి రండి..." అంటూ సాదరంగా ఆహ్వానించి సోఫా చూపించాడు.

"మీ మిసెస్ చాలా మేనర్డ్ సర్. మమ్మల్ని ఎంతో ఇదిగా ఆహ్వానించారు" అన్నాను.

"ఆ... అవునా" అని ఇబ్బందిగా నవ్వాడు.

"వెరీ బ్యూటిఫుల్ సర్" అంది శ్యామల.

"ఆ... అవునా" అన్నాడు మళ్ళీ ఇబ్బందిగా నవ్వుతూ.

"ఇద్దరాడవాళ్ళముందు తగుదునమ్మా అని లుంగీ బనీల్లో కూర్చుని ఇకిలిస్తున్నారు. సిగ్గులేదూ" అన్న ఓ భయంకరమైన స్వరం విని అదిరిపడి అటుచూశాం.

దాదాపుగా గున్నఏనుగు సైజులో వున్న ఒక స్త్రీ మూర్తి రొప్పుతూ నిలబడి వున్నారక్కడ.

బాస్ గతుక్కుమని గబుక్కున లేచాడు.

"హి...హి... మా ఆవిడ. వీళ్ళు మా స్టాఫ్. ఆఫీసు పనిమీదొచ్చారు"

అంటూ పరస్పర పరిచయాలు చెయ్యబోయాడు.

"ముందు లోపలికెళ్ళి ఆ దిక్కుమాలిన లుంగీ విప్పి ప్యాంటూ షర్టూ తగిలించుకుని తగలడండి" అంది ఉరుముతున్నట్టుగా.

బాస్ ఒక్క అంగలో అవతలి గదిలోకెళ్ళిపోయాడు.

ఆమె తీక్షణమైన చూపులు బాస్‌మీద నుండి ఇక మా మీదకు మళ్ళాయి.

"నువ్వేం చేస్తావ్" అంది.

"నా పేరు విజయ. క్లరికల్ కేడర్. వయసు ఇరవై ఆరు, క్వాలిఫికేషన్... ఎమ్మే సోషియాలజీ, పోస్టల్ అడ్రస్" అంటున్న నన్ను శ్యామల గోకడంతో ఆగిపోయాను.

భయంలో బయోడేటా మొత్తం చెప్తున్న విషయం అప్పటిక్కానీ అర్థంకాలేదు నాకు.

"నువ్వు? " అంది శ్యామల్ని చూసి.

శ్యామల ఇదిగో, ఈమెకి అసిస్టెంట్‌ని" అంది ఏం చెప్పాలో తోచక.

"మీ ఫ్రెండ్ వాగుడుకాయలా వుంది. వచ్చినపని చూసుకుని చక్కాపొమ్మని చెప్పు" అంది.

ఈలోపు మా బాస్ ప్యాంటూ, షర్టేకాదు. షూ వేసుకుని టై కూడా కట్టుకొచ్చాడు.

"అమ్మగారూ... దోసకాయ పప్పు చెయ్యమంటారా, టమాటానా? " అంటూ వచ్చింది. ఇందాక తలుపు తీసిన నాజూకు పిల్ల.

"ఈ అమ్మాయి పనిమనిషి" అంది నన్ను గిల్లి శ్యామల గుసగుసగా.

"నీకర్థమైన క్షణమే నాకూ అర్థమైంది. దీనికంత గట్టిగా గిల్లాలా? " అన్నాను గొంతు తగ్గించి చిరాగ్గా.

"అయిదు నిమిషాల్లో వస్తా. నువ్విక్కడే

వుండు" అంటూ పనిమనిషికి పురమాయించి ఆండాళ్ళు లోపలికెళ్ళింది.

ఆ అమ్మాయి మాక్కాస్త దూరంలో నిలబడే మమ్మల్నే గమనిస్తోంది.

"ఆ పిల్ల మా ఇంట్లో సర్వెంట్ మెయిడ్ కమ్ స్పై" అన్నాడు బాస్ మెల్లగా.

"స్పై?" ఆశ్చర్యంగా అడిగాను.

"అన్నిచోట్లా నాకు కాపలాగా తానుండలేక ఆండాళ్ళు ఈ అమ్మాయినుంచుతుంది" నిట్టూర్చాడాయన.

నాకాశ్చర్యం వేసింది. పరాయి ఆడవాళ్ళతో భర్త మాట్లాడితే సహించలేని మనిషి అంత పడుచుపిల్లను అందునా అందగత్తెను కాపలాపేరుతో అయితేనేం భర్త కళ్ళెదుట వుంచుతోందంటే... సమ్‌థింగ్ ఈజ్ రాంగ్ సమ్‌వేర్ అనుకున్నాను.

"చిన్న డౌట్ సర్" అన్నాను ఆ అమ్మాయికి వినబడకుండా జాగ్రత్త పడుతూ.

"చెప్పు విజయా" అన్నాడు.

"మీ ఆవిడ నేచర్‌కీ, ఇంట్లో అందమైన పనిమనిషి వుండడానికీ పొంతన లేదే" అన్నాను.

ఆయన ఆ అమ్మాయి వేపోసారి చూసి అతి రహస్యంగా చెప్పాడు, "నిజానికీ అమ్మాయి రెండేళ్ళక్రితంవరకూ మా పక్కింట్లో పని చేస్తుండేది. మా ఆవిడకి మీ ఆయన ఒకావిడతో మార్కెట్ దగ్గర మాట్లాడుతూ కన్పించాడనీ, ఇంకోసారి మీ ఆయన కార్లో ఓ ఆడమనిషిని చూశాననీ నామీద చాడీలు చెప్పింది. అంతే... పక్కింటి వాళ్ళిచ్చే జీతానికి రెండింతల జీతం ఆఫర్‌చేసి నామీద స్పైగా పెట్టింది"

ఆయన చెప్పేది వింటున్న శ్యామల బుర్ర పాదరసంలా పనిచేసింది. వెంటనే లేచి చొరవగా లోపలికెళ్ళి "ఆండాళ్ళుగారూ..." అంటూ పిల్చింది.

ఎందుకైనా మంచిదని నేనూ శ్యామల వెనకే వెళ్ళాను.

ఆండాళ్ళు "మా ఆయన్తోకదా పని. నన్ను పిలుస్తున్నావ్?" అన్నట్టుగా చూసింది.

"చిన్నమాట" అంది ఊరిస్తున్నట్టుగా.

ఆండాళ్లు కొంచెం అట్రాక్ట్ అయినట్టు చూసింది.

"మీ ఆయన ఆఫీస్‌లో ఏ.సి. గదిలో కూర్చుని చేసే నిర్వాకమేంటో తెల్సా" అంది.

"చెప్పు చెప్పు" అంది ఆండాళ్ళు ఆనందంగా.

"మార్లిన్ మన్రో అని... మీ ఆయన పి.ఎ. వుంది. దాంతో సరసాలాడ్డంతోనే సరిపోతుందాయనకు. ఆఫీస్ పని... అర గంట కూడా చెయ్యడు" అంది శ్యామల.

నేను కంగారుపడిపోయాను. 'ఈ ఆండాళ్ళు ఉన్నపళంగా వెళ్ళి ఆ అర్భకుడ్ని చితకబాదదుకదా' అనుకున్నాను.

"నిజమా..." అంది రెండుచేతులూ నడుంమీద పెట్టుకుని ఆమె ముఖంలో ఆనందం మరీ ఎక్కువైంది.

"మీకు డౌటయితే ఈ అమ్మాయినడగండి" అంటూ నన్ను చూపించింది.

ఈ పరిస్థితుల్లో కాదంటే శ్యామల్ని కొడుతుందేమోనని భయపడి, "ఆ... అవునండీ. ఆ మార్లిన్‌మన్రో మహాకిలాడి" అన్నాను.

ఆండాళ్ళు ఆనందంతో తబ్బిబ్బయిపోయింది.

"కూర్చోండి" అంది డైనింగ్ టేబుల్ చూపించి.

నెక్స్ట్‌సీన్ నాకర్థమైంది.

మా ఇద్దరిముందూ రెండు పెద్దపెద్ద ప్లేట్లు పెట్టి చెరో నాలుగిడ్లీలూ, రెండు పూరీలూ, రెండు దోసెలూ పెట్టి ఒక పెద్ద కేసరోల్‌తో చట్నీ పెట్టి "తినండి" అంది.

ఆండాళ్ళు ఫిజిక్ అంత లావుగా ఎందుకైందో అట్టే అర్థమైంది నాకు.

"ఇన్ని తిన్లేమండీ" అన్నాను.

మా పిన్ని చేసిన టిఫిన్ పీకల్దాకా లాగించి బయల్దేరామేమో గుండుసూది పట్టేసందు కూడా లేదు.

"తప్పదు" అంది పరమానందంగా నవ్వుతూ.

"తినకపోతే ఏం చేస్తుంది?" అన్నాను శ్యామలతో రహస్యంగా.

"రిస్క్ తీసుకోవటమెందుకు? ఎలాగో తినేయ్. మధ్యాహ్నం భోజనం మానేద్దాం" అంది శ్యామల.

ప్లేట్లో మిరప తొక్క మిగిల్చినా కొడుతుం దేమోనని శుభ్రంగా తినేశాం. కష్టపడి తిన్నందుకు మంచి ఫలితం దక్కింది. అక్కడే కూర్చోబెట్టి మార్లిన్ మన్రో గురించి మళ్ళీమళ్ళీ అడిగి వింది. విన్నంతసేపూ అమితానందాన్ని అనుభవించింది.

పాపం మా బాస్‌కి ఆయనమీదే మేం చాడీలు చెప్తున్న విషయం అర్థంకాక, 'మా యావిడ్ని ఎంత చక్కగా బుట్టలో వేశారో' అన్నట్టుగా మావంక మెచ్చుకోలుగా చూస్తు న్నాడు.

ఆయన ముఖకవళికల్ని కూలంకషంగా గమనిస్తూ, అక్కడే గోడకు ఆనుకొని రాటలా నిలబడి వుంది పనిమనిషి.

"మీకు మీ ఆయనంటే చాలా ప్రేమను కుంటా" అంది.

శ్యామల చీకట్లో రాయివేస్తూ.

అప్పటివరకూ ఆనందంగా నవ్వుతున్న ఆండాళ్ళు ఒక్కసారిగా వెక్కి వెక్కి ఏడ వటం ప్రారంభించింది.

ఇద్దరం బిత్తరపోయాం కాసేపు. శ్యామల కంటే ముందుగా తేరుకున్నది నేను. కదిలి కదిలి ఏడుస్తున్న ఆండాళ్ళు తలమీద చెయ్యివేసి మార్దవంగా నిమిరాను.

అప్రయత్నంగా ఆమె తలను నా భుజా నికి ఆనించింది. నేనింకా అభిమానంగా ఆమె తలమీద రాశాను. ఆ స్పర్శ ఆమెనె క్కడికో తీసుకుపోయింది.

"నేను చాలా వికారంగా వుంటానుకదూ!" అంది.

"ఛ... ఏం మాటలండీ అవీ" అన్నాను.

"నన్ను చెప్పనివ్వమ్మా. నేను గున్న ఏను గులా వుంటాననీ... నా ఒంటిరంగు నలు పనీ... నా గొంతు వినసొంపుగా వుండదనీ, నన్నెవరూ పెళ్ళిచేసుకోరనీ నా చిన్నప్ప ట్నించే అందరూ ఎగతాళి చెయ్యడం నాకు తెలుసు. అయినా నాకు పెళ్ళయింది. ఆయన నా డబ్బు చూసి చేసుకున్నారేమో నాకు తెలీదు. కానీ నేనాయన్ని మనసారా ప్రేమిస్తున్నాను. ప్రాణంలా భావిస్తున్నాను. ఆయన్నొదిలి అరక్షణం కూడా బతకలేను" దుఃఖంతో ఆమె భుజాలు ఎగిరెగిరి పడు తున్నాయి.

తను అందంగా వుండదు గనుక తన భర్తని ఎవరైనా ఆకర్షిస్తారేమోనన్న దిగులు. అసలు భర్త తనను ప్రేమిస్తు న్నాడా లేదా అన్న అనుమానం. రెండూ కలిసి ఆమెలో ఒకలాంటి భయాన్ని క్రియేట్ చేశాయి. ఆ భయం రాన్రాను ఫోబియాగా బలపడింది. అందం లేదన్న భయంతో అథార్టీ చెయ్యడం మొదలెట్టింది. భర్తకి తనమీద ప్రేమ లేదన్న అనుమా నంతో అతన్ని అనుక్షణం అవమానించటం మొదలెట్టింది. అతన్ని హింసించడంలో ఆనందాన్ని పొందుతోంది. ప్రతి ఒక్కరూ ఆమె ఆకారాన్ని చూసో... భర్తపట్ల ఆమె ప్రవర్తనని చూసో... నవ్వుకునేవాళ్ళేగాని ఆమె అంతరంగాన్ని స్పృశించినవాళ్ళే లేరు. కాస్త అభిమానాన్ని చూపించేసరికి అంత మాత్రానికే కరిగిపోయి మనసు మూట విప్పేసింది.

ఇక నా పార్ట్ నేను ప్లే చెయ్యడం ఆరం భించాను. "మీ భర్తకు మీరంటే పంచప్రా ణాలు తెలుసా! ఆఫీసులో అంతమంది ఆడ వాళ్ళం వున్నా ఒక్కనాడైనా అసభ్యంగా ప్రవర్తించలేదు. మేమిప్పుడు చెప్పిన మార్లి న్‌మన్రో అనే అమ్మాయి నిజానికసలు లేదు. అయినా మేం చెప్పగానే మీరు నమ్మే శారు. అట్లా నమ్మేసిన మీరు ఇక మీ భర్తని సాధించడం మొదలెడతారు చూశారా! మీ భర్తపట్ల మీ ప్రవర్తనని కామె

డీగా తీసుకువో... మీనుండి ఏదైనా ఆదాయాన్ని పొందాలన్న స్వార్థంతోనో... మీకు లేనిపోనివి చెప్పి రెచ్చగొట్టి తమాషా చూస్తున్నారు కొందరు.

నిజానికి మీవారు మిమ్మల్ని అమితంగా ప్రేమిస్తున్నారు. ప్రేమకు కొలమానం అందం కాదు హృదయం. మీరనుకొన్నట్లూ అందమే ప్రేమకు కొలమానమైతే ఈ లోకంలో అందవికారులంతా ఆత్మహత్య



చేసుకుని చావాల్సిందే.

తల్లిదండ్రులు కోట్ల ఆస్తితో అప్సరసను తెచ్చి పెళ్ళి చేస్తామన్నా... కొందరెందుకు ప్రేమించిన వ్యక్తుల కోసం ప్రాణాలే ఇస్తున్నారు. ఓసారి బయటకు అడుగుపెట్టి ప్రేమికుల్ని వాచ్ చెయ్యండి... అన్ని జంటలూ అందమైనవే అయ్యుంటాయేమో! ప్రేమ ఎప్పుడు ఎందుకు ఎవరిమీద కలుగుతుందో ఎవరూ చెప్పలేరు. ఇంతెందుకు మీ వారిని ఒక్కసారి అడిగిచూడండి. మిమ్మల్ని ప్రేమిస్తున్నారో లేదో" అన్నాను.

మా బాస్ ఎప్పుడొచ్చాడో అక్కడికి మా వెనకే నిలబడివున్నాడు.

"ఏం సర్... మీ మిసెస్‌ని మీరు ప్రేమించటం లేదూ" అన్నాను.

ఆయన సమాధానం ఇవ్వలేదు. చప్పున ఆండాళ్ళు చేతుల్ని తన చేతుల్లోకి తీసుకున్నాడు.

"ఆండాళ్ళూ! నిన్ను తప్ప నేనింకెవర్నీ ప్రేమించలేను. ప్రేమించను. అనుక్షణం నన్ను అనుమానించి నిన్ను నువ్వు అవమానించుకోకు. ఒట్టేసి చెబుతున్నా. నా ఈ శరీరం... మనస్సు నా జీవితం జీవితమే నీది" అన్నాడు.

ఆయన కళ్ళలో చిప్పిల్లిన నీళ్ళు చూసి చలించిపోయింది ఆండాళ్ళు.

"మీరు చెప్పిందంతా వాస్తవమని నాకెప్పుడో తెలుసండీ. అయినా ఏదో భయం. అనుమానం. నన్ను అనుక్షణం వేధిస్తుంటాయి. మిమ్మల్ని హింసించమని నన్ను ప్రేరేపిస్తుంటాయి. నేనేం చెయ్యనండీ"

నేను సూటిగా ఆండాళ్ళు కళ్ళలోకి చూస్తూ అడిగాను. "మీ భర్తనట్లా హింసిస్తున్నందుకు మీకు బాధగా వుందా?"

కళ్ళనిండా నీళ్ళతో నన్ను చూస్తూ తలూపింది ఆండాళ్ళు.

"అయితే మారుమాట్లాడకుండా నాతో రండి. మీలో వున్న ఫోబియా మటుమాయమయ్యేలా చేస్తాను" అన్నాను.

వెంటనే ఆండాళ్ళు "అంత భాగ్యాన్ని నువ్వు నాక్కలిగిస్తానంటే నేనెందుకు కాదంటాను" అంది సంతోషం నిండిన కళ్ళతో భర్తకేసి చూస్తూ.

**మా** బాస్ భార్యకు ఆపరేషన్ జరిగింది. రూమ్ నెంబర్ సిక్స్‌లో బెడ్‌మీద మగతగా పడుకుని వుందామె.

నేనూ శ్యామలా ఆవిడ్ని కనిపెట్టుకుని ఉదయంనుండీ అక్కడే వున్నాం.

"మీరింటికెళ్ళి ఫ్రెషప్ అయి రండమ్మా. "నేచూసుకుంటానావిడ్ని" అన్నాడు బాస్.

"ఓకే సర్... మేమో గంటలో వస్తాం. ఆ తర్వాత మీరెళ్దురుగాని" అన్నాను.

ఇద్దరం ఇంటికెళ్ళేసరికి ఎట్లా ఉప్పం దిందో మరి. మా ఇద్దరి అమ్మానాన్నలే కాదు, మా ఆయన్ల అమ్మానాన్నలు కూడా వూడిపడివున్నారు.

"మా అబ్బాయిల్ని మీరే ఏదో చేసుం టారు" అంటూ వాళ్ళు వీరంగం వేస్తు న్నారు.

"అసలు మీ అబ్బాయిలవల్లే మా అమ్మా యిల జీవితాలిట్లా మోడువారిపోయినై" అంటూ మావాళ్ళు చిందులేస్తున్నారు.

మా పిన్ని "ముందు భోజనాలు కాని వ్వండి. తీరిగ్గా మాట్లాడుకుందాం" అంటూ వాళ్ళను అనునయిస్తోంది.

మమ్మల్ని చూడగానే మా అమ్మానా న్నలు బావురుమన్నారు.

వాళ్ళ అమ్మానాన్నలు మూతీముక్కూ విరిచారు.

మేం ఫ్రెషప్ కావడం కాదుగానీ ఇంకా వడలిపోయి తోటకూర కాడల్లా వేళ్ళాడి పోతూ బతుకుజీవుడా అంటూ హాస్పిటల్లో వచ్చిపడ్డాం.

అప్పటికే మా బాస్ ప్లేస్‌లో ఇంకోవ్యక్తి కూర్చుని వున్నాడు. ఆయన ఆండాళ్ళు నాన్నగారట. అల్లుడుగారు ఫోన్ చెయ్య గానే పరిగెత్తుకొచ్చారు.

మమ్మల్ని మేం పరిచయం చేసుకున్నాం ఆయనకి.

"అమ్మా! ఇదేం ప్రమాదకరమైన ఆపరే షన్ కాదుగదా!" అన్నాడు.

"ఆనందకరమైన ఆపరేషనండీ" అంటూ ఆయనకి దాని గురించి చెప్పాం.

ఆయన సంతోషించాడు.

ఆండాళ్ళు కళ్లు తెరిచి చూసి "ఆయనేరీ" అంది.

"ఇందాక రిసెప్షన్‌లో అమ్మాయితో బాతా ఖానీ వేస్తూ కన్పించాడుకదూ" అన్నాను శ్యామలతో.

ఆండాళ్ళు నీరసంగా నవ్వింది. "ఆయన డిస్కోథెక్‌లకు పోయినా నేను పట్టించు కోను. మా ఆయన బంగారం" అంది.

రూమ్‌లో బోర్‌గా అన్పించి రిసెప్షన్‌లో కూర్చుని ఆరోజు న్యూస్‌పేపర్ చూస్తున్నాం. చెరో లీఫూ వుంచుకుని. దాదాపు మధ్యాహ్నం మూడు కావస్తోంది. అవి కన్సల్టేషన్ అవర్స్ కాకపోవడంతో రిసె ప్షనంతా ఖాళీగా వుంది. డాక్టర్ పురుషో త్తమ్ పైన రెసిడెన్స్‌లో రెస్ట్ తీసుకుంటు న్నాడు.

కాసేపు చదివాక... మెడ నెప్పిగా అన్పించి తలెత్తాను. అంతే... నా కళ్ళ ముందు నుంచి ఓ అద్భుతం నడిచిపో యింది.

మా ఆయన... తలకు తెల్లటి బ్యాండే జీతో చేతిలో ఫ్లాస్కుతో నా ముందునుంచే నడిచి పన్నెండోనంబర్ రూమ్‌లోకి వెళ్ళాడు. ముఖానికి పేపర్ అడ్డుగా వుండడంవల్ల ఆయన నన్ను గమనించినట్టు లేదు.

అది హాస్పిటల్ అన్న విషయం కూడా మర్చిపోయి 'ఏమండీ' అంటూ ఒక్క పరు గులో పన్నెండో నంబర్ రూమ్‌లోకి దూసు కుని వెళ్ళాను. అక్కడింకో అద్భుతం సాక్షా త్కరించింది.

భాస్కర్రావు బెడ్‌మీద దిండ్ల కానుకుని కూర్చుని బత్తాయి పండు ఒలుచుకుతింటు న్నాడు.

నేనెందుకు పరిగెత్తానో అర్థంకాక నా వెనకాలే పరిగెత్తుకొచ్చిన శ్యామల నాకంటే గట్టిగా "ఏమండీ" అంది.

★ ★ ★

"మీ గుండెల్లో నా కోసం.... నా గుండెల్లో

మీ కోసం... సహజ సిద్ధమైన ప్రేమ బోలె డంత వుందిగా! ఇంకా ఎందుకండీ ఈ సిలికాన్ ప్రేమలు" అంది శ్యామల వాళ్ళాయన తలకు కట్టిన బ్యాండేజీని ఆప్యాయంగా తడుముతూ.

"నీ కోసమే" అన్నాడు భాస్కర్రావు.

నేను కూడా మా ఆయన తలక్కట్టిన బ్యాండేజీని ఆప్యాయంగా తడుముతూ అదే ప్రశ్న వేశాను.

"నీ కోసమే" అన్నాడు మా ఆయన.

"అయితే మొన్న మేడమీద నాతో చెప్పినవన్నీ అబద్ధాలేనా? ఆపరేషన్‌కు ముందు నామీద మీకున్న ప్రేమ నిజంకాదా? " నా కళ్లలో నీళ్ళూరాయి.

నా చెక్కిళ్ళమీదకు జారిన కన్నీటిని కొనగోటితో మీటి అన్నాడు మా ఆయన. "అందులో ఆవగింజంత అబద్ధం కూడా లేదు. అప్పటికీ ఇప్పటికీ నా ప్రేమలో మార్పే లేదు"

"మరెందుకీ ఆపరేషన్? "

"ఎందుకంటే" మా ఆయన ఒక్కక్షణం కళ్లు మూసుకుని తరువాత నా కళ్లలోకి గాఢంగా చూశాడు.

"నాలోని ప్రేమను రెట్టింపు చేసుకోవడానికి" అన్నాడు.

"అంటే? " అన్నాను అర్థంకాక.

"నిన్నెప్పటికన్నా ఎక్కువగా ప్రేమించాలని" అన్నాడు.

"ముందు నేను కూడా ఈ ఆపరేషన్ అవసరం లేదనే చెప్పానమ్మా. దట్సూ సీక్రెట్‌గా అసలు చెయ్యనన్నాను. బట్... ఆఫ్టర్ లిజనింగ్ టు దైర్ రీజన్... చెయ్యాలన్న నిర్ణయానికొచ్చాను" అన్నాడు అప్పుడే రౌండ్స్‌కి వచ్చిన డాక్టర్ పురుషోత్తం.

"వాట్స్ దట్ రీజన్ డాక్టర్" అన్నాను ఆసక్తిగా.

"ఒక మంచి భర్త సహజంగానే భార్యని ప్రేమిస్తాడు. అది గొప్ప విషయమేం కాదు. కానీ ఒక గొప్ప భర్త భార్యని ఆరాధిస్తాడు. పరిధులు దాటిన ప్రేమే ఆరాధన. మీ ఆయన గొప్ప భర్తగా మిగలాలనుకున్నాడు. అందుకే మైక్రోచిప్ సాయంతో



తనలోని ప్రేమను రెండింతలుగా చేసుకున్నాడు" ఆగాడాయన.

నేను శ్యామలకేసి 'నీకేమైనా అర్థమైందా' అన్నట్టు చూశాను. అది అర్థం కాలేదన్నట్టు పెదవి విరిచింది.

మా సైగల్ని పసిగట్టేశాడు డాక్టర్ పురుషోత్తమ్. ఆయన పెదవులు అల్లరిగా నవ్వాయి. "అర్థం కాలేదుకదూ! అనుభవం మీద తెలుస్తుందిలే" అన్నాడు.

బెడ్‌మీద ముసుగుతన్ని పడుకుని వున్నాను నేను. బ్లాంకెట్‌ని అమాంతం లాగిపారేసి నా చెంపకు ఓ ముద్దూ, నా

చేతికి ఓ కాఫీ కప్పు ఇచ్చాడు మా ఆయన.

ఎట్లాగో నిద్రమత్తు వదిలించుకుని కాఫీ తాగాను.

"విజ్జీ! లేచి బ్రెష్ చేసుకోమ్మా" అంటూ కిచెన్‌లోంచి కేకేశాడు మా ఆయన.

బాత్‌రూమ్ దగ్గరకెళ్ళి బద్ధకంగా డోర్‌నా నుకుని నిలబడ్డాను. నా భుజం మీదో టవ ల్ పడింది. నా చేతిలో బ్రష్ ప్రత్యక్షమైంది.

స్నానం చేశాకా బాల్కనీలో న్యూస్‌పేపర్ తిరగేస్తూ కూర్చున్నాను. ఈలోపు మా ఆయన టిఫిన్ రెడీ చేసి "విజ్జీ కమాన్" అన్నాడు. వద్దంటున్నా కొసరి కొసరి తిని పించాడు. ఇద్దరికీ లంచ్‌ప్యాక్ చేసి కింద కెళ్ళి బైక్ కిక్ కొట్టి నిలుచున్నాడు.

నేను మెట్లు దిగబోతూ... శ్యామల పోర్ష న్‌కేసి చూశాను. అది కాళ్ళూపుకుంటూ బాల్కనీలో కూర్చుని కారప్పూస తింటోంది.

"నాకిష్టమనీ మా ఆయన స్వయంగా చేశాడు. కాసిని ప్యాక్ చేసివ్వనా" అడిగిం దది.

"ఈవెనింగ్ ట్రై చేస్తాలే" నవ్వుతూ చెప్పాను.

నేను కూర్చోగానే బైక్ రివ్వున దూసుకు పోయింది.

సాయంత్రం ఆఫీస్ నుంచి వచ్చాక చల్ల గాలి పీల్చుకోవడానికి నేనట్లా టెరస్‌మీదకె ళ్ళాను.

ఓ పదినిమిషాల తర్వాత ప్లేట్లో కార పూస పోసుకుని శ్యామలొచ్చింది.

"పరిధులు దాటిన ప్రేమంటే ఏంటో అను కున్నా. ఆహాఁ ఎంత హాయిగా వుందో" అన్నాను.

"ఆ ప్రేమ ఫలితమే ఈ కారప్పూస. ఎంత కమ్మగా వుందో రుచి చూడు" అంది శ్యామల.

"ఏమైనా మా ఆయన నన్ను ప్రేమించి నంత గొప్పగా ఏ భర్తా ఏ భార్యనూ ప్రేమించడు" అన్నాను గర్వంగా.

"చాల్లే వూరుకో. ఏమైనా మా ఆయన నన్ను ప్రేమించినంత గొప్పగా ఏ భర్తా... ఏ భార్యనూ ప్రేమించడు" అంది శ్యామల, నాకంటే గర్వంగా. ఇంతలో మా హనుమా యమ్మ పిన్ని పైకొచ్చి టెరస్‌మీద చతికిలప డింది.

ప్లేట్లో వున్న కారప్పూస ఇంత నోట్లో వేసుకుని "అబ్బ! ఎంత కమ్మగా చేశావే" అంది శ్యామలతో.

నేను పక్కున నవ్వి "అవి చేసింది శ్యామల కాదు పిన్నీ... వాళ్ళాయన" అని చెప్పాను.

ముక్కున వేలేసుకుంది మా పిన్ని.

మేమిద్దరం మా ఆయన్ల సిలికాన్ ప్రేమ గురించి ఒకరి తర్వాత ఒకరుగా పూస గుచ్చినట్టు చెబుతుంటే... మా పిన్ని కార పూస తింటూ మొత్తం విన్నది.

ఆ తర్వాత దిగులుగా ముఖంపెట్టి "అమ్మాయ్ విజ్జీ మీ బాబాయ్‌కి ఆ చిప్పు తీసేసి ఈ టైపు చిప్పు పెట్టటానికి పురుషో త్తంగార్ని కనుక్కుందూ పుణ్యముంటుంది" అంది.

ఆ రాత్రి బెడ్‌రూమ్‌లో నేను మా ఆయన కళ్ళలోకి మా ఆయన నా కళ్లలోకీ చూస్తూ కూర్చుని వున్నప్పుడు అన్నాన్నేను ఆయనతో "ఎంత గొప్ప ప్రేమండీ మీది!"

మా ఆయన చప్పున నన్ను గుండెలకు హత్తుకుని "ఏముంది విజ్జీ ఇందులో గొప్ప తనం. ఇన్నాళ్ళూ ఈ సేవలన్నీ నువ్వు నాకు చేసినవేగా! మైక్రోచిప్ అవసరం లేకుండానే ఓ భార్య భర్తకు చేసే సేవల ముందు మైక్రోచిప్ అమర్చుకున్నాక ఓ భర్త భార్యకు సేవలు చెయ్యడం గొప్ప విష యమేం కాదు. ఎప్పటికీ నా సిలికాన్ ప్రేమకన్నా నీ సహజమైన ప్రేమే గొప్పది" నేను మరింతగా ఆయన గుండెల్లోకి ఒదిగి పోయాను.



# చతురప్రపంచం

## ఎన్నో ఎన్నెన్నో...

మనిషి ముందుకుతప్ప వెనక్కీ, పక్కలకీ నడవటం నేర్చుకోకపోయివుంటే... తన జీవితకాలంలో కనీసం రెండుసార్లు భూగోళాన్ని చుట్టిరావాల్సి వచ్చేది. నేర్చుకుని బతికిపోయాం కదూ!

అంటార్కిటికాలో ఇంటర్ బైపీ గ్రూపుం

'ఎడారి ఓడ' అని ఒంటె ఊరికే పేరు కొట్టేసిందిగానీ... నిజానికి ఎలుక దానికన్న ఎక్కువకాలం నీళ్ళు లేకుండా నిలకడగా ఉండగలదుటండీ. 'కలుగుఓడ' అనడం బాగుండదని వదిలేసినట్లున్నారు.

పుట్టినప్పుడే యాభై టన్నులుంటుందిట బేబీ తిమింగలం! పూర్తిగా పెరిగిం తరువాత ఇంకెంతుంటుందో అనుకుంటున్నారా? అబ్బే... ఒక్క నూటయాభై




డదు. ఎందుకో తెలుసా? అక్కడ అసలు కప్పలు దొరకవుట. మిగిలిన ఖండాలనిండా కప్పలే కప్పలు.

కోతులు అద్దంలో చూసుకోలేవు. కోతిముఖానికి అద్దం ఎందుకంటారా! అయినా... 'ఐనా'లో చూసుకోలేని బతుకెందుకండీ... వృథా! పాపం!

ఒక్క సెకనులో ఇరవైసార్లు పొడవగలదు. ఎవరనుకుంటున్నారూ? వడ్రంగిపిట్ట.

టన్నులు మాత్రమే...దాదాపు ఇరవై మారుతీకారులంత బరువు. అంతే!

ఎనిమిది మందిలో ఒకరు గురకపెడితే... పదిమందిలో ఒకడు పళ్లు కొరుకుతాడట నిద్రలో. ఎవరు తీస్తారో, ఎందుకు తీస్తారో కదా ఈ అవసరంలేని లెఖ్ఖలు.

అంటించుకునేగోజు చరిత్ర... రాజుల చరిత్రకన్నా పాతది. ఆ రోజుల్లో ఆర్టిస్టులు గుహల్లో బొమ్మలు గీసేందుకు కుళ్ళిన కోడిగుడ్డు, ఎండిపోయిన రక్తం, పండి మగ్గిన పండ్లనుండి తీసిన గుజ్జును కలిపి మళ్ళీ గుజ్జుగుజ్జుచేసి... ఆ గోజును వాడేవాళ్ళుట.

నాగరికత మరిగిన తరువాత ఈజిప్షియనులు ఈ సూత్రం వదిలేసి గిట్ట ఎముకలను, వట్టి మాంసం ముక్కలను మాత్రం బాగా ఉడికించి పెయింట్ల కింద వాడుకొనే వాళ్ళుట. ఇప్పుడు ఈ పప్పులుడకవు గనక... సింథటిక్స్‌తో కంపెనీలు రకరకాల బంకలు తయారుచేస్తున్నాయన్నమాట!

ఏ రెండు నుదుటి రాతలు ఒకలా వుండవు. ఏ రెండు జీబ్రాలకు గీతలు ఒకలా వుండవు. దేవుడికిన్ని ఐడియాలెలా వస్తాయో మరి!

ప్రపంచంలో పదిశాతంమంది ఎడంచేతి వాటంగాళ్ళే!

'సెట్' అనే మాటకు ఉన్నన్ని అర్థాలు ఇంగ్లీషుభాషలో ఇంకేపదానికి లేవని 'పండితుల సెట్' అంటున్నది!

కన్నుకొట్టకుండా ఉండొచ్చుగానీ... కనురెప్పలు కొట్టగుండా వుండగలమా? ఏదో దేవతలూ, చంద్రబాబు అలా ఉండగలరు. మన మామూలు మానవమాత్రుల రెప్పలు మాత్రం ఏడాదికి కనీసం కోటిసార్లు కొట్టుకుంటాయని లెక్కలు చెపుతున్నాయి. వింటుంటే గుండె కొట్టుకోదూ!

ఊసరవెల్లి అనగానే రంగులు మార్చటమే గుర్తొస్తుంది. దాని నాలిక పొడుగు తన వంటికన్నా రెట్టింపుంటుందట! అందుకనే అలా అందర్నీ పూరికే వెక్కిరిస్తుంది కాబోలు!

ఒక ఆవు జీవితకాలంలో రెండు లక్షల గ్లాసుల పాలు ఇవ్వగలదటండీ! తన జీవిత కాలంలో సుమండీ!

డాల్ఫిన్ చేపలు ఒంటికన్నుతో నిద్రపోతాయి. చీమలైతే అస్సలు నిద్రేపోవు. ఏంరాచకార్యాలు వెలగబెట్టడానికోగానీ!

నాలికతో ఎవరైనా చెవులను శుభ్రంచేసుకోగలరా? జిరాఫీ చేస్తుందాపని. 21 అంగుళాల పొడుగుంటుందట దాని టంగ్! మొసలి మాత్రం అసలు దాని నాలుకే బైట పెట్టలేదు. నోరుతెరుచుకుని ఎదురుచూస్తుంటుంది ఎవరైనా వచ్చి పడకపోతారా అని. ఎవరి 'టెక్‌నిక్' వాళ్ళది.

'గో' అనేది ఇంగ్లీషులో అన్నింటికన్నా అతి తక్కువ అక్షరాలతో ఏర్పడిన సంపూర్ణ వాక్యమని భాషాపండితులవాదన. మనభాషలో అయితే ఆ రెండు కూడా అక్కర్లేదు...'పో' అనే ఒక్క అక్షరంచాలు. మనమే బెటర్ కదూ!

ఉష్ట్రపక్షికి మెదడుకన్నా కళ్ళు పెద్దవట. ఏంలాభం... ఇసుకలో తలబెట్టి అసలు చూడదుగదా!

మామూలు మనిషి రోజుకు కనీసం పదిహేనుసార్లు నవ్వుతాడట. అంతకన్నా తక్కువ నవ్వితే మనిషేకాదన్నమాట. పదిహేనుసార్లు లెక్కపెట్టుకుని నవ్వకపోతే కష్టమే.

---

## సూర్యుని చుట్టూ తిరుగుతుందీ...

మనం నివశించే భూగోళం విస్తీర్ణం 19,69,35000 చదరపు మైళ్లు. దీంట్లో 70 శాతం నీరు. ఇందులో 97 శాతం ఉప్పు నీరు. కేవలం 3 శాతమే మంచినీరు. సముద్రాలు, నదులుపోగా మిగిలిన 30 శాతం మాత్రమే భూమి. భూగోళానికి అతిలోతు ప్రాంతం సముద్రమట్టానికి 1302 అడుగుల దిగువన ప్రాంతం. ఇక్కడ డెడ్ సీ వుంది. అతి ఎత్తైన ప్రాంతం ఎవరెస్ట్ శిఖరం. ఇది సముద్రమట్టానికి 29028 అడుగుల ఎత్తులో వుంది.

భూగోళం ఈ కింది రసాయనాల మిశ్రమంతో రూపొందిందని శాస్త్రజ్ఞులు నిర్ణయించారు. ఆక్సిజన్ 46.6 శాతం, అల్యూమినియం 8.1 శాతం, ఇనుము 5 శాతం, సోడియం 2.8 శాతం, మెగ్నీషియం 2.1 శాతం, కాల్షియం 3.6 శాతం, పొటాషియం 2.6 శాతం, సిలికాన్ 27.7 శాతం, ఇతరాలు




1.5 శాతం.

భూగోళానికి నీలిగ్రహం అని పేరు. ఎందుకంటే ఆకాశంలోని నీలిరంగు సముద్రాల్లో, నదుల్లోపడి ప్రతిబింబించి, అంతరిక్షంలోంచి చూస్తే ఇది నీలంగా కనపడుతుంది. భూగోళం బరువుని కూడా శాస్త్రజ్ఞులు అంచనా కట్టారు. ఆ బరువు 6,585,600,000,000,000,000 టన్నులు. ఇంత బరువైన ఈ గ్రహం ఎలాంటి ఆధారం లేకుండా అంతరిక్షంలో గంటకి 66,400 మైళ్ల వేగంతో ప్రయాణిస్తుంటుంది. భూగోళంలోని 11 శాతం భూమిని మాత్రమే ఆహారం పండించడానికి ఉపయోగిస్తున్నారు.

పూర్వం అన్ని ఖండాలు కలిసివుండేవి. కానీ కాలక్రమేణా యూరప్, ఆసియా, ఆఫ్రికా ఖండాలు విడిపోయాయి. అలాగే ఇతర ఖండాలు కూడా. భూమిమీద అతిపెద్ద జీవులైన డయనోసర్‌లు ఆరున్నరకోట్ల సంవత్సరాల క్రితం అంతరించిపోయాయని అంచనా. 13 కోట్ల సంవత్సరాలని మరో అంచనా. ఇవి అంతరించిపోవడానికి అనేక కారణాలు ప్రతిపాదించబడ్డాయి. రోగాలు, చలితో కూడిన మంచు, ఆహార కొరత, ఇలాంటివి...

చిలీదేశంలోని అటకామ అనే ఎడారిలో అసలు వర్షపాతమే వుండదు. 400 ఏళ్ల తర్వాత తొలిసారిగా 1971లో ఇక్కడ చినుకు పడిందట. ఇలా ఈ భూగోళంలో ఇలాంటి చిత్రాలు మరెన్నో.

---

## మదర్స్ డే

'మాతృదేవోభవ' అంటూ మన సంప్రదాయం తల్లికిచ్చే స్థానం చాలా గొప్పది. అయితే అది శాస్త్రాలవరకే పరిమితమయి ఈ ఆధునికయుగంలో ఆ భావాలే అంతరించిపోయాయి. అయినా చదువుల్లో మాత్రం ఈ వాక్యాన్ని వల్లెవేస్తూనేవుంటాము. అమెరికాలో కూడా మాతృత్వాన్ని మదర్స్‌డే పేరిట గౌరవిస్తారు అక్కడి ప్రజలు. దీనికి స్ఫూర్తి అనారీస్ జార్విస్ అనే మహిళ.

ఆమె అమెరికాలో వెస్ట్‌వర్జీనియాలోని గ్రాఫ్టన్ అనే ఊళ్లో ఓ మతాధికారికి పుట్టింది. సన్‌డే స్కూల్లో ఆమె టీచర్‌గా పనిచేసేది. ఆమె తల్లి 1955 మేలో మరణించింది.

రెండేళ్ళ తర్వాత 1907లో సండే

స్కూల్ సూపరింటెండెంట్ అనారీస్ జార్విస్‌ని ఆ స్కూల్‌కి సంబంధించిన చర్చి అభివృద్ధికి కారణభూతులయిన ఆడ వారి గౌరవార్థం ఓ మెమోరియల్‌ని ఏర్పాటు చేయమని కోరాడు.

అనా ఆ విషయంమీద ఆలోచిస్తుండగా తల్లి మాట వినని ఓ పెంకిఘటం కళ్లబడ్డాడు. చర్చికి తమ పిల్లలతో వచ్చే తల్లులు, తమ మాట వినని పిల్లలతో పడే అవస్థ అనా చాలాకాలంగా గమనిస్తోంది. దాంతో ఆమెకి ఓ ఆలోచన మెరుపులా తట్టింది. తమ తల్లులు బతికివుండగానే పిల్లలు తల్లి పట్ల తమ గౌరవాన్ని చాటుకుందుకు ఓ రోజును కేటాయించాలనుకుంది.




దానిని గురించి ఆ చర్చి నిర్వాహకులతో చర్చించి వాళ్ళని అందుకు ఒప్పించింది. మే 1907 రెండో ఆదివారం (తన తల్లి మరణించిన నెలకి గుర్తుగా) గ్రాస్టన్ చర్చిలో తల్లుల గౌరవార్థం ఓ స్పెషల్ మెమోరియల్ సర్వీస్‌ని నిర్వహించింది. అది విజయవంతమవడంతో 1908 మే 10న ఫిలడెల్ఫియాలో ఓ చర్చిలో తొలిసారిగా మదర్స్‌డే పేరిట ఓ మెమోరియల్ సర్వీస్‌ని నిర్వహించింది. ఆ సందర్భంగా తన తల్లికి ఇష్టమైన తెల్లరంగు పూలతో చేసిన అలంకరణ సామగ్రితో చర్చిని అందంగా అలంకరించింది.

ఇదీ విజయవంతమవడంతో అనా అమెరికాలోని వందలకొద్దీ చర్చిలకి ఉత్తరాలు రాసి మదర్స్‌డేని దేశం అంతటా నిర్వహించాలని కోరింది. ఆ పనిలో తన మిత్రుల సహాయాన్ని తీసుకుంది. అలా అనా ఆరేళ్లు మదర్స్‌డే గురించి కృషి చేసింది. ఇది ప్రభుత్వాన్ని ఆకర్షించింది.

చివరికి మే 8 1914న అమెరికన్ కాంగ్రెస్‌లోని ఉభయసభలు మదర్స్‌డేని దేశం అంతా జరుపుకోవాలని బిల్‌ని పాస్ చేసింది. ఆరోజున అన్ని ప్రభుత్వ కార్యాలయాల్లో అమెరికన్ జాతీయ జెండా ఎగరెయ్యాలని ప్రతియేటా మేలో రెండో ఆదివారం మదర్స్‌డేగా జరుపుకోవాలని అప్పటి ప్రెసిడెంట్ ఉడ్రోవిల్సన్ శాసనం చేశాడు. ఈ ఉత్సవాన్ని ఇప్పుడు ఒక్క అమెరికాలోనే కాక కెనడా, ఆస్ట్రేలియా, బెల్జియం, డెన్మార్క్, చైనా, ఫిన్‌లాండ్, ఇటలీ, జపాన్, మెక్సికో, టర్కీ ఇలా ఎన్నో దేశాల్లో జరుపుకుంటున్నారు.

✱

# ఏరిన ముత్యాలు

- ఎక్కడ విజ్ఞాన శాస్త్రం తక్కువ స్థాయిలో ఉంటుందో అక్కడ దేవుడి ప్రభావం ఎక్కువగా ఉంటుంది.

  – పెరియార్

- ప్రపంచాన్ని అర్థం చేసుకోవాలనే కోరిక, దాన్ని మార్చాలనే కోరిక ఈ రెండూ మానవ ప్రగతికి ప్రధాన ప్రేరకాలు.

  – రస్సెల్

- శాంతంగా, నిబ్బరంగా ఉండటమే నిజమైన శక్తికి నిదర్శనం.

  – వివేకానంద

- తప్పులు చేసేవారికి కోపం ఎక్కువ, క్షమించేవారికి శాంతం ఎక్కువ.

  – పైథాగరస్

- సత్యం చెప్పు కానీ రహస్యాలు వెల్లడించకు.

  – యాజ్ఞవల్క్యుడు

- పేదవారికి చేపను దానమివ్వకు, చేపను పట్టడం నేర్పు.

  – చైనాసూక్తి

- నిరాశతో కూడిన ప్రతి ఒక్క శ్వాస మరణానికి దగ్గరి మెట్టు.

  – హజరత్‌అలీ

- మనస్సాక్షి మనిషిలో దేవుని ఉనికి తెలుపుతుంది.

  – స్వేడల్‌బర్గ్

- తెలివైనవాడు తన మాటలను, మనసును అదుపులో పెట్టుకోవాలి.

  – కెన్

- ఎప్పుడూ ఆరోగ్యం గురించిన చింతన ప్రగతికి అవరోధం.

  – ప్లేటో

- భావం లోపించిన మనిషి రెక్కలు లేని పక్షిలాంటివాడు.

  – విలియం రాడ్‌ది

- రూపాలు వేరయినా హృదయాలు ఒక్కటి కావడమే నిజమయిన మైత్రి.

  – అరిస్టాటిల్

- విచక్షణాశక్తిలేని సామర్థ్యం నిరుపయోగం, చివరకు అది విషాదానికే దారి తీస్తుంది.

  – రూసో

- ఆచరణలో వాస్తవాల దృష్ట్యా సిద్ధాంతాలను మార్చుకోక తప్పదు.

  – కూపర్

సేకరణ: **దాసరి వెంకట రమణారావు**

# మృగ-తృష్ణ పై సమీక్షలు

మార్చి 'చతుర'లో ప్రచురితమైన తులసి బాలకృష్ణ నవల 'మృగ-తృష్ణ' పై మాకందిన ఉత్తమ సమీక్షలు




## 'పయోముఖి విషకుంభం'

*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

అధికారం అనేది రెండు వైపులా పదునున్న కత్తి లాంటిది. దాన్ని సరిగ్గా వినియోగించుకొని అద్భుతాలు సృష్టించవచ్చు. దుర్వినియోగపరచి ప్రళయాలు సృష్టించవచ్చు. ఎంతో నమ్మకంతో ప్రజలు తనకు కట్టబెట్టిన అధికారంతో వాళ్లకు ఎంతో సేవ చేయాలనుకున్న కళ్యాణచక్రవర్తి, ఒక స్వార్థపరుడ్ని పూర్తిగా నమ్మడంవలన ఎన్నో ఇబ్బందులను ఎదుర్కొనవలసి వచ్చింది!

నేరప్రవృత్తి కలిగిన స్వార్థపరుడైన దీనబంధు తన ఇమేజ్‌ను అమాంతం పెంచేసుకొనేందుకు ప్రకాశ్ అశక్తతను, బీదరికాన్ని ఆసరాగా తీసుకొని దాన్ని తనకనుకూలంగా రాక్షసకోతి రూపంలో మలుచుకొని, చివరి క్షణంలో అతన్ని మట్టికరిపించి గొప్ప పేరుప్రతిష్ఠలు సంపాదించుకోవాలనుకున్నాడు. కానీ తల్లి మరణం ద్వారా కనువిప్పు పొందిన ప్రకాశ్ చివరిక్షణంలో విజ్ఞత ప్రదర్శించి ఆనందరావు సాయంతో అతన్ని ఆటకట్టించడం ఆసక్తికరంగా సాగింది!

స్వార్థపరులు తాము అనుకున్నది సాధించడంకోసం ఎంత నీచానికి ఒడిగడతారో ఈ కథలోని దీనబంధు క్యారెక్టర్ ద్వారా

రచయిత బాగా చూపించాడు.

తన స్వార్థంకోసం అమాయకురాలయిన 'ముగ్ధ'ను దారుణంగా చంపి తన కన్నకొడుక్కే అన్యాయంచేశాడు. తనకేమాత్రం హాని తలపెట్టని కిష్టయ్య, కేశవరావులను మానసికంగా క్రుంగదీసి, తద్వారా చక్రవర్తిని ఒంటరివాణ్ని చేశాడు. తన పనుల కోసం కన్నబాబును, ఇంద్రాణిని పావులా వినియోగించుకున్నాడు.

ఇటువంటి దుష్టుడు, రాజకీయ జంబూకం, పయోముఖ విషకుంభం అయిన ఈ దీనబంధుకి కఠినాతికఠినమైన శిక్షపడాలని నేను కోరుకుంటున్నాను అని చివరగా 'సియం' చేత చెప్పించడం చాలా బాగుంది.

కథ మొదటి భాగమంతా నిదానంగా సాగినప్పటికీ, క్రమక్రమంగా వేగం పుంజుకుంటూ మనల్ని చివరిదాకా లాక్కెడుతుంది. కథలోని పట్టు ఏమాత్రం సడలకుండా ఉండేందుకుగాను ప్రధానపాత్ర చుట్టూ ఉన్న చిన్నచిన్న పాత్రలకు కూడా ఆమోదయోగ్యమయిన ఫ్లాష్‌బ్యాక్ ఏర్పరచడంలో రచయిత కృతకృత్యుడయ్యాడు.

కేవలం ఒక కోతి పాత్రద్వారా రాజకీయ కథను ఆద్యంతం ఆసక్తికరంగా నడిపించిన తులసి బాలకృష్ణగారు ఎంతైనా అభినందనీయులు!

**– పోలిశెట్టి కిషోర్‌కుమార్**
బుచ్చిరెడ్డిపాలెం

## రాజకీయ ప్రక్షాళన

*(రెండవ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

ఘనమయిన ప్రజాస్వామ్యం గల భారత దేశంలాంటి పెద్ద దేశాలలో విపరీతమయిన స్వార్థంగల రాజకీయ నాయకులున్న ఈనాటి కాలంలో ప్రజాసేవయే జీవిత పరమార్థంగా జీవించే నిస్వార్థపరులు కనబడటం చాలా కష్టం. శ్రీ కళ్యాణ చక్రవర్తి గారు మృగ-తృష్ణ నవలలో మహానుభావుడు, ప్రజా సంక్షేమవాది. పతివ్రతలు కొందరయినా ఉంటేనే ప్రపంచం నడుస్తుంది అన్నట్లుగా ఇంతటి నిస్వార్థరాజకీయ నాయకులు కొందరైనా ఉన్నప్పుడే ప్రజాస్వామ్యం మనుగడ కొనసాగిస్తుంది. లేకపోతే అది అరాచక వ్యవస్థకు దారితీసి ప్రజాసంక్షేమానికే భంగం వాటిల్లే ప్రమాదం ఉంది. దీనబంధు పేరు చూస్తే దీనులకు బాంధవుడు. గుణంలో మాత్రం రక్తాన్ని పీల్చుకుతినే మహా పాపిష్టి. ఇతనికి చక్రవర్తి భార్య, కుమారుల సపోర్ట్. ఇవి చక్రవర్తి నిస్వార్థతకు అడ్డంకిగా నిలిచాయి.

తులసిబాలకృష్ణగారు ఈ కథాంశాన్ని ఎన్నుకోవడం అభినందనీయం. భ్రష్టుపడుతున్న నేటి రాజకీయ వ్యవస్థను చక్కదిద్దే ప్రయత్నం చేశారు. మార్పును ఆశించారు. కేశవరావు, కిష్టయ్యల పాత్రలు చాలా గొప్పవి. ఒక గొప్ప మహానుభావునికోసం జీవితాన్నే త్యాగం చేసేంతటి మహా మనస్తత్వం గల వారి ప్రభుభక్తి అమోఘం. కేశవరావుగారి కూతురు ముగ్ధ మరణ సన్నివేశం పాఠకులకు కంటతడిపెట్టించి తండ్రీ-కూతుళ్ల ప్రేమ ఇంత గొప్పగా ఉంటుందా! అన్నట్లుగా ఉన్నది. ముగ్ధ యొక్క పాత్ర చిన్నదయినా మంచి ఆశయాలు లేని నేటి కొంతమంది యువతులకు మార్గదర్శకం.

ఇక రాక్షస కోతి. ప్రకాశంలాంటి మేధావులు ఇలా పెడతోవపట్టి రాక్షసకోతిలా నటించి ప్రజల్ని భయభ్రాంతుల్ని చేయడం వెనక ఒకేఒక కారణం పేదరికం. దీన్ని రూపుమాపాలి. నేటి ప్రభుత్వాలు వారి విజ్ఞానసంపదను దేశానికి ఉపయోగపడే దిశగా వాడుకుందుకు ప్రయత్నాలు జరగాలి. అప్పుడు ఎందరు దీనబంధులొచ్చినా ఏమీ చేయలేరు. దీనబంధు దుష్కార్యాలకు బాలకృష్ణగారు తన నవలలో చక్కని పరి

ష్కారాన్ని చూపారు.

**– జి. విజయలక్ష్మి**
జహీరాబాద్

## జగమెరిగిన సత్యం

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

స్వార్థం మనిషిని ఎంతటి నీచానికైనా దిగజారుస్తుందనేది జగమెరిగిన సత్యం. నాటినుండి నేటివరకు ఇక ముందు కూడా ఇలాగే సాగిపోతూనే ఉంటుంది. నిస్వార్థుల చేతుల్లోనే ఈ సమాజం మూడుపూవులు ఆరు కాయలుగా వర్ధిల్లుతుంది కాని ఆ మహామహులు ఎక్కడున్నారో వెదికి వెలికితీసే హక్కు, విజ్ఞత ఒక్క ఓటరుకే దక్కుతుంది. అంటే ఓటరే దేశాభ్యుదయానికి వెన్నెముకలాంటివాడు. ఈ పంథాలోనే నడిపిన కథే మార్చి నెల 'మృగ-తృష్ణ' చతుర నవల.

సబ్జెక్ట్ చిన్నదే అయినా నీతి బాగుంది. మంచి ఎప్పటికయినా జయిస్తుందనేది సర్వసాధారణం. నవల మొదట్లో ఏ పాత్రకి అంత ప్రాముఖ్యతనివ్వకుండా కేవలం దీనబంధుతోనే కథను నడిపారు. ప్రకాశం పాత్రని సస్పెన్స్‌గా ఉంచాలని చేసిన ప్రయత్నం వృధా అయ్యిందనే చెప్పాలి. రాక్షసకోతి ప్రకాశమనే నిజం నవల మొదట్లోనే పాఠకులకు అర్థమౌతుంది. రచయిత ఇంకొంచెం శ్రద్ధవహించి ఉంటే నవల బాగా రక్తికట్టేది. రచనాశైలిలో కూడా కొంత పటుత్వం తగ్గిందనే చెప్పాలి.

కళ్యాణచక్రవర్తి పాత్ర ముందుగా అతి మంచితనం ప్రదర్శించినా చివరకు సరైన నిర్ణయమే తీసుకున్నాడు. కానీ ఓ ప్రజా ప్రతినిధి తన పక్కలోనే మారణాయుధాన్ని పెట్టుకొని వూరంతా గాలించడం నాయకుడి సరైన లక్షణం కాదనిపిస్తుంది. కన్నబాబు విలనిజం నేటి యువతరానికి అద్దంపట్టింది. చివరకు నంది చేసిన పని అభినందించ దగ్గదయినా మొదట్లో జోకర్లా, మధ్యలో దేవదాసులా మలచడం ఆ పాత్రని హైలైటు చేయలేకపోయారు. ప్రతిపాత్ర నాటకీయంగా సాగిందేతప్పా సహజత్వానికి దగ్గరగా నడపలేకపోయినందుకు పాఠకుడికి కొంత నిరుత్సాహం కలిగించింది.

ఆనందరావు ఆడించిన నాటకంలో భాగంగా ప్రకాశం చివరి మలుపు చాలా బాగుంది. ఓ నిరుద్యోగి నిస్సహాయతని రాజకీయపు స్వార్థశక్తులు ఎలా వాడుకుంటారనే సత్యాన్ని చాలా బాగా చెప్పారు. ప్రకాశం, కేశవరావు, ముగ్ధలపాత్రలు సెంటిమెంట్‌గా కొంతవరకు న్యాయం చేకూర్చాయి. కథంతా అర్థమౌతూనే మధ్యలో కాస్త బోరు కొట్టించినా చివరివరకు చదివించిన ఘనత రచయిత దక్కించుకున్నందుకు అభినందనలు.

**– అవునలి ఆంజనేయులు**
హైద్రాబాద్

## దగ్గర సంబంధం

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

మార్చి నెల చతుర 'మృగ-తృష్ణ' నవల సమకాలీన సమాజంలో పదవికోసం స్వార్థపూరితులైన రాజకీయ నాయకులు ఆడుతున్న నాటకాలు ఎటువంటివి, అవి ప్రజలను ఏవిధంగా ఇబ్బంది పెడుతున్నాయి, దారిద్ర్యంలో ఉన్న ప్రకాశంలాంటి తెలివైన యువత ఏవిధంగా అక్రమార్కుల చేతిలో పావుగా మారుతున్నారు అన్న విషయాల్ని చక్కగా వివరించింది.

కళ్యాణచక్రవర్తిలాంటి రాజకీయ నాయకులుండడం ప్రస్తుత సమాజంలో

అరుదు. అత్యంత ఉన్నతమైన నగర మేయరు పదవిలో ఉండి కూడా తన ప్రాణాలను కాపాడిన పనివారిని ముందు లాగే ఆత్మీయంగా చూడడం బాగుంది. దీనబంధు పాత్రద్వారా బంధుత్వాన్ని, రాజకీయాలకు వాడుకున్న తీరు, ప్రజల దృష్టిలో హీరోగా పేరొందడానికి ఆడిన నాటకం ఇప్పటి సమాజంలో కొన్ని అసాంఘిక శక్తులు చేస్తున్న పనులను పోలి ఉండడం విశేషం.

ప్రకాశం పాత్రలో మంచితనం ఉన్నప్పటికీ అతనికున్న సమస్యలు, అతన్ని దారిద్ర్యం రాక్షసకోతి వేషం వేసేలా ప్రోత్సహించినా తరువాత దీనబంధు బ్లాక్‌మెయిలింగ్ అది కొనసాగేలా చేసింది. వీటికి దారిద్ర్యం మూలకారణం. ప్రస్తుత సమాజంలో దారిద్ర్యాన్ని తొలగిస్తే చాలా సమస్యలుండవని రచయిత నర్మగర్భంగా తెలిపారు. నంది పాత్రలోని అమాయకత్వం, ప్రేయసి మరణం అతనిలో తెచ్చిన తెగింపు సహజంగా వుంది. చివరకు ఆనందరావు అనే సైకలాజిస్ట్‌ను ప్రవేశపెట్టి సమస్యను పరిష్కరించినా ప్రకాశం ఆనందరావును, కళ్యాణచక్రవర్తిని ఎలా కలిశాడో సరిగా విపులీకరించలేదు. 'దీనబంధును అందరూ చీదరించుకున్నా పశ్చాత్తాపం రాకపోవడం విచారకరం. అందరి సమక్షంలో నిందితులను ప్రవేశపెట్టి ప్రజల కోతి భయాన్ని పోగొట్టడం చాలా బాగుంది. మొత్తానికి నవల ప్రస్తుత రాజకీయ సమాజానికి చాలా దగ్గర సంబంధమున్నట్లుగా ఉంటుంది.

– వి. వింధ్యారాణి
గండ్లపెంట

## జరుగుతున్న కథ

*(ఐదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

అధికార దాహంతో ఎటువంటి అకృత్యాలకైనా ఒడిగడుతూ క్షుద్ర రాజకీయాలు నడిపే దీనబంధువంటి స్వార్థశక్తులు నేటి సమాజంలో అడుగడుగునా దర్శనమిస్తున్నారు. ఇలాంటి వాస్తవ స్వరూపాన్నే మనకు మరోసారి మరొకరకంగా చూపించినది 'మృగ-తృష్ణ' నవల. సమకాలీన వాతావరణం ఇందులో స్పష్టంగా చిత్రీకరించబడింది. ఈ కేంద్రబిందువు ఆధారంగానే ఇందులోని పాత్రలూ, సన్నివేశాలూ, అన్యాయాలూ, బలహీనతలూ, అక్కడక్కడా ఎండమావుల్లాంటి మంచి విషయాలూ, ఇవన్నీ సాగాయి. అక్కడక్కడా కొద్దిపాటి అసహజ సంఘటనలూ, సినీఫక్కీలో పునరావృతం అయిన సంభాషణలూ దొర్లినా మొత్తంమీద ఒక జరుగుతున్న కథను అందించింది ఈ నవల 'మృగ-తృష్ణ'. ప్రస్తుతం నెలకొని వున్న ఎన్నికల వాతావరణంలో ఈ నవల రావడం కూడా సమయోచితంగా వుంది. కొంతైనా ఆలోచన కలిగిస్తుంది.

– వి. లక్ష్మి
హైద్రాబాద్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328.
Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Chennai: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060; Cuddapah: 70011; Tadepalli gudem: 28881; Warangal: 59933. Khammam: 55661; Ongole: 56777; Nizamabad: 45661; Mahabubnagar:77438; Mumbai: 022- 4703700; Chennai: 044-2314980; Bangalore: 080- 3503498

